టీ॥ తస్య=ఆజ్ఞాతికారకునికి, అనుసరణాత్ = వెనుకసంచరించడమువలన, దారాః=కళత్రకారకుఁడు, స్యాత్=అగును.

తా॥ ఆజ్ఞాతికారకునికి వెనుకనుండుటచే అతను కళత్రకారకుఁడు అని చెప్పఁబడును "తస్యదారాః" అని చెప్పినందువల్లనే ప్రకృతార్థము వచ్చుచుండగా చకారముకూడ నెందుకనగా ఒక్కదారపదమువల్లనేస్త్రీకారకత్వమునుగుఱించివిచారణచేయుటగాదు- సూత్రమునందు జెప్పఁబడని సమస్థిరకారకపద ఉపపదములు మొదలగువానివల్లనుకూడ స్త్రీకారకత్వమునుగురించి విచారణ చేయవలయుననెడి సూచనకొఱకట్లు చెప్పిరి.

పుత్రకారకవికల్పమాహ॥

సూ॥ మాత్రాసహపుత్రమేకే సమామనంతి॥ ౧౯॥

వ్యాఖ్యానమ్॥ మాతృకారకా త్పుత్రకారకవిచారః కార్యఇతి కేచనాచార్యావదంతి కారకద్వయైక్యంవదంతీయావత్ అథనిత్యాకారకాన్వక్తు ముపక్రమతే తతోదా భగిన్యాదికారకాన్దర్శయతి॥

టీ॥ ఏకే=కొందఱు,మాత్రాసహ=మాతృకారకునితోగూడ, పుత్రం=పుత్రకారకత్వమును, సమామనంతి=తలచుచున్నారు.

తా॥ మాతృకారకమువల్లనే పుత్రకారకత్వమునుగుఱించివిచారణచేయదగునని కొందరుచెప్పినందువలన పుత్రకారకత్వమునుగూర్చి వికల్పము జెప్పఁబడినది (తతోదా భగిన్యాదికారకాన్దర్శయతి)

సూ॥ భగిన్యాఽఽరతశ్శ్యాలఃకనీయాజ్జననీచేతి॥ ౨౦॥

వ్యాఖ్యానమ్॥ ఆరతోభౌమాద్భగినీ సామాన్యం శ్యాలః స్త్రీభ్రాతృకనీయాన్కనిష్ఠభ్రాతాజననీ మాతాఏతేవిచారణీయా ఇత్యర్థః॥

జాతకమునకు నిత్యకారకులు.

టీ. ఆరతః=అంగారకునివలన, భగినీ=తోబుట్టువ, శ్యాలః=భార్యకు సహోదరుఁడు, కనీయాన్=తమ్ముఁడు, జననీచేతి=తల్లియును, విచారణీయా=విచారించదగినది, ఇతి=ఇట్లని, ఏకే=కొందరు, సమామనంతి=చెప్పుచున్నారు.

తా॥ ఏగ్రహమువలన నేకారకములను విచారింపవలయునో అట్టి నియతకారకములనుగురించి చెప్పుచు ముందుగా భగిన్యాది కారకత్వములనుగురించి చెప్పుచున్నాడు- అంగారకునివలన తోబుట్టువు, భావమరిది, తమ్ముడు, తల్లి వీరినిగురించి విచారింపవలెను (నిత్యకారకు లందురు.)

మాతులాదికారకమాహ॥

సూ॥ మాతులాదయో బంధవ్యో మాతృ సజాతీయా ఇత్యుత్తరతః॥ ౨౧॥

వ్యాఖ్యానమ్॥ ఉత్తరతో భౌమాగ్రిమాద్బుధాత్ మాతులా మాతృభగిన్యాదయో బాంధవా మాతృసజాతీయా మాతృసపత్న్యశ్చవిచారణీయాః॥

టీ॥ ఉత్తరతః=అంగారకునకు తర్వాత గ్రహమగు బుధునివల్ల మాతులాదయః=మేనమామ మొదలుగాగల, బాంధవః=బంధువులును మాతృసజాతీయాః=సవతితల్లులు, విచారణీయాఇతి=విచారింపఁదగిన వారని చెప్పఁబడినది

తా॥ బుధునివలన మేనమామ మొదలగు బంధువులును, సవతితల్లులు, వీరికారకత్వమునుగురించి విచారింపవలయును

పితామహాదికారకమాహ॥

సూ॥ పితామహాఃపతిపుత్రావితి గురుముఖాదేవజానీయాత్॥ ౨౨॥

వ్యాఖ్యానమ్॥ గురుముఖాదేవ గుర్వాదిభ్య ఏకక్రమేణ పితామహపతిపుత్రాఇతి జానీయ్యాద్విచార్యా ఇత్యర్థః నచేదగ్రిమసూత్రే పత్నీపతిః పితరావితివాచ్యం మందాత్పుత్ర) ఇతి తృతీయసూత్రో ప్రాదానాపేక్షయాత్రైవ సువచత్వాత్ ఉర్వరితంత్వగ్రిమ సూత్రే నిబద్ధమన్యథా ముఖపదం వ్యర్థమేవస్యాదితి పత్న్యాదిషు॥

పితామహాది కారకములనుగురించి చెప్పుచున్నాడు

టీ॥ గురుముఖాదేవ=బృహస్పతి మొదలగు గ్రహములవలన, పితామహః=పితామహుడు, పతిపుత్రౌ = భర్తయు, కుమారుడును, ఇతి= ఈప్రకారముగ, విజానీయాత్ = తెలిసికొనవలయును.

తా॥ బృహస్పతివల్ల పితామహకారకత్వము, శుక్రునివల్ల పతి కారకత్వము, శనివల్ల పుత్రకారకత్వము విచారింపవలెను ఇట్లు చెప్పుటవలన ముందు సూత్రములో "పత్నీపతిఃపితరౌ" అని చెప్ప నక్కరలేదు- "మందాత్పుత్రః" అని మూడవసూత్రములో చెప్పుట వలన పైనచెప్పబడినవిధానమే యోగ్యముగానున్నది- యీసూత్రము ముందుసూత్రమునకు ననుసరించియే చెప్పబడినది - అట్లనుసరించి చెప్పబడనియెడల "ముఖ" పదము వ్యర్థమగుచున్నది.

పత్న్యాదిషుశుక్రకారకమాహ॥

సూ॥ పత్నీపితరౌశ్వశురౌమాతామహాఇత్యంతేవాసినః॥౨౩॥

వ్యాఖ్యానమ్॥ అంతేవాసినః - గుర్వగ్రేపతితాచ్ఛుక్రాత్ భార్యా మాతృపితృ శ్వశురశ్వశ్రూ మాతామహావిచార్యా ఇత్యర్థః వను కారకత్వేన ద్విత్రాదిగ్రహ సన్నిపాతే కమాల బ్యావిచార ఇతి సందేహేకలాధిక్యవతస్తత్రాపి సామ్యేనిసర్గబలవతఃకార్యఇతిరీతిస్తస్మా ద్గ్రహాణాం నిసర్గబలం సూచయది॥

శుక్రకారకత్వమునుగురించి చెప్పబడును.

టీ॥ అంతేవాసినః=బృహస్పతిసమీపవర్తియగుశుక్రగ్రహము వల్ల, పత్నీ=భార్యయు, పితరౌ = తల్లిదండ్రులు, శ్వశురౌ=అత్తమా మలు, మాతామహాః=తల్లియొక్క తల్లిదండ్రులు, విచారనీయాఇతి= విచారింపదగినవారని చెప్పబడినది.

తా॥ శుక్రునివల్ల భార్య, తల్లిదండ్రులు (అత్తమామలు) తల్లి యొక్క తల్లిదండ్రులు, వీరికారకత్వము విచారింపవలెను. ఒకానొక ప్పుడు రెండు మూడు గ్రహములకు కారకత్వము వచ్చుచుండగా ఆ సమానాంశలయందు దినములయొక్కయు గడియ యొక్కయు వెనక ముందును చూడవలెను అదియును సమానమైతే నిసర్గబలమును విచా రింపవలెను గనుక దిగువ సూత్రములయందు నిసర్గబలమును జెప్పు చున్నాడు నిసర్గబలంసూచయతి॥

సూ॥ మందోజ్యాయాన్గ్రహేషు॥ ౨౪॥

వ్యాఖ్యానమ్॥ మందః శనిః సప్తసుగ్రహేష్వజ్యాయాన్ దుర్బలః తథాచబృహజ్జాతకే॥ శ-కు-బు-గు-శు-చ- రాద్యావృద్ధితోవీర్యవంత ఇతి తథాచ నిసర్గబలే శన్యాదయః ఉత్తరోత్తరంబలిన ఇత్యర్థః శ్లో॥ మందావనీసూనుశశాంకపుత్ర వాగీశశుక్రేందు దివాకరాణాం। ఏకోత్తరంరూపమగ్రద్విభక్తం నైసర్గికంవీర్యముదాహరంతి॥ అథ చరదశావర్షానయనోపయోగితయాజయుగ్మరాశిభేదేన గణనాముపదిశతి॥

కారకత్వమునుగుఱించి రెండు మూడు గ్రహములు సమానముగానున్నయెడల నెవనిని ఆధారముచేసి చెప్పవలయునను విషయమునుగూర్చి చెప్పుచున్నాడు.

టీ॥ మందః=శనిః, గ్రహేషు = అన్నిగ్రహములలో, అజ్యాయాః=అధికుఁడు కాడు.

తా॥ అంశలచే సామ్యము కలిగినప్పుడు కళలచే నధికమైన గ్రహమును విచారింపవలయును, కలలతోడను సామ్యముకలిగినప్పుడు స్వభావసిద్ధమగు బలమును విచారింపవలయును. అందువలన గ్రహములకు స్వభావసిద్ధమగు బలమును జెప్పుచున్నాడు. శని యేడుగ్రహములలో దుర్బలుఁడనిచెప్పఁబడుచున్నాడు, శ్లో॥ శకుబుగుశుచరాద్యావృద్ధితోవీర్యవంతః॥ శని, కుజుడు, బుధుడు, గురువు, శుక్రుడు, చంద్రుడు, రవి, ఈ ౭ గ్రహములలో క్రమముగా శని మొదలుగ సూర్యునిపర్యంతము ఒకరికంటె నొకరు బలవంతులని బృహజ్జాతకమునందు చెప్పఁబడెనుగాన శని అందఱికంటె స్వభావసిద్ధముగా తక్కువ బలముకలవాడని తా.

సూ॥ ప్రాచీర్వృత్తిర్విషమభేషు॥ ౨౫॥

వ్యాఖ్యానమ్॥ విషమభేషు మేషమిథునాదిరాశిషుప్రాచీవృత్తిః క్రమగణనాస్యాత్ మేషవృషాదిరీత్యా గణనాస్యాదితియావత్ ॥

మూలక (చర) దశాసంవత్సరములను నిశ్చయించుటకుగాను ఓజ యుగ్మ రాసులప్రకారము లెక్కబెట్టవలయునుగావున దానిని గురించి చెప్పుచున్నాడు.

టీ॥ విషమభేషు = బేసిరాసులయందు, ప్రాచీవృత్తిః=క్రమముగా లెక్కబెట్టవలయును.

తా॥ ఆయుర్దాయమునునిర్ణయించుటకు మేషము, మిథునము, సింహము, తుల, ధనస్సు, కుంభము యీరాసులయందు క్రమనుగా లెక్కబెట్టవలయునని తా.

సూ॥ పరావృత్త్యోత్తరేషు॥ ౨౬॥

వ్యాఖ్యానమ్॥ ఉత్తరేషు సమరాశిషు వృషకర్కాదిషు పరావృత్త్యావ్యుత్క్రమేణ వృషమేషమీనాదిక్రమేణ గణనాభవతీత్యర్థః॥

టీ॥ ఉత్తరేషు= సమరాసులయందు, పరావృత్త్యా=వ్యతిరేకముగ లెక్కపెట్టవలయును.

తా॥ సమరాసులను లెక్కబెట్టునప్పుడు వృషభము, మేషము, మీనము మొదలగు వ్యుత్క్రమమున రాసుల లెక్కపెట్టవలెను.

సూ॥ నక్వచిత్॥ ౨౭॥

వ్యాఖ్యానమ్॥ ఓజరాశిషు క్వచిన్నక్రమః యుగ్మరాశిషు క్వచిద్వ్యుత్క్రమో నేత్యర్థః కుతేత్ర్యాకాంక్షాయాం పరంపరా ప్రతార్థేనచిరంతనైరుక్తం క్రమాద్వృషే వృశ్చికేచవ్యుత్క్రమాత్కుంభసింహయోరితిసూత్రత్రయ ఫలితార్థసంగ్రహస్త్వయం॥ మేషాదిత్రిత్రికైజ్ఞేయం పదమోజపదక్రమాత్ దశాబ్దాసయనే కార్యాగణనావ్యుత్క్రమాత్సమే॥ ప్రాచీవృత్తిర్విషమపదేషు పరావృత్త్యోత్తరే ఇతి కథం నోక్తమితిచేత్ యావదీశాశ్రయం పదమృక్షాణామితి వక్తవ్యత్వాత్సందేహభియానోక్తం॥ తథాచమాతృధర్మయోస్సామాస్యం విపరీతమోజకూటయోరితివక్తవ్యత్వాచ్చేతి అథతత్తదాశ్రేర్దశాబ్దాసయనాయావధిందర్శయతి॥

పైన చెప్పబడిన సూత్రములకు అపవాదమునుజెప్పుచున్నాడు.

టీ॥ క్వచిత్ = ఒకానొకప్పుడు, న = లేదు.

తా॥ ఓజరాసులను ఒకానొకప్పుడు వ్యుత్క్రమముగాను, సమరాసులను ఒకప్పుడు క్రమముగాను లెక్కపెట్టవలయును. ఎప్పుడనగా శ్లో॥ క్రమాద్వృషేవృశ్చికేచవ్యుత్క్రమాత్కుంభసింహయోః॥ అని పరంపరగా వృద్ధపరాశరులకారికలవలనఁ దెలియబడుచున్నది అనఁగా వృషభమునందు వృశ్చికమునందు క్రమముగాను, కుంభమునందు, సింహమునందు వ్యతిరేకముగాను లెక్కపెట్టవలయునని వృద్ధులచేఁ జెప్పఁబడినందున యీ ౨౧-౨౨-౨౭ సూత్రములకు ఫలితార్థమైయున్నది శ్లో॥ మేషాదిత్రిత్రిభైః జ్ఞేయం పదమోజపద క్రమాత్॥ దశాబ్దానయనేకార్యాగణనావ్యుత్క్రమాత్సమే॥ మేషము మొదలు మూడురాసులు బేసిపదమనియు, కర్కాటకము మొదలు మూడు రాసులు సమపదమనియు తుల మొదలు మూడురాసులు బేసిపదమనియు, మకరము మొదలు మూడురాసులు సమపదమనియు జెప్పఁబడినందున వృషభము, వృశ్చికము బేసిపదమునందలి రాసులనియు, సింహము, కుంభము సమపదమునందలి రాసులనియు పూర్వము చెప్పఁబడిన విధానమునకు వ్యతిరేకముగ జెప్పఁబడినది. దశాసంవత్సరములను ఈవిధిననుసరించియే లెక్కపెట్టవలయుననిరి. మేషాది 3 రాసులు ఓజపదమనియు, కర్కాటకము మొదలు మూడు రాసులు సమపదమనియు, ఆవిధముగానే మీనపర్యంతము చెప్పఁబడియున్నందున (ప్రాచీవృత్తిర్విషమపదే పరావృత్తోత్తరే)అని యెందుకు చెప్పలేదనిన "యావదీశాశ్రయంపదవృక్షాణాం" అని చెప్పదగిన దాని వలన సందేహాభయముచే చెప్పలేదు (మాతృధర్మయోస్సామాన్యం విపరీతమోజకూటయోః) అని ఆప్రకారముగానే చెప్పఁదగియున్నదని తాత్పర్యము.

సూ॥ నాథాంతాస్సమాః ప్రాయేణ॥ ౨౮॥

వ్యాఖ్యానమ్॥ అత్ర రాశీనాంనాథాగ్రింథాంతరోక్తాగ్రాహ్యాః అత్రానుక్తత్వాత్ తథాహిక్షితిజసితజ్ఞచంద్రరవి సౌమ్యసితావనిజాః

సురగురు మందసౌరి గురవశ్చ గృహాంశకపా ఇతి నాథానామవస్థాన
స్థైయత్వేనచరదశోచ్యతే కుత్రచర దశాపదే నవ్యవహార ఇతిచేత్
జగత్తస్థుషోరర్థయోగార్థే ఇత్యాదౌగృహాణ అత్రసమాః అబ్దానా
థాంతాః తత్తద్రాశీనాం తత్తద్రాశి నాథాశ్రిత రాశిపర్యంతం గ్రా
హ్యాః ఇతి ఏవంచనాథే ద్వితీయే ఏకాబ్దస్తృతీయేద్వౌ ఇతి క్రమేణ
ద్వాదశేనాథే ఏకాదశాబ్దాః తత్తద్రాశౌనాథేస్థితేసతితుద్వాదశాబ్దా
ఇతివివేకః తదుక్తంప్రాచ్యైః తస్మాత్తదీశపర్యంతం సంఖ్యామత్రదశాం
విదుః వర్షద్వాదశకం తత్రనచేదేకం వినిర్దిశేత్ అస్యార్థఃతత్తద్రాశౌ
నాథేస్థితే సతిద్వాదశవర్షాణి అసతితు ఏకాబ్దోగ్రాహ్యఇతి అత ఏవ
ప్రాయేణేతిపదేన నాథాంతాస్సమా ఇత్యస్యాపవాదః సూచితః ప్రా
యేణేత్యనేనైవ స్వామిన ఉచ్చత్వనీచత్వాభ్యామేకైకవర్షవృద్ధిహ్రాసా
వపిసూచితావేవ వృశ్చికకుంభయోర్ద్వినాథత్వమపి సూచితమేవ తదు
క్తంవృద్ధైః ఉచ్చఖేటస్యసద్భావే వర్షమేకంవినిక్షిపేత్ తథైవనీచఖేట
స్యవర్షమేకంవిశోధయేదితి అత్ర వృశ్చికకుంభయోర్విశేషోవృద్ధైరుక్తః
కుజసౌరికేతురాహూ రాజానావళి కుంభయోః కుజసౌరికేతురాహు
యుక్తౌ తత్స్థితౌయది వర్షద్వాదశకం తత్రనచేదేకం వినిర్దిశేత్ అయ
మర్థః వృశ్చికస్య కుజకేతూరాజానౌ తుతయోరేకైకమపి కుంభస్య
శనిరాహూరాజానౌ నత్వేకైకమపి తథాచద్వయోస్సత్వే ఏవవర్షద్వా
దశకంఏకైక సత్వేసామ్యభావఇత్యుక్తప్రకారేణ దశాబ్దగణనంకార్య
మితి అన్యరాశౌతదుభయసత్వే నాథాంతా ఇతిరీతిరనుసర్తవ్యాతయో
ర్భిన్నభిన్నరాశిసత్వేయ ఏవనాథోబలవాంస్తత్సంఖ్యాగ్రాహ్య ఏతదు
క్తంవృద్ధైః ద్వినాథక్షేత్రయోరత్రనిర్ణయఃకథ్యతేధునా ఏకస్వక్షేత్రగో
న్యస్తుపరత్రయదిసంస్థితః॥ తదాన్యత్రస్థితంనాథం పరిగృహ్యదశాంనయే
త్। స్వక్షేత్రేమిళితావేవస్వామినస్త్వేకశస్తథా॥ ఏకస్యస్వగృహస్థత్వం
నహికార్యోపయోగికం। ద్వావప్యన్యత్రగతౌచేత్స గ్రహోబలవా
న్భవేత్॥ గ్రహయోగసమానత్వే చింత్యంరాశిబలాద్బలం। చరస్థిరద్వి
స్వభావాః క్రమాత్స్యుర్బలశాలినః॥ రాశిసత్వసమానత్వే బహువర్షో

బలీభవేత్। ఏకస్యోచ్చగత స్తన్యఃపరత్రియదిసంస్థితః। గ్రిహాయేకు చ్చఖేటస్థంరాశిమన్యంవిహాయవై॥ నాథాంతాఇతిరీత్యాయోబహువర్ష వతీందశామ్ కరోతిబహువర్షోసౌస్వరాశేర్ధారగఃఖగః। ఏవంసర్వం సమాలోచ్య జాతస్యనిధనంవదేదితి స్పష్టార్థశ్లోకాః॥ ఏకస్యోచ్చేత్యస్యా ర్థః యదితుబహువర్షాదేకోరాజాపరక్షేత్రగః అపరస్తురాజాఅన్యక్షేత్ర గఏవ్చోచ్చగోల్పవర్షద స్తదా బహువర్షసంత్యక్త్వాల్ప వర్షదమేవోచ్చ గ్రిహమాశ్రిత్యనాథాంతా ఇతిరీత్యాబ్దానయనం కార్యమితి అన్యచ్చ వృద్ధైరుక్తం న్యాసయోర్గ్రిహ హీనత్వేవైక స్యాన్యేన సంయుతౌ గ్రి హ్యోరాశిగ్రహాభావ స్తత్స్వామ్యుచ్చంగతోయది ఏకత్రిస్వర్క్ష గఃఖేట స్త్వన్యత్రద్వౌగ్రహౌయదిగ్రహద్వయయుతంహిత్వా గ్రాహ్యేత్స్వా ర్ద్వభంసుధీరితి అయమర్థః న్యాసయోర్లగ్నసప్తమయో ర్ద్వయోఃస్థాన యోర్గ్రహాభావే అథవాబ్దయోర్మధ్యే ఏకస్యాన్యేనకే నచిద్గ్రిహేణ స్వేశాతిరిక్తేనయుతౌసత్యాంచ తత్రియోరాశిర్న్యాయేన నిర్బలస్థరాశి స్తదాత్రీశే ఉచ్చంగతేసతిబలవానేవనాపరః సగ్రిహోపిఏకత్రరాశౌ స్వక్షేత్రగోగ్రహః అపరత్రద్వౌ గ్రిహౌ స్త స్తదాస స్వామికరాశిరేవ బలవానితిద్వితీయ పద్యతాత్పర్యం ఉచ్చరాశయస్తు అజవృషభమృ గాంగనాకుళీరా ఝషవణిజౌచ దివాకరాదితుంగాః దశశిఖిమనుయుక్తి థీందిృియాంశైః స్త్రినవక వింశతిభిశ్చతే స్తనీచాఇతిపంచమేవక్రమా త్ప్రోక్ప్రిత్యుక్తమితి వక్ష్యమాణసూత్రాత్ క్రమవుస్త్రక్రమభేదేన దశాలేఖ్యా ఆరంభవిధిస్తులగ్నమేవ చరదశాయాంమత్రిశుభం కేతురితి సూత్రాదశ్యాదశాయాశ్చర దశేతినామబోధ్యమ్॥

ఆయారాసులయొక్క దశాసంవత్సరములను దెలియుటకు అవ ధిని జెప్పుచున్నాడు.

టీ॥ సమాః=సంవత్సరములు, ప్రాయేణ=తఱుచుగా, నాథాం తాః=ఆయారాసులయొక్క అధిపతిపర్యంతము చూచుకొనవలెను.

తా॥ 'అనుక్తమన్యతోగ్రాహ్యం' అను ప్రమాణమువనుసరించి గ్రంథాంతరమందు జెప్పఁబడిన రాశీశ్వరులను ముందుగా దెలిసికొన వలసియున్నది - శ్లో॥ క్షితిజసితజ్ఞచంద్రరవిసౌమ్యసితావనిజాః। సుర

గురుమందసౌరిగురవశ్చగృహాంశకపాః ॥ అను బృహజ్జాతకవచనానుసారము కుజుడు, శుక్రుడు, బుధుడు, చంద్రుడు, రవి, బుధుడు, శుక్రుడు, కుజుడు, గురువు, శని, శని, గురువును మేషాదిగాపండ్రెండు రాసులకు క్రమముగా నధిపతులగుదురు.

| | | | |
|---|---|---|---|
| ౧౨ గు | ౧ కు | ౨ శు | ౩ బు |
| ౧౧ శ | మేషాది మీన పర్యంతము | | ౪ చం |
| ౧౦ శ | | | ౫ ర |
| ౯ గు | ౮ కు | ౭ శు | ౬ బు |

మేషవృశ్చికములకు కుజుడును, వృషభతులలకు శుక్రుడును, మిథునకన్యలకు బుధుడును, కటకమునకు చంద్రుడును, సింహమునకు సూర్యుడును, ధనుర్మీనములకు గురుడును, మకరకుంభములకు శనియును అధిపతులగుదురు. రాశ్యధిపతి ద్వితీయమందున్నయెడల ఒక్క సంవత్సరమనియు, మూడింటనుండినయెడల రెండుసంవత్సరములనియు ఈప్రకారము పండ్రెండు స్థానములపర్యంతము నొక్కొక్క సంవత్సరము తగ్గింపుచు రాగా ద్వాదశస్థానమునకు పదకొండు సంవత్సరములనిచెప్పవలయును. ఆయారాశినాథుడు స్వరాశియందేయున్న యెడల పండ్రెండుసంవత్సరములని తెలిసికొనవలయును. యిందును గురించి ప్రాచీనులు చెప్పినదేమనగా- శ్లో॥ తస్మాత్తదీశపర్యంతం సంఖ్యామత్ర దశాంవిదుః । వర్షద్వాదశకం తత్ర న చేదేకం విసర్జయేత్ ॥ ఆయారాశియందు రాశ్యధిపతి యున్నయెడల పండ్రెండుసంవత్సరములును లేనియెడల స్థానానుగుణ్యముగ నొక్కొక్కసంవత్సరముచొప్పునను లెక్కపెట్టుకొనవలయుననిరి. అందువల్లనే "ప్రాయేణ" అనెడు పదమువలన "నాథాంతాసమాః" అనెడు వాక్యమునకు అపవాదము

చెప్పఁబడినది "పాత్రియేణ" అని చెప్పుటచే రాశ్యధిపతికి ఉచ్చత్వ నీచత్వాధికారములచే సంవత్సరములను హెచ్చించుట తగ్గించుటయు సూచన చేయఁబడినది, వృశ్చికకుంభములకు రెండేసి గ్రహములధిపతు లగుటయు సూచింపబడెను అదియెట్లనగా- శ్లో॥ ఉచ్చఖేటస్యసద్భావే వర్షమేకం వినిక్షిపేత్ । తథైవనీచఖేటస్య వర్షమేకంవిశోధయేత్ ॥ ఇట్లు వృద్ధవాక్యానుసారముగ ఉచ్చరాశియందుండు గ్రహమునకు పూర్వగణనాప్రకారముగాక యింకొకసంవత్సరము హెచ్చింపవలయు ననియు, నీచరాశియందుండు గ్రహమునకు ఒకసంవత్సరము తగ్గించ వలయుననియు తెలియఁబడుచున్నది మఱియు శ్లో॥ కుజ సౌరీ కేతురా హూ రాజానావలి కుంభయోః కుజసౌరీ కేతురాహూ యుక్తౌ తత్రి స్థితౌయది వర్షద్వాదశకం తత్ర న చే దేకం వినిర్దిశేత్॥ అనెడు శ్లోక ప్రకారము వృశ్చికమునకు కుజకేతువులు ఇద్దరును కుంభమునకు శనిరాహువులిద్దరును ఆధిపత్యముకలవారై యుండుటచే వృశ్చికము నందు కుజకేతువులును, కుంభమునందు శనిరాహువులును కలసి యుం డినపక్షమునందే పండ్రెండుసంవత్సరములు లెక్కపెట్టవలయును గాని లేక ఒక్కగ్రహమే యున్నయెడల ఆరాశ్యధిపతి ఆరాశియందు లేని దానినిగానే యెంచి ఒక్క సంవత్సరముగానే లెక్కపెట్టవలయును, ఆరెండుగ్రహములు ఇతరరాశియందు కలసియున్నయెడల "నాథాం తాన్సమాః" అనెడు సూత్రప్రకారము చూచుకొనవలయును. వారు వేరువేరు రాసులయందున్నయెడల ఏరాశినాథుడు బలముకలవాడై యుండునో వానిసంఖ్యయే గ్రహింపవలయును, ఇందునుగుఱించి వృద్ధ వాక్యప్రామాణ్యమెట్లనగా- శ్లో॥ ద్వినాథక్షేత్రయోరత్ర నిర్ణయః కథ్యతేధునా। ఏకస్స్వక్షేత్రగోఽన్యస్తు పరత్రయదిసంస్థితః। తదాన్య త్రస్థితంనాథం పరిగృహ్యాదశాంనయేత్। స్వక్షేత్రేమిలితావేవ స్వామి నస్త్వేకశ స్తథా॥ ఏకస్యస్వగృహస్థత్వం నహికార్యోపయోగికం। ద్వా వప్యన్యత్రగౌ చేత్స్యగ్రహోబలవాన్భవేత్। గ్రహయోగసమానత్వే చింత్యంరాశిబలాద్బలం॥ చరస్థిర ద్విస్వభావాః క్రమాత్పూర్వబలశాలి నః। రాశిసత్వసమానత్వే బహువర్షోబలీభవేత్। ఏకస్యోచ్చగతస్త్వ

న్యాఃపరత్రయదిసంస్థితః । గ్రాహయేదుచ్చఖేటస్తం రాశిమన్యంవిహాయ వై. నాధాంతా ఇతి రీత్యా యో బహువర్షవతీందశాం కరోతి బహువర్షోసా స్వరాశే దూరగః ఖగః ఏవం సర్వం సమాలోచ్యజాతస్య నిధనం వదేత్ ॥ దీనిభావమేమనగా ఇద్దరుఅధిపతులుగల క్షేత్రములను గుఱించి నిర్ణయము చేయబడుచున్నది. ఒక్కగ్రహము స్వక్షేత్రము నందుండి రెండవగ్రహము ఇతరక్షేత్రమునందున్నయెడల నితరక్షేత్రమునందున్న గ్రహమునుబట్టియే దశనెంచవలయును. ఆ యధిపతులిద్దరు స్వక్షేత్రముసందే కలిసియున్నయెడల వారిలో నొకనియొక్క స్వక్షేత్రస్థితి యుపయోగము లేదు- ఇద్దరును పరక్షేత్రమునందేయున్న యెడల వారిలో బలవంతుడెవడో వానిననుసరించి చెప్పవలయును. రెండు గ్రహములకు సమానబలము కలిగినప్పుడు రాశిబలముననుసరించి చెప్పవలయును రాశిబలమెట్లనగా చరరాశికంటె స్థిరరాశియు, స్థిరరాశికంటె ద్విస్వభావరాశియు ఉత్తరోత్తరము బలముగలవి. రాశిబలము సమానముగ నుండినప్పుడు విశేషసంవత్సరములుగలగ్రహము బలకరమైనది ఒకగ్రహము ఉచ్చయందుండి రెండవగ్రహము పరక్షేత్రమునందున్నయెడల ఇతరరాశిబలమునువిడిచి ఉచ్చస్థానమునందున్న గ్రహమునుబట్టియే చెప్పవలయును "నాధాంతాః" అను సూత్రప్రకారము బహుసంవత్సరములుగల గ్రహము స్వరాశికంటె దూరమందుండినను ఎక్కువ సంవత్సరముల నిచ్చునది కాబట్టి దానినిబట్టియే చెప్పవలయును. మఱియు నా రెండు గ్రహములలో నొక గ్రహము బహుసంవత్సరములుకలదై పరక్షేత్రమునందుండి రెండవ గ్రహము స్వల్పసంవత్సరములుకలిగి యితరక్షేత్రమైనప్పటికి నుచ్చరాశియందున్నయెడల బహుసంవత్సరముల నిచ్చువాడైనను దానినివిడిచి యుచ్చరాశియందున్న గ్రహముననుసరించియే దశను నిర్ణయింపవలయును. మఱియు నింకొక వృద్ధవాక్యప్రామాణ్యముకలదు- శ్లో॥ న్యాసయోర్గ్రహహీనత్వేవైకస్యాన్యేనసంయుతౌ । గ్రాహ్యోరాశిర్గ్రహాభావస్తత్స్వామ్యుచ్చగతోయది ॥ ఏకత్రిసక్షగః ఖేటశ్చాన్యత్రద్వౌగ్రహౌయది । గ్రహద్వయయుతింహిత్వా గ్రాహయేత్పూర్వభం సుధీః ॥

అనఁగా లగ్నసప్తమస్థానముల రెండింటియందును నే గ్రహము లేకుండినను లేక ఆరెండుస్థానములలో నొకస్థానమునందు ఆరాశ్యధిపతిగాక మరియొకగ్రహముండినను వాటిలో నేరాశి బలరహితముగనుండునో ఆరాశియొక్క యధిపతి యుచ్చస్థానమందున్న యెడల వాని రాశియే బలకరమైనది. ఒకస్థానము గ్రహమునకు స్వక్షేత్రమై ఆరాశియందే యుండి రెండవస్థానము ఇతరములగు రెండుగ్రహములతో కూడియుండినను స్వక్షేత్రరాశినే గ్రహింపవలయును ఉచ్చరాశి వివరము బృహజ్జాతకమునందు- శ్లో॥ అజవృషభమృగాంగనాకులీరా ఝషవణిజౌచ దివాకరాదితుంగాః। దశశిఖిమనుయుక్తిథీంద్రియాంశై స్త్రిణవకవింశతిభిశ్చ తేస్తనీచాః॥ అనఁగా మేషము, వృషభము, మకరము, కన్య, కర్కాటకము, మీనము, తుల ఈ యేడురాసులును సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని ఈ ౭ గ్రహములు మేషాది ఉచ్చరాసులు ఆయారాసులకేడవరాసులు నీచరాసులని జెప్పఁబడుచున్నవి- ఆయుచ్చనీచరాసులందు రవ్యాదులకు క్రమముగా ౧౦, ౩, ౨౮, ౧౫, ౫, ౨౭, ౨౦ యివి క్రమముగా పరమోచ్చభాగములు. రాశినాథులు ఉచ్చులైనయెడల సంవత్సరమును వృద్ధిజేయవలెను, నీచులైనయెడల ఒకసంవత్సరము తగ్గించవలెను, స్వక్షేత్రమందున్నవానికి ౧౨ సంవత్సరములు, రెండవయింటనున్న వానికి ఒకసంవత్సరము- (౩=౨) (౪=౩) (౫=౪) (౬=౫) ౭=౬) (౮=౭) (౯=౮) (౧౦=౯) (౧౧=౧౦) (౧౨=౧౧)సంవత్సరములు లెక్కింపవలయును.

## బాలబోధ.

"నాథాంతాః సమాః ప్రాయేణ ప్రాచీవృత్తిర్విషమభేషు, పరావృత్త్యోత్తరేషు" అను సూత్రములప్రకారము జన్మలగ్నము విషమరాశియైనప్పుడు లగ్నాదిసవ్యముగను, సమరాశియైనప్పుడుఅపసవ్యముగనుద్వాదశరాశిదశలను గణించవలయును. అట్లు చేయునప్పుడు ప్రతి రాశినాథుడు వానింటికి సవ్యాపసవ్యక్రమముచేత యెన్నవరాశియందుండునో అన్నిసంవత్సరములు తద్రాశిదశాసంవత్సరములుగ ద్వాదశ

రాశులయందును దశలు నిర్ణయించుకొనవలయును. మఱియు సంవత్సరము ౧ సద్బలునికి అధికముగ దుర్బలునికి తక్కువగ ౧౨ సం॥ వ్వరాశిగతునికిని కల్పించవలయును. మఱియు నీజైమినిగ్రంథంబున ఆయుర్నిర్ణయమొనర్చుటకు హోరా, దర్పణ, శూల, బ్రహ్మ, మహేశ్వర, చర, స్థిర, మండూక, కారక, వర్ణద, ఆత్మనాడీ, ఆత్మనోభావపాంశాది ఆయుర్మారక దశాభేదములు కలిగియున్నవి. సంవాదపత్రము నంగీకరించవలసినదని చెప్పినందున ప్రతిజాతకమునందును "ప్రాయశః" బహుదశలను పరిశీలించి ఏకవాక్యము నంగీకరించవలసినది. ఇన్నివిధములైన ఆయుర్మారకదశాభేదములను జెప్పుటకీతావు ముఖ్యమైయుండగా నిచ్చట ఏలవివరించలేదని కొందరనుకొనవచ్చును నూతనాభ్యాసకులకు బుద్ధి భ్రమకలుగునుగాన విశేషము ఈ గ్రంథమందు ఆమతములన్నియు వ్రాయబడదు.

| | | | |
|---|---|---|---|
| చం | | రా | |
| శు | ఆంగీరస సం॥<br>పుష్య శు ౬<br>స్థిరవారం | | |
| | | | గు |
| ర శ | బు-కే<br>లగ్నం | కు | |

యిచ్చట
వృశ్చికమునకు
ఆరూఢము
కన్యారూఢము

ఉదాహరణము—ఈజాతకమునకు ఆత్మకారకుడైన బుధునికి అష్టమాధిపత్యమును పాపసంబంధముకలిగి లగ్నమందుండ మున్ను రుద్రస్థానము మిధునము కావడమున్ను యీహేతువులచేత ఆయుర్దాయమునకు మూలము బుధుడేగదా— సూ॥ స్వకర్మచిత్తరిపురోగనాథప్రాణీమారకః। చిత్తనాథప్రాయేణ॥ అను సూత్రములవల్ల ఆత్మకారకునికి తృతీయ- షష్ఠ- అష్టమ- వ్యయాధిపతులలో మారకలక్షణలక్షితమైన గ్రహము శనియై గాఢాస్తమయమును బొంది రాశ్యంత

గతుడై మృతావస్థయందున్నందున యీ శని క్షేత్రమైన మకరము మారకరాశి అయినదిగదా అయితే "నాథాంతాః సమాః ప్రాయేణ ప్రాచీర్వ్యత్వ్రిత్రిపమభేషు పరావ్యత్యోత్తరేషు॥ " అను సూత్రముల వలన లగ్నము మొదలు అపసవ్యముగ దశలు నయించు నెడల లగ్న దశాసం॥ ౨॥ తుల ౫, కన్య ౧౧, సింహం ౫, కటకం౫, మిథునం౬, వృషభం ౮, మేషం ౭, మీనం ౮, కుంభం ౧౧, ఇంత పర్యంతం జన్మాది ౬౮ సం॥ అనంతరం మకర శని దశాప్రారంభము కొందఱు శనిని మకరమందు వ్రాసినారు అటుకుమందు శని స్వక్షేత్రబలముగల వాడై నందున మకరదశాసంవత్సరములుగూడ చేర్చవలెనని తా.

సూ॥ యావదీశాశ్రయంపదమృక్షాణామ్॥ ౨౯॥

వ్యాఖ్యానమ్॥ అథాగ్రేఫలవిశేష జ్ఞాపనాయరాశీనా మారూఢాపదపర్యాయం పదముపదిశతి ఋక్షాణాంరాశీనాం ఈశాశ్రయం యావత్ ఈశాశ్రయరాశిపర్యంతం యాసంఖ్యాతామీశాశ్రయాదగ్రే ప్రణీయతత్సంఖ్యాయస్మిన్రాశౌసమాప్తా తదాశ్రిత్యగ్రహాస్వామి శరాశేః పదంస్యాదిత్యర్థః నను ఈశాశ్రయాదగ్రేప్రణీయేత్యర్థః కథం ఉచ్యతే యావాంశ్చాసావీశశ్చయావదీశః ఆశ్రయోయస్యతద్యావదీశాశ్రయంపదమితిసమాసాల్లబ్ధ ఇతితదేవవృద్ధైరుక్తం॥ శ్లో॥ లగ్నాద్యావతిథేతిష్టే ద్రాశౌలగ్నేశ్వరఃక్రమాత్। తతస్తావతిథంరాశిం జన్మారూఢంప్రచక్షతే॥ లగ్నాల్లగ్నపతిర్యావ ద్రాసినంస్థస్తతఃపునః। తావాన్పషిభిరారూఢః కథితస్సర్వశాస్త్రతః ॥ యదాలగ్నాధిపోలగ్నే సప్తమే వాస్థితోయది ఆరూఢంలగ్నమేవాత్ర నిర్దిశేత్కాలవిత్తమః ఇదంచ శ్లోకేనలగ్నపదంనిరుక్తం పదాంతరాణామప్యుపలక్షణంబోధ్యమ్ శ్లోకాస్స్పష్టార్థాః॥

ఆరూఢపదమునుగుఱించి చెప్పఁబడును.

టీ॥ ఋక్షాణాం=రాసులకు, యావత్ = యంతపర్యంతము, ఈశాః=అధిపతులు నివశించుచున్నారో, తావత్ =అంతపర్యంతము, పదం=ఆరూఢపదము, స్యాత్ =అగును.

తా॥ ముందుఫలవిశేషము తెలుపుటకు "ఆరూఢ" పదమనెడు మఱియొక స్థానమునుగుఱించి చెప్పుచున్నాడు. ఏ లగ్నమునుగురించి విచారింపఁబడుచున్నదో ఆలగ్నాధిపతి యేరాశియందుండునో ఆరాశి పర్యంతము లగ్నము మొదలుగ నెంతసంఖ్యయగునో అన్ని రాసులను ఆగ్రహముండు రాశిమొదలు లెక్కింపగానగు రాశి ఆగ్రహమునకు ఆరూఢలగ్నమని లేక పదమని చెప్పఁబడును. శ్లో॥ లగ్నాద్యావతిథే త్రిషే ద్రాశౌలగ్నేశ్వరఃక్రమాత్। తతస్తావతిథంరాశిం జన్మారూఢం ప్రచక్షతే। లగ్నాల్లగ్నపతిర్యావద్రాశిసంస్థస్తతఃపునః। తావాన్నృషిభి రారూఢః కథితస్సర్వశాస్త్రతః॥ అని వృద్ధులచేజెప్పఁబడినది మఱియు శ్లో॥ యదాలగ్నాధిపోలగ్నే సప్తమేవాస్థితోయది। ఆరూఢంలగ్నమే వాత్ర నిర్దిశేత్కాలవిత్తమః॥ లగ్నాధిపతి లగ్నమందున్నను సప్తమ స్థానమందున్నను ఆలగ్నమే ఆరూఢలగ్నమగుచున్నదని తా.

బాలబోధ.

జననలగ్నముగాని ఇతరభావములుగాని తత్తధిపతులుతత్తద్భావములకు ఎన్నవరాశియందుందురో వారికి అంత సంఖ్యగల రాసులు తద్భావారూఢములగును. ఇందునుదాహరణం॥ తులాలగ్నము లగ్నాధిపతి పంచమగతుడయినప్పుడు తత్పంచమంబగు మిథునము లగ్నారూఢము. ధనాధిపతి ధనస్థానమునకు అష్టమగతుడైనప్పుడు వానికి అష్టమంబగు మకరము ధనారూఢము ఇటూహ్యంబులు. ఈవిధము గనే వ్యయభావమువల్ల సంభవించిన ఆరూఢము ఉపారూఢమనఁబడును.

సూ॥ స్వస్థేదారాః॥ 30॥

వ్యాఖ్యానమ్॥ అథారూఢోదాహరణ రూపం సూత్రద్వయమాహ॥ లగ్నాత్స్వస్థేచతుర్థస్థేలగ్నస్వామినిదారాః సప్తమస్థోరాశిర్లగ్నారూఢోభవతి॥ సంకేతమాత్రాపేక్షమిదం నతుకటపయాదిసంజ్ఞాపేక్షం॥

టీ॥ స్వస్థే = లగ్నాధిపతి చతుర్థ స్థానమందున్న యెడల, దారాః=సప్తమస్థానము ఆరూఢలగ్నమగుచున్నది

తా॥ ఆరూఢలగ్నమునకుదాహరణరూపమగు రెండు సూత్రిములను జెప్పుచున్నాడు. లగ్నాధిపతి చతుర్థ స్థానమందున్న యెడల యేడవరాశి ఆరూఢమగుచున్నది.

సూ॥ సుతస్థేజన్మ॥ ౩౦॥

వ్యాఖ్యానమ్॥ లగ్నాత్సప్తమస్థే లగ్నస్వామినిలగ్న ఆరూఢోభవతీత్యర్థః యావదీశేతిసూత్రేణైవసిద్ధే ఏతత్సూత్రిద్వయ ముదాహరణద్వారా స్పష్టార్థంకరణమితి యత్తుఆద్యైః స్వస్థేదారా విచారణీయాః సుతస్థేభాత్రిజన్మ చార్యమిత్యుక్తం తదసంగత మేవప్రతిభాతి॥

టీ॥ సుతస్థే = లగ్నాధిపతి సప్తమస్థానమందున్నవాడగుచుండగా, జన్మ=జన్మలగ్నము ఆరూఢమగుచున్నది.

తా॥ లగ్నాధిపతి లగ్నమునుండి సప్తమస్థానమందున్న యెడల లగ్నము ఆరూఢమగుచున్నదని చెప్పబడినది. ఈ యభిప్రాయము యావదీశాశ్రియం పదమృక్షాణాం అనెడు సూత్రిమువల్లనే తెలియబడుచుండగా తిరిగి ఈరెండుసూత్రములను జెప్పుట స్పష్టముగానుదాహరణముతో విశదీకరించుటకని తెలియదగియున్నది.

సూ॥ సర్వత్రిసవర్ణాభావారాశయశ్చ॥ ౩౧॥

వ్యాఖ్యానమ్॥ అథాత్రభావరాశిబోధక పదానామన్య శాస్త్రోక్తవైలక్షణ్యమాశంక్యాహ భావారాశ యశ్చసవర్ణాఃవర్ణేనసహితాః సవర్ణాఏకాదిసంఖ్యాబోధ కాక్షరగమ్యాః సర్వత్ర గ్రంథే నను సిద్ధమన్యదితి వక్ష్యమాణత్వాత్ శివతాండవాది గ్రంథేషు కటపయాది వర్ణైః సూచితసంఖ్యాప్రసిద్ధైవ కిమర్థమిదం సూత్రిమితినచ భావరాశి గ్రహసాధారణ్యేన బోధః స్యాదితివాచ్యం భావరాశీనాం సంఖ్యాప్రాధాన్యత్వాత్ గ్రహాణాంతు గ్రహవాచకపదప్రాధాన్యత్వాత్సాధారబోధోనస్యాత్కిమర్థం సర్వత్రేతి సూత్రమిత్యాశంక్యవర్గపదం రాశిపరమేతదితి ప్రకారాంతరేణ తత్సూత్రిం వ్యాఖ్యాయతే సర్వత్రిసవర్ణాభావారాశయశ్చ భావారాశయశ్చ సవర్ణాఃవర్గేనవర్గ దేనసహితాః సవర్ణాభవంతి వర్ణదా నయనప్రకార స్త్విత్థం వృద్ధైరుక్తః ఓజలగ్నప్రి

సూతానాం మేషాదేర్గణయేత్క్రమాత్। యుగ్మలగ్నప్రసూతానాం మీనాదేరపసవ్యతః॥ మేషమీనాదితో జన్మలగ్నాంతం గణయేత్సుధీః॥ తథైవహోరాలగ్నాంతం గణయిత్వాతతఃపరం॥ పుంస్త్వేనస్త్రీతయా వై తేసజాతీయే ఉభయేయది। తర్హి సంఖ్యేయోజయిత్వైజాత్యేతువియోజయేత్॥ మేషమీనాదితః పశ్చాద్యోరాశిస్సతువర్ణదః ఓజయుగ్మలగ్నానులోమేనయోజనశోధనోత్తరం ద్వాదశాధికే రవి ౧౨ తష్టం కృత్వాయత్స్థితంతన్మేషమీనాదిక్రమ వ్యుత్క్రమగణనయాయోరాశిర్లభ్యతేసవర్ణద రాశిరితిబోధ్యం హోరాలగ్నే భయోర్నయాదుర్బలాద్వర్ణదాదశా యత్సంఖ్యోవర్ణదో లగ్నాత్తత్తత్సంఖ్యాక్రమేణతు క్రమవ్యుత్క్రమభేదేన దశాస్యాత్పురుషస్త్రియోః లగ్నాద్యత్సంఖ్యాకోవర్ణదరాశిస్తత్సంఖ్యాక్రమతఃఓజయుగ్మలగ్నానురోధేనప్రథమప్రవృత్తక్రమవ్యుత్క్రమమర్యాదయా తత్తద్రాశీనాం దశాస్యాదితియథానాథాంతా ఇతిసూత్రేస్వస్వరాశేర్నాథాంతం వర్షాణ్యానీతానితథాత్ర లగ్నాదేవ వర్ణదపర్యంతం వర్షాణ్యానేయానీతి మేషమీనాదితః పూర్వోక్తరీత్యా ధనభావాదితత్తద్భావాంత గణనాంవిధాయ పూర్వవత్ప్రరణే తత్తద్భావవర్ణదరాశయోభవంతీతి సర్వత్రేతిపదేనసూచితం నచ వర్ణదానయనం వర్ణదదశానయనంచసూత్రాద్ధాన్నాయాతీతివాచ్యం సిద్ధమస్యాదితిసూత్రాదన్యర్షి శాస్త్రప్రసిద్ధత్వాదత్రనోక్తం ప్రాచీనైః సంగృహీతమితి గుళికోపితథైవ యథావర్ణదో రాశిర్లగ్నేజత్వ యుగ్మత్వభేదేన మేషమీనాదిగణన జన్మలగ్న హోరాలగ్న పర్యంతం సంఖ్యావశతః సమానీస్తదైవ భావలగ్నమేవజన్మలగ్నంవిభావ్యభావవర్ణదరాశినేయ ఇతిభావలగ్నానయనసంవృద్ధైరుక్తం సూర్యోదయం సమారభ్య ఘటికానాంతు పంచకం ప్రయాతిజన్మపర్యంతం భావలగ్నం తథైవచ తథాసార్ధద్విఘటికాసు తాత్కాలాద్విలగ్నభాత్ ప్రయాతి లగ్నంతన్నామహోరాలగ్నం ప్రచక్షతఇతి స్పష్టార్థాశ్లోకా హోరాలగ్నస్పష్టీకరణంతు సార్ధద్వయఘట్యాచేత్త్రింశదంశాల్లభ్యంతేతర్హి ఇష్టఘట్యాకిమితిత్రైరాశికేనజ్ఞేయం భావలగ్నంహోరాలగ్నంచ జన్మలగ్నాద్గణనీయమితి హోరాలగ్నానయనే జన్మలగ్నేవిష మేసతిసూర్య

రాశితోజన్మలగ్నే సమేసతితుజన్మలగ్నాద్గణయేత్ సూర్యోదయమారభ్యయావంత్యో హోరాఇష్టకాలపర్యంతంజాతాస్తాః సూర్యాల్లగ్నాద్వాపరిగణనయాంతిమం హోరాలగ్నం జ్ఞేయమితిప్రాచీనాః కారికాత్రయమర్థోనాయాతీతి వర్ణదరాశితః ఫలముక్తంవృద్ధైః పాపదృష్టః పాపయోగోవర్ణదస్య త్రికోణకేయదిస్యాత్తర్హితద్రాశిపర్యంతం తస్య జీవనం రుద్రశూలేతథైవాయుర్మరణాదినిరూప్యతే తథైవవర్ణదస్యాపిత్రికోణేపాపసంగమే వర్ణదాత్సప్తమాద్రాశేః కలత్రాదివిచింతయేత్ ఏకాదశాదగ్రజంతు తృతీయాత్తుయవీయసం పంచమేతనుజంవిద్యాన్మాతరం తుర్యపంచమేపితుస్తునవమాన్మాతుః పంచమాద్వర్ణదస్యతు శూలరాశి దశాయాంవైప్రబలాయామరిష్టకం వర్ణదరాశేఃపంచమాత్ప్రబలశూలదశాయాం మాతురరిష్టం వర్ణదరాశినవమాత్ప్రబలశూల దశాయాం పితురరిష్టంజానీయాదిత్యర్థః॥

భావరాశిబోధక పదములకితర శాస్త్రముకంటె విలక్షమును శంకించి చెప్పుచున్నాడు.

టీ॥ భావాః=భావములును, రాశయశ్చ=రాసులును, సర్వత్ర= అంతటను, సవర్ణాః=వర్ణసహితమైనవి.

తా॥ ఈశాస్త్రమునందు భావములు రాసులు సవర్ణములని చెప్పబడుచున్నవి- సవర్ణములనగా ఒకటిరెండుమూడు మొదలగుసంఖ్యలను బోధించునట్టి అక్షరసంఖ్యతోగూడినవి- ఓయీ ఈగ్రంథములో వేని దానిని మఱియొక శాస్త్రమువలన తెలిసికొనవలయునని ముందు చెప్పబోవుచున్నందునను శివతాండవాది గ్రంథములయందు "కటపయాది" వర్ణములచేత సూచింపబడిన సంఖ్యావిధానముప్రసిద్ధమైయున్నందునను ఈసూత్రము చెప్పుట యేమి ప్రయోజనము మరియు భావములు రాసులు సంఖ్యాప్రకారము బోధింపబడుచున్నవి గ్రహములు గ్రహవాచక పదములచేబోధింపబడుచున్నవి. కాబట్టిభావరాసులకువలెనే గ్రహములకు జెప్పవలసివచ్చినప్పుడు సర్వసాధారణ్యముగసవర్ణత్వము సిద్ధింపదు అందువలన (సర్వత్ర) అను పదము ఈసూత్రములో జేర్చ

టయు వ్యర్థమని ప్రశ్నచేయగా చెప్పుచున్నాడు- ఇచ్చట వర్ణపదము రాశిపదముగా భావించి మరియొక విధానముగ సూత్రార్థము చెప్పఁబడును రాసులు భావములు అంతట సవర్ణములని చెప్పఁబడెను. ఇచ్చట సవర్ణములనగా వర్ణముతోఁగూడినవి సవర్ణములు. వర్ణమనగా వర్ణదరాశియని వృద్ధులు నిర్వచించి చెప్పిరి అదియెట్లనగా శ్లో॥ ఓజలగ్నప్రసూతానాం మేషాదేర్గణయేత్క్రమాత్। యుగ్మలగ్నప్రసూతాం మీనాదేరపసవ్యతః। మేషమీనాదితో జన్మలగ్నాంతంగణయే త్సుధీః। తథైవహోరాలగ్నాంతం గణయిత్వాతతఃపరం। పుంస్త్వేనస్త్రీ తయోవేతే సజాతీయేఉభేయది। తదైకసంఖ్యే యోజయీంత వైజాత్యేతు వియోజయేత్। మేషమీనాదితఃపశ్చాద్యోరాశిస్సతువర్ణదః॥ అనఁగా బేసిరాశియందు జననమైన మేషము మొదలు క్రమముగాను సమరాశియందు జననమైన మీనముమొదలు అపసవ్యముగాను జన్మలగ్నపర్యంతము లెక్కబెట్టి ఆప్రకారముగానే హోరాలగ్నాంతము లెక్కపెట్టి యీరెండు సంఖ్యలను పురుషరాశిసంఖ్యగాని స్త్రీరాశిసంఖ్యగాని ఏకజాతీయమైనయెడల రెండుసంఖ్యలను కలుపవలయును, భిన్నజాతియైనయెడల నొకసంఖ్యలో రెండవ సంఖ్య తీసివేయవలయును. ఇట్లు శోధనచేయగా వచ్చినసంఖ్య పండ్రెండుకంటె నధికముగానుండినప్పుడు పండ్రెండుచేతభాగహరించి మిగిలినసంఖ్యను పూర్వమువలెనే ఓజయుగ్మలగ్నములరీతి జననప్రకారము మేషమీనాది సవ్యాపసవ్యముగ లెక్కపెట్టుటచే నేరాశివచ్చునో ఆరాశి వర్ణదమని చెప్పబడుచున్నది లగ్నముమొదలు వర్ణదరాశిపర్యంతము లెక్కపెట్టగా నేసంఖ్యవచ్చునోఆసంఖ్యను ఓజయుగ్మలగ్నజననానుసారముగ పురుషులకు మేషాదిసవ్యముగాను స్త్రీలకు మీనాద్యపసవ్యముగాను లెక్కపెట్టగా యేరాశివచ్చునో ఆరాశినాథుడు దశాధిపతియగును. ఇటు చెప్పుటచే "నాథాంతాః" అను సూత్రప్రకారమాయారాశివచ్చుటచే ఆయా రాశినాథుని సంవత్సరములను గ్రహింపవలయును. మరియు లగ్నము మొదలుగ స్వవర్ణదరాశిపర్యంతము లెక్కపెట్టి సంవత్సరములను నిర్ణయికవలయునని చెప్పబడినందున పూర్వోక్తరీతిచే మేష మీనాది

క్రమముగ నాయా ధనభావాదులను ఆయాభావాంతము లెక్కపెట్టి పూర్వమువలెనే చేయగా ఆయావర్ణద దశారాసులు కలుగుచున్నవి కాబట్టి 'సర్వత్ర' అను పదము సార్థమగుచున్నది అయితే వర్ణద రాశియు వర్ణదదశయు ఈసూత్రార్థమువలన జెప్పబడుట లేదుగదా నీవెట్లు చెప్పితివనిన యొకమునీశ్వరుఁడు చెప్పని విషయము మరియొక మునిచే జెప్పబడినయెడల గ్రహింపవలయుననియున్నది. అందువల్లనే యీమునిచే జెప్పబడలేదు. గుళికరాశియు ఓజయుగ్మలగ్నభేదముగ మేషమీనాది క్రమవ్యుత్క్రమముచే జన్మలగ్న హోరాలగ్నపర్యంతము లెక్కపెట్టుటవలన వర్ణదరాశిప్రకారముగానే గుళికరాశియు నెంచఁబడుచున్నది భావలగ్నమునే జన్మలగ్నముగ భావించి భావవర్ణద రాశిని నిర్ణయింపవలయును. భావలగ్నమును నిర్ణయించుటెట్లనగా- సూర్యోదయము మొదలు 5 ఘడియలకు నొకలగ్నప్రకారము జనన కాలపర్యంతము చూడగా నప్పుడేరాశియగునో యారాశియే భావ లగ్నము. రెండుఘడియలన్నరకు నొకవిలగ్నమగును. దాని జనన కాలపర్యంతము చూడగా హోరాలగ్నమని చెప్పఁబడుచున్నది. హోరాలగ్నమునకు ముప్పదిఅంశలుఁడును జననకాలఘడియలకు నే యంశమో తెలిసికొనవలయును భావలగ్నమును హోరాలగ్న మును జన్మలగ్నము మొదలు లెక్కపెట్టవలయును. హోరాలగ్నా నయనము విషయమై జన్మలగ్నము విషమరాశియగుచుండగా సూర్య రాశి మొదలుకొనియు సమరాశియగుచుండగా జన్మలగ్నము మొదలు కొనియు లెక్కపెట్టవలయును. సూర్యోదయము మొదలు జననకాల పర్యంతము ఎన్నిహోరలుకలవో అన్నిహోరలను సూర్యలగ్నము గాని లగ్నముగాని మొదలుకొని లెక్కపెట్టగా చివరిది హోరాలగ్న మని తెలిసికొనవలయునని చెప్పిరి కాని ప్రాచీనకారికలవలన బోధ్య మగుటలేదు. అందువలన వర్ణదరాశివల్లనే వృద్ధులచే ఫలము చెప్ప బడినది. శ్లో॥ పాపదృష్టిః పాపయోగో వర్ణదస్యత్రికోణగే। యదిస్యా త్తత్ హోరాదరాశిపర్యంతం తస్యజీవనం। రుద్రశూలేతథైవాయుర్మరణా దినిరూప్యతే। తథైవవర్ణదస్యాపి త్రికోణేపాపసంగమే । వర్ణదాత్సప్త

మాదాశేః కళత్రాదివిచింతయేత్ । ఏకదశాదగ్రజంతు తృతీయో త్తుయవీయసం । పంచమేతనుజంవిద్యా న్మాతరంతుర్యపంచమాత్ । పితుస్తునవమాన్మాతుః పంచమాద్వర్ణదస్యతు । శూలరాశిదశాయాం వైప్రబలాయామరిష్టకం॥ వర్ణదరాశికి త్రికోణరాసులయందు పాపగ్రహదృష్టిగాని పాపగ్రహస్థితిగాని కలిగినయెడల అట్లు కలిగిన రాశిదశపర్యంతము జీవించును. రుద్రశూలస్థానమువల్లను ఆయువుగాని మరణముగాని నిర్ణయింపఁబడుచున్నది. వర్ణదరాశిమొదలు ఏడవస్థానమువలన కళత్రాదిభావములను విచారించవలయును. పదునొకొండవస్థానమువలన జ్యేష్ఠభ్రాతృభావమును తృతీయస్థానమువలన కనిష్ఠభ్రాతృభావమును పంచమస్థానమువలన పుత్రభావమును వర్ణదరాశికి పంచమస్థానమువలన ప్రబలశూలదశయందు తల్లి సంబంధమగు అరిష్టమును వర్ణదరాశికి నవమస్థానమువలన ప్రబలశూలదశయందు తండ్రిసంబంధమగు అరిష్టమును దెలిసికొనవలయునని వృద్ధులు చెప్పిరి.

సూ॥ నగ్రహాః॥ 33॥

వ్యాఖ్యానమ్॥ అత్ర అపవాదమాహ ప్రథమపక్షే భావారాశయశ్చ సవర్ణాః సంఖ్యాబోధకాక్షరగమ్యాఇత్యుక్తం గ్రహాస్తునప్రసిద్ధపదగమ్యా ఏవేత్యర్థః ద్వితీయపక్షేభావారాశయశ్చసవర్ణాఃవర్ణదరాశిసహితా ఇత్యుక్తం గ్రహాస్తువర్ణదసహితాన తథాచభావరాశివర్ణదాభవంతి నగ్రహాణామిత్యర్థః॥

టీ॥ గ్రహాః=గ్రహములు, న=కావు.

తా॥ పైనచెప్పఁబడిన విషయమునకు అపవాదమును జెప్పుచున్నాడు- మొదటి పక్షములో భావములు రాసులు సవర్ణములనగా సంఖ్యాబోధకములగు అక్షరములచే బోధింపబడుచున్నవని చెప్పఁబడెను. రెండవపక్షమునందు భావములు రాసులు సవర్ణములనగా వర్ణదరాశిసహితములని చెప్పఁబడెనుకాని గ్రహములుమాత్రము వర్ణదసహితములుకావని యీసూత్రమునఁ జెప్పఁబడినది.

సూ॥ యావద్వివేకమావృత్తిర్భానాం॥ ౩౪॥

వ్యాఖ్యానమ్॥ అథాంతర్దశావిభాగందర్శయతి భానాంరాశీనాం ప్రతిరాశయోదశాబ్దాశ్చరస్థిరాది దశాసుసిద్ధాస్తేషాం ద్వాదశ విభాగేన ద్వాదశరాశీనామావృత్తిర్భవతి ఏవంచ ద్వాదశ రాశీనాం వివేకపదబోధ్యచతుశ్చత్వారింశదధికశతసంఖ్యాభవతీతి తదుక్తం ప్రాచ్యైః కృత్వార్కధారాశి దశాంరాశేర్భుక్తిం క్రమాద్వదేత్ ఏవం దశాంతర్దశాది కృత్వా తేనఫలం వదేదితియత్తు ఉపస్థితతయాదశారంభావధిః స్వస్వలగ్నమేవేతిపంథైరుక్తంతన్నహోరాలగ్నే భయార్కేయాదుర్బలాద్వర్ణ దాద శేతి కారికోక్తత్వాత్ ఏవంప్రతిరాశిద్వాదశ ద్వాదశాబ్దా ఇతివివేకసంఖ్యా మహాదశాభిప్రాయేణాపిసిద్ధ్యతీతి అయమర్థోపిసూత్రసంమత ఏవ ఏతదభిప్రాయేణాంతర్దశావిభాగో వృద్ధైరుక్తః ఏకైకైవభావస్యైకైకే వర్షేలగ్నాది కల్పయేత్ పార్యాయదశాంలగ్నే యుగ్మేతు వ్యుత్క్రమాద్వదేత్ లగ్నంయుగ్మం యదా తర్హి సంముఖం తస్యచాదిమ మితిపర్యాయ దశాంతర్దశేతి యదా లగ్నం యుగ్మరాశిస్తదా తస్యసంముఖమాదిరాశిః యథావృషస్య మేషఇతి॥

అంతర్దశావిభాగమును జూపించుచున్నాడు.

టీ॥ భానాం=పండ్రెండురాసులకు, యావద్వివేకం=నూటనలుబదినాలుగుసంఖ్య అగుపర్యంతము, ఆవృత్తిః=ఆవృత్తిగా లెక్కపెట్టవలయును.

తా॥ ఒక్కొక్కరాశిలో చరస్థిరాదిదశాభేదముచే పండ్రెండు సంవత్సరములచొప్పున పండ్రెండురాసులకు (వివేకం=అనఁగా అక్షరసంఖ్యావదప్రకారముగా) ౧౪౪ సంవత్సరములగును. ఈవిధముగానే వృద్ధులచే జెప్పఁబడినది. శ్లో॥ కృత్వార్కధారాశి దశాంరాశేర్భుక్తిం క్రమాద్వదేత్। ఏవందశాంతర్దశాది కృత్వా తేనఫలంవదేత్॥ రాశికి ౧౨ సంవత్సరముల నేర్పరచుకొని రాశియొక్క భుక్తిని దెలిసికొనవలెను. ఈప్రకారముగానే దశాంతర్దశాది విభాగములనుజేసి ఫలమును జెప్పవలయును. మరియు సమీపమందుండుటచే స్వస్వలగ్నమే

దశనారంభించుటకు అవధియని పండితులు కొందఱు చెప్పిరికాని అది కాదు ఎందువల్లననగా- శ్లో॥ హోరాలగ్నభయోర్నేయా దుర్బలా ద్వర్ణదాదశా॥ వర్ణదరాశిదశ దుర్బలమైనయెడల హోరాలగ్న భావ లగ్నములవలన దశను నిర్ణయింపవలయునని కారికావచనము ఇట్లు చెప్పుటచే ప్రతిరాశికిని పండ్రెండు సంవత్సరములు మహాదశయని అభిప్రాయమైయున్నది. ఈయర్థమే సూత్రసమ్మతమైనది. ఈయభిప్రాయముచేతనే వృద్ధులు అంతర్దశాది విభాగముచేసిరెట్లనగా- శ్లో॥ ఏకైకభావస్యైకైకం వర్షేలగ్నాదికల్పయేత్ । సాపర్యాయ దశాలగ్నే యుగ్మేతువ్యుత్క్రమాద్వదేత్ । లగ్నంయుగ్మంయదాతత్ర హీనసమ్ముఖం తస్యచాదిభం॥ అను వచనప్రమాణమున ఒక్కొక్క రాశికి మహాదశ పండ్రెండు సంవత్సరములైయుండగా ఒక్కొక్కసం వత్సరమునకు ఒక్కొక్కభావముగ బండ్రెండురాసులను లగ్నాదిగ నేర్పరచుకొనవలయును ఇదియే అంతర్దశావిధానము. లగ్నము సరి లగ్నమైనయెడల అపసవ్యముగ దాని సమీపరాశినుండియే గణన చేయవలయును ఎట్లనగా లగ్నము వృషభమైనయెడల మేషరాశి మొదలుకొని లెక్కపెట్టవలయును.

సూ॥ హోరాదయస్సిద్ధాః॥ 3౫॥

వ్యాఖ్యానమ్॥ ప్రకృతశాస్త్రే నష్యమాణ సూత్రేషుక్వచిద్ధో రాద్రేక్కాణాద్యపేక్షాసత్వేనతదాకాంక్షాంనివర్తయన్నాహ హో రాద్రేక్కాణాదయస్సిద్ధాః శాస్త్రాంతరసిద్ధమేషాది గణనయాప్రసిద్ధాః నతుదృష్ట్యర్గలాదివద్దుష్టాః తదుక్తంవృద్ధై రాశేరర్ధంభవేద్ధోరాతచ్చ తుర్వింశతిస్మృతః మేషాదితాసాంహోరాణాం పరివృత్తిద్వయంభవేత్ రాశిత్రిభాగా ద్రేక్కాణాస్తేచ షట్త్రింశదీరితాః పరివృత్తిత్రయం తేషాంమేషాదేః క్రమశోభవేత్ సప్తాంశకాస్త్వోజగృహే గణనీయాని శేశతః యుగ్మరాశౌతువిజ్ఞేయా సప్తమర్క్షాధినాయకాత్ నవాంశేశా శ్చరేతస్మాత్థిరేతన్నవమాదితః ఉభయేతత్పంచమాదేరితిచింత్యం

విచక్షణైః ద్వాదశాంశస్యగణనాం తత్ర క్షేత్రాద్వినిర్దిశేదితి వస్తుతస్తు రాశిపారిధాన్యాద్విలక్షణా ఏవేతిధ్యేయం॥

ఇప్పుడీశాస్త్రములో ముందు చెప్పబోవు సూత్రములయందు హోరాద్రేక్కాణాదుల యపేక్షయుండినను వానినిఁ జెప్పకుండుటకు గారణమేమియన శంకను నివారించుచున్నాడు.

టీ। హోరాదయః=హోరాద్రేక్కాణాదులు, సిద్ధాః = శాస్త్రమున ప్రసిద్ధములైయున్నవి.

తా॥ హోరాద్రేక్కాణ నవాంశాదులు ఇతర గ్రంథములలో మేషాదిరాసులసంజ్ఞలతో జెప్పఁబడియేయున్నవి గాని దృష్ట్యర్గలముల వలెనే నవి రహస్యముగా లేవు వానినిగూర్చి వృద్ధపరాశరహోరా శాస్త్రమునందు_ శ్లో॥ రాశేరర్ధంభవేద్ధోరా తాశ్చతుర్వింశతిస్మృతాః। మేషాదితాసాంహోరాణాం పరివృత్తిద్వయంభవేత్। సూర్యేందోర్విషమేరాశౌ సమేతద్విపరీతకం। రాశిత్రిభాగాద్రేక్కాణాస్తేచ షట్త్రింశదీరితాః। పరివృత్తిత్రయం తేషాం మేషాదేఃక్రమశోభవేత్। స్వపంచ నవమక్షేశా ద్రేక్కాణేశాశ్చరాదిషు క్షాణాంనాథా ద్రేక్కాణపాస్మృతాః। సప్తాంశకాస్త్వోజ గృహే గణనీయా నిజేశతః। యుగ్మరాశౌతువిజ్ఞేయా స్సప్తమర్క్షాధినాయకాత్। నవాంశేశాశ్చరే తస్మాత్ స్థిరేతన్నవమాదితః। ఉభయేతత్పంచమాదే రితిచింత్యం విచక్షణైః। ద్వాదశాంశస్యగణనాం తత్రక్షేత్రాద్వినిర్దిశేత్। త్రింశాంశేశాశ్చవిషమే కుజార్కిజ్యజ్ఞభార్గవాః। పంచపంచాష్టసప్తాష్ట భాగా వ్యత్యయతస్సమే॥ ఈచెప్పఁబడిన వచనములప్రకారముగ రాశికిరెండు హోరలు చొప్పున ౧౨ రాసులకు ౨౪ హోరలగును. వానిని మేషాది రాసులప్రకారము లెక్కపెట్టగా రెండావృతులగును. విషమరాశి యందు సూర్యచంద్రులును సమరాశియందుఁ దద్విపరీతముగా చంద్ర సూర్యులును హోరాధిపతులగుదురు. రాశికి మూడు ద్రేక్కాణములు, ౧౨ రాసులకు ౩౬ ద్రేక్కాణములు, వానిని మేషాది రాసులప్రకా రము లెక్కపెట్టగా మూడావృతులగును. ప్రతిరాశియందును మొదటి

దే్రిక్కాణమునకు దదా్రిశ్యధిపతియు, రెండవ దే్రిక్కాణమునకు దత్పంచమరాశ్యధిపతియు, మూడవదే్రిక్కాణమునకు తన్నవమరాశ్యధిపతియూ నాయకులు రాశిని యేడుభాగములుచేసిన సప్తాంశలగును జేసిలగ్నమున నాలగ్నాధిపతి మొదలుగను సరిలగ్నమున దానికి నేడవరాశ్యధిపతి మొదలుగను సప్తాశాధిపతులగణన చేయవలయును రాశిని తొమ్మిది భాగములు చేసిన నవాంశలగును. చరరాశియందు ఆరాశ్యధిపతినుండియు ప్రారంభించి స్థిరరాశియందున నారాశికి నవమ రాశ్యధిపతినుండియు ద్విస్వభావరాశియందు నారాశికి పంచమ రాశ్యధిపతినుండియు మొదలిడి నవాంశాధిపతుల లెక్కపెట్టవలయును. రాశిని ౧౨భాగములుచేసిన ద్వాదశాంశలగును. ప్రతిరాశియందును నాపండ్రెండంశలకు నారాశినాయకుని మొదలుగ నే యధిపతుల లెక్కపెట్టవలయును, రాశిలో ముప్పదవవంతు అనఁగా ఒక్కభాగ త్రింశాంశమనఁబడును, విషమరాశియందు క్రమముగా ౫, ౫, ౮, ౭, ౫, భాగలకు కుజ, శని, గురు, బుధ, శుక్రులును విషమరాశియందు దద్విపర్యయముగను నధిపతులగుదురు. ఈప్రకారము ఇతర గ్రంథములందు జెప్పఁబడినది, యధార్థము విచారింపగా రాశి ప్రాధాన్యముకంటె విలక్షణముగా నున్నదని తెలిసికొనవలయును.

ఇతి శ్రీ నీలకంఠ జ్యోతిర్విరచితాయాం జైమినీ సూత్ర వ్యాఖ్యాయాం సుబోధిన్యాం ప్రథమాధ్యాయస్య ప్రథమపాదస్సమాప్తః॥

---

# జైమినీయ సూత్రములు.

## ప్రథమాధ్యాయే ద్వితీయపాదః.



సూ॥ అథస్వాంశోగ్రహాణామ్॥ ౧॥

వ్యాఖ్యానమ్॥ అథాత్మ కారకాశ్రియ నవాంశ మాలమ్బ్య ఫలాని వక్తుముపక్రమతే అత్ర కారకాంశ మధికరోతి అథానంతరం గ్రహాణాం రవ్యాదీనాం మధ్యే స్వాంశః ఆత్మకారకాశ్రితో యోంశోనవాంశః తస్మాత్ఫలం విచార్య మిత్యర్థః॥

ఆత్మకారకుడుండు నవాంశనాధారము చేసికొని ఫలములను జెప్పుటకు ప్రారంభించుచున్నాడు.

టీ॥ అథ=అనంతరము, గ్రహాణాం = సూర్యుఁడు మొదలగు గ్రహములలో, స్వాంశః=ఆత్మకారకుని నవాంశముననుసరించి ఫలము చెప్పఁబడుచున్నది.

తా॥ సూర్యాది గ్రహములలో ఆత్మకారకుని నవాంశయే ముఖ్యమైనది కాఁబట్టి ఆ నవాంశమునుబట్టి ఫలమును విచారింపవలయును.

సూ॥ పంచమూషికమార్జారాః॥ ౨॥

వ్యాఖ్యానమ్॥ కారకాశ్రిత మేషాది నవాంశ ఫలాన్యాహ మేషః కారకాంశశ్చేత్ మూషిక మార్జారాః దుఃఖదాభవంతీతి॥

టీ॥ పంచ=మేషము కారకాంశమైనయెడల, మూషికమార్జారాః=మూషికమార్జారాదులవలన దుఃఖము కలుగును.

తా॥ ఇచ్చట మూషికమార్జారశబ్దములు దుఃఖప్రదములనునర్థము నిచ్చునని తెలిసికొనవలయును.

సూ॥ తత్రచతుష్పాదః॥ 3॥

వ్యాఖ్యానమ్॥ వృషః కారకాంశశ్చే చ్చతుష్పాదః సుఖదా భవన్తి మూషికాదయో దుఃఖదా శ్చతుష్పాదః సుఖదా ఇత్యత్రైశ

రూపతయాఽర్థోఽపేక్షితః కృతస్తు భిన్నరూపేణాత్రి బీజం కిముచ్యతే వృద్ధవాక్యమేవబీజం వృద్ధవాక్యంతు॥ వృషతౌల్యంశకగతే తస్మిన్వాణిజ్యవాన్భవేత్ । మేషసింహాంశకగతే బ్రూయాన్మూషకదంశనమ్। కారకేకార్ముకాంశస్థే వాహనాత్పతనంభవత్ ఇతి॥

టీ॥ తత్ర=వృషభము కారకాంశమైనయెడల, చతుష్పాదః= పశ్వాదిచతుష్పాదజంతువులు సుఖమునిచ్చును

తా॥ వృషభాంశము కారకాంశమైన యెడల సుఖకరము. ఇచ్చట చతుష్పాదశబ్దముచే సుఖకరమని తెలిసికొనవలయును. పైన జెప్పబడిన మూషికమార్జార చతుష్పాది శబ్దములు సుఖకరమనియు దుఃఖకరమనియు వాచ్యార్థములుకావు గాని భావార్థములుగా వృద్ధపరాశరవాక్యముచేనిర్దేశించి చెప్పఁబడినది అదియెట్లనగా- శ్లో॥ వృషతౌల్యంశకగతే తస్మిన్వాణిజ్యవాన్భవేత్ । మేషసింహాంశకగతే బ్రూయాన్మూషకదంశనం కారకేకార్ముకాంశస్థే వాహనాత్పతనంభవేత్॥ వృషభతులాంశలు కారకాంశలగునేని వాణిజ్యవ్యాపారము చేయువాడనియు మేషసింహాంశలు కారకములగునేని మూషికదంశముచే హానికలుగుననియు ధనుస్సు కారకాంశయగునేని వాహనమునుండి పడుట సంభవించుననియు జెప్పఁబడినది.

సూ। మృత్యౌకండూఃస్థౌల్యంచ। ౪॥

వ్యాఖ్యానమ్॥ కారకేకార్ముకాంశస్థే వాహనాత్పతనంభవేదితి మిథునే కారకాంశే కండూః శరీరస్థౌల్యంచభవతి॥

టీ॥ మృత్యౌ=మిథునము కారకాంశమగునేని, కండూః=దురదయు, స్థౌల్యంచ=శరీరము స్థూలముగానుండుటయు గలుగును

తా॥ మిథునము కారకాంశమగునేని శరీరమునందు తీటయు లావును కలుగును.

సూ॥ దూరేజలకుష్ఠాదిః॥ ౫॥

వ్యాఖ్యానమ్॥ కర్కేస్వాంశే జలభయం కుష్ఠురోగో భవతి॥

టీ॥ దూరే=కర్కాటకము కారకాంశమగునేని, జలకుష్ఠాదిః= జలభయము కుష్ఠురోగాదులు కలుగును.

తా॥ కర్కాటకాంశయగునేని జలభయము కుష్ఠరోగాదులు కలుగునని తెలియవలయును.

సూ॥ శేషాఃశ్వాపదాని॥ ౬॥

వ్యా॥ సింహాంశ శ్చే చ్ఛ్వాపదాని శునకాదయో దుఃఖదా భవన్తి॥

టీ। శేషాః=సింహాంశయగునేని, శ్వాపదాని = శునకములు మొదలగునవి దుఃఖదములగును.

తా॥ సింహాంశయగునేని శునకములు మొదలగు వానివలెనే దుఃఖము కలుగును.

సూ॥ మృత్యువజ్జాయాగ్నికణశ్చ॥ ౭॥

వ్యా॥ కన్యాకార కాంశ శ్చేన్మృత్యువ న్మిధునాంశవ ద్భవతి అగ్నికణశ్చాగ్నికణేన దుఃఖదశ్చభవతి॥

టీ॥ జాయా = కన్య, మృత్యువత్ = మిధునమువలె ఫలము నిచ్చును, అగ్నికణశ్చ=అగ్నికణమువలనను దుఃఖముకలుగును.

తా॥ కన్య కారకాంశయగునేని మిధునమువలె శరీరమునకు కండూతిస్థౌల్యము కలుగుటయేగాక అగ్నికణము మొదలగువాని బాధలచే దుఃఖకరమైనది.

సూ॥ లాభేవాణిజ్యమ్॥ ౮॥

వ్యా॥ తులాకారకాంశె వాణిజ్యవాన్ స్యాత్॥

టీ॥ లాభే=తులకారకాంశయగునేని, వాణిజ్యం = వర్తకవ్యాపారము కలుగును. తాత్పర్యము స్పష్టము.

సూ॥ అత్రిజలసరీసృపాః స్తన్యహానిశ్చ॥ ౯॥

వ్యా॥ అత్రి వృశ్చికాంశె జలసర్పాదయో దుఃఖదా భవన్తి మాతు స్తన్యం దుగ్ధంచనశ్యతి॥

టీ॥ అత్రి=వృశ్చికాంశయగునేని, జలసరీసృపాః = జలసర్పాదులువలన దుఃఖముకలుగును, స్తన్యహానిశ్చ=మాతృస్తన్యము లేకుండుటయు కలుగును.

తా॥ వృశ్చికాంశ యగునేని జలభయము సర్పాదుల వలన భయము తల్లియొక్క స్తన్యము లేకపోవుటయు గలుగును.

సూ॥ సమెవాహనాదుచ్చాచ్చక్రిమాత్పతనమ్॥ ౧౦॥

వా॥ ధనుషి కారకాంశె వాహనాదూర్ధ్వప్రదేశా చ్చక్రమాత్కించిద్వస్తు సంలగ్నతయా పతనంభవతి నర్ఘుడితీత్యర్థః॥

టీ॥ సమే=ధనుస్సు కారకాంశయగునేని, వాహనాత్=వాహనమువలన, ఉచ్చాచ్చ=ఉన్నతప్రదేశమునుండియును, క్రిమాత్=క్రమముగా, పతనం=పడుట కలుగును.

తా॥ ధనస్సు కారకాంశ యగునేని వాహనమునుండిగాని యున్నత ప్రదేశమునుండిగాని యొక్కసారియే శీఘ్రముగాక యేదో యొక వస్తువు ఆధారము దొరుకుటచే క్రిమక్రమముగా జారిపడుట సంభవించును.

సూ॥ జలచరఖేచరఖేటకండు దుష్టగ్రంధయశ్చరిప్ఫే॥ ౧౧॥

వ్యా॥ మకరె కారకాంశె జలచరా మత్స్యాదయః ఖేచరాః పక్షిణః ఖేటాగ్రహాః ఏతె ఫలదా భవన్తి కండూ దుష్టగ్రంధిరోగాశ్చభవన్తి దుష్టగ్రంధిర్గండాదికం॥

టీ॥ రిప్ఫే = మకరము కారకాంశమగునేని, చలచరఖేచరఖేటాః=మత్స్యములు పక్షులు గ్రిహములు దుఃఖకరములగును, కండూ దుష్టగ్రింధయశ్చ=దురదయు దుష్టరోగములు కలుగును.

తా॥ మకరము కారకాంశయగునేని మత్స్యములు పక్షులు గ్రిహములవలన బాధకలుగును, మఱియు శరీరమునందు తీటయు కణితలు మొదలగు దుష్టజాడ్యములును గలుగును.

సూ॥ తటాకాదయోధర్మే॥ ౧౨॥

వ్యా॥ కుంభె కారకాంశె తటాగాదయః తటాకవాపీకూపాది కర్తారోభవన్తి॥

టీ॥ ధర్మే=కుంభమగునేని, తటాకాదయః=చెరువులు మొదలగువానిని త్రివ్వించును.

తా॥ కుంభముకారకాంశయగునేని చెరువులు భావులు మొదలగువానిని త్రవ్వించునట్టి పుణ్యకార్యకర్తయగును.

సూ॥ ఉచ్చేధర్మనిత్యతాకైవల్యంచ॥ ౧౩॥

వ్యా॥ మీనే కారకాంశే ధర్మనిత్యత్వం కైవల్యం ముక్తిశ్చ భవతి కారక స్యాంశాది గుణైః ఫలవృద్ధి సంగృహీతం శుభరాశౌ శుభాంశేవా కారకాంశే ధనీభవేత్ తదంశకేంద్రేషు శుభే రాజా నూనం ప్రిజాయతే కారకే శుభరాశ్యంశే లగ్నాంశస్థే శుభగ్రిహే ఉపగ్రహస్య పాశ్చాత్యే స్వోచ్చ స్వర్క్ష శుభర్క్షగే పాపదృగ్యోగ రహితే కైవల్యంతస్యనిర్దిశేత్॥ శ్లో॥ మిశ్రేమిశ్రంవిజానీయా ద్విపరీతే విపర్యయః॥ తదంశకేంద్రేషు కారకాశ్రితాంశ కుండల్యాం కేంద్రేష్విత్యర్థః పాశ్చాత్యే అంత్యగ్రహే ఇత్యర్థః మిశ్రిపాపశుభదృగ్యోగే మిశ్రింస్వర్గవాసః విపరీతే పాపమాత్ర దృగ్యోగ సాహిత్యే విపర్యయః నముక్తిర్నస్వర్గవాసఇతి॥ శ్లో॥ చంద్రభృగ్వారవర్గస్థే కారకేపారదారికః। వృషతౌల్యంశకగతే తస్మిన్వాణిజ్యహాన్భవేత్। మేషసింహాంశకేతస్మిన్ బ్రూయాన్మూషికదంశనం। కారకేకార్ముకాంశస్థే వాహనాత్పతనం భవేత్॥

టీ॥ ఉచ్చే=మీనముకారకాంశమగునేని, ధర్మనిత్యతా=ధర్మమునందెల్లప్పుడాసక్తియు, కైవల్యంచ=ముక్తియునుగలుగును.

తా॥ మీనము కారకాంశయగునేని నిత్యము ధర్మమునందాసక్తియు ముక్తియునుగలుగును. మఱియు కారకునియొక్క అంశాది గుణములచే ఫలమీ క్రింది విధముగా వృద్ధులచే జెప్పఁబడినది. శ్లో॥ శుభరాశౌశుభాంశేవా కారకాంశేధనీభవేత్। తదంశకేంద్రేషు శుభే రాజానూనంప్రిజాయతే॥ కారకేశుభరాశ్యంశే లగ్నాంశస్థేశుభగ్రిహే। ఉపగ్రిహస్యపాశ్చాత్యే స్వోచ్చస్వర్క్షశుభర్క్షగే॥ పాపదృగ్యోగరహితే కైవల్యంతస్యనిర్దిశేత్ । మిశ్రేమిశ్రంవిజానీయా ద్విపరీతే విపర్యయః॥ చంద్రిభృగ్వారవర్గస్థే కారకేపారదారికః । వృషతౌల్యంశకగతేతస్మిన్వాణిజ్యవాన్భవేత్॥ మేషసింహాంశకేతస్మిన్ బ్రూయాన్మూ

షికదంశవం। కారకేకార్మ్కాంశస్థే వాహనాత్పతనంభవేత్ ॥ శుభ రాశియందుగాని శుభాంశయందుగాని కారకాంశయుండెనేని ధనవంతు డగును. కారకునియొక్క అంశయగు రాశికి అనఁగా కారకాంశ చక్రమునందు కేంద్రములయందు శుభుఁడుండిన నిశ్చయముగా రాజ గును. కారకునికి శుభరాశ్యంశకలిగి లగ్నాంశయందు శుభగ్రహ ముండి అంత్యగ్రహము శుభగ్రహమైయుండగా తానుఉచ్చస్వక్షేత్ర శుభక్షేత్రాది స్థలములయందుండి పాపగ్రహదృష్టి మొదలగునవి లేకుండినయెడల ఆజాతకునకు కైవల్యము కలుగునని చెప్పవలయును, పైనచెప్పబడిన యోగములలో శుభపాపమిశ్రమముగా నున్నయెడల మిశ్రఫలము అనఁగా స్వర్గవాసముమాత్రమే కలుగును విపరీతముగా పాపభూయిష్టమై యున్నయెడల విపరీతఫలము అనఁగా నరకప్రాప్తి యగును. మఱియు కారకుఁడు చంద్రశుక్రకుజులు రాశివర్గములయం దుండెనేని పరదారాగమనశీలుడగును. వృషభతులాంశలయందుండె నేని వాణిజ్యవ్యాపారము చేయువాడగును. మేషసింహాంశలయం దుండెనేని కష్టజీవియగును. ధనురంశయందు కారకుఁడుండిన వాహన పతనముకలుగును.

సూ॥ తత్రరవౌరాజకార్యపరః॥ ౧౪॥

వ్యా॥ అథకారకాంశే గ్రహస్థిత్యాదినా ఫలాన్యుపదిశతి కార కాంశే సూర్యే సతి రాజకార్య తత్పరోభవతి॥

ఇఁకను కారకాంశయందే ఏగ్రహముండిన నేఫలముకలుగున దియు జెప్పుచున్నాడు.

టీ॥ తత్ర=కారకాంశయందు, రవౌ=సూర్యుడుండగా, రాజ కార్యపరః=రాజకార్యములయందాసక్తికలవాడగును.

తా॥ కారకాంశయందు సూర్యుడుండిన రాచకార్యములను నెరవేర్చు సమర్థుడగును.

సూ॥ పూర్ణేందు శుక్రయో ర్భోగీ విద్యాజీవీచ॥ ౧౫॥

వ్యా॥ కారకాంశే పూర్ణేందు శుక్రయోః సతో ర్భోగీవిద్యా జీవీచస్యాత్ ॥

టీ॥ పూర్ణేందుశుక్రయోః=పూర్ణచంద్ర శుక్రులుండెనేని, భోగీ=భోగముకలవాడును, విద్యాజీవీచ=విద్యచే జీవించువాడునగును.

తా॥ కారకాంశయందు పూర్ణచంద్రుడు శుక్రుడు నుండిరేని యైశ్వర్యములుకలిగి సుఖించువాడును విద్యలవలనజీవించువాడునగును.

సూ॥ ధాతువాదీ కౌంతాయుధో వహ్నిజీవీచభౌమె। ౧౬॥

వ్యా॥ కారకాంశె భౌమె సతి ధాతువాదీ రసాయనవిద్యావాౕ భం భీతి భామయా ప్రసిద్ధాయుధః వహ్నికృతజీవనవాం శ్చ స్యాత్ ॥

టీ॥ భౌమే=అంగారకుడుండగా, ధాతువాదీ=రసాయనశాస్త్ర పరిచితుడును, కౌంతాయుధః=కుంతమనెడి యాయుధముకలవాడును, వహ్నిజీవీచ=అగ్నిహోత్రమువలన జీవించువాడునునగును.

తా॥ కారకాంశయందు అంగారకుడుండెనేని రసాయనశాస్త్ర వేత్తయు (అనఁగా కొన్నికొన్ని ద్రావకములు తీసి దేనితోనేది యెంతెంత కలిపితే యెట్టి నూతనవస్తువులుగాని నూతనశక్తులుగాని గలుగునో అట్టివిషయములను కనిపెట్టునట్టి విద్య రసాయనశాస్త్రమనబడును) ఖడ్గము మొదలగు నాయుధములను ధరించి యుద్ధముచేసి జీవించువాడును, అగ్నిహోత్రమువలన జీవించువాడును (అనఁగా బంగారము వెండి రాగి యిత్తడి కంచు యినుము మొదలగు లోహములను కరగించి వస్తువులనుజేసి జీవించువాడునునగును.

సూ॥ వణిస్తంతువాయాశ్శిల్పినోవ్యవహారవిదశ్చసౌమ్యే॥ ౧౭॥

వ్యా॥ కారకాంశెబుధెసతి వణిక్ప్రభృతయోభవన్తి॥

టీ॥ సౌమ్యే=కారకాంశయందు బుధుడుండగా, వణిజః=వర్తకముచేయువారును, తంతువాయాః=బట్టలనునేయువారును, శిల్పినః=చిత్తరువు మొదలగు పనులు చేయువారును, వ్యవహారవిదశ్చ=వ్యవహారములను తెలిసినవారునగుదురు.

సూ॥ కర్మజ్ఞాననిష్ఠావేదవిదశ్చజీవే॥ ౧౮॥

వ్యా॥ కారకాంశె గురౌ సతి కర్మనిష్ఠాదయోభవన్తి॥

టీ॥ జీవే=బృహస్పతియుండగా, కర్మజ్ఞాననిష్ఠాః=కర్మయందు జ్ఞానమందు నాసక్తిగలవాడును, వేదవిదశ్చ=వేదశాస్త్రముల దెలిసినవారునునగుదురు.

సూ॥ రాజకీయాఃకామినశ్శతేంద్రియాశ్చశుక్రే॥ ౧౯॥

వ్యా॥ కారకాంశే శుక్రే సతి రాజాధికారవన్తః బహుస్త్రీస్పృహాలవః శతవర్షజీవినశ్చ భవన్తి శతం శతవర్షమింద్రియాణియేషామితి స్వామినః పంథాస్తు శతాని ఇన్ద్రియాణి యేషామితి వదన్తితన్న ఇన్ద్రియాణాం శతత్వాదర్శనాత్॥

టీ॥ శుక్రే=శుక్రుడుండగా, రాజకీయాః= రాజసంబంధమగు అధికారముకలవారును, కామినః=అనేకస్త్రీలయందాసక్తికలవారును, శతేంద్రియాశ్చ=నూఱుసంవత్సరములు జీవించువారునునగుదురు.

తా॥ కారకాంశయందు శుక్రుడుండెనేని రాజసంబంధమగు యుద్యోగముకలవారును బహుస్త్రీలయందాసక్తికలవారును నూఱుసంవత్సరములు జీవించువారునగుదురు. ఇక్కడ శతేంద్రియ పదమునకు నూఱు సంవత్సరముల పర్యంతము అవయవములు కలవారని వాచ్యార్థమగుటచే అంతపర్యంతముజీవించువారనిభావము. ప్రేమనిధి పండితులు నూఱు ఇంద్రియములుకలవారని యర్థము చెప్పిరికాని ఆ యర్థమసంగతము ఇంద్రియములు నూఱనుప్రమాణ మెక్కడను లేదు.

సూ॥ ప్రసిద్ధకర్మాజీవశ్శనౌ॥ ౨౦॥

వ్యా॥ కారకాంశే శనౌ సతి లోకప్రసిద్ధకర్మణాజీవేదిత్యర్థః॥

టీ॥ శనౌ = కారకాంశయందు శనియుండగా, ప్రసిద్ధకర్మాజీవః=లోకప్రసిద్ధమగుకర్మలచే జీవించువాడగును.

తా॥ కారకాంశయందు శని యుండెనేని లోకప్రసిద్ధకర్మలచే జీవించువాడగును.

సూ॥ ధానుష్కాశ్చోరాశ్చజాంగులికాలోహయంత్రిణశ్చరాహౌ॥ ౨౧॥

వ్యా॥ కారకాంశే రాహౌ సతి ధానుష్కా శ్చోరా శ్చస్యుః కింవా జాంగులికాః విషవైద్యాః లోహయంత్రిణ శ్చ స్యుః వైకల్పిక మిదం ఫలద్వయం కథ మవగత మితిచేత్ మధ్యే చకారో పాదానా దేవ అన్యసూత్రే ష్వంత్య ఏవ చకార ఉపాత్తః అత్ర మధ్యే కిమర్థ మితి॥

టీ॥ రాహౌ=రాహువుండగా, ధనుష్కాః=ధనుస్సునుధరించు వారును, చోరాశ్చ=దొంగలును, జాంగులికాః = విషవైద్యులును లోహయంత్రిణశ్చ=లోహయంత్రములుకలవారును అగుదురు.

తా॥ కారకాంశయందు రాహువుండగా ధనుర్బాణములను ధరించియుద్ధముచేయువారును దొంగతనముచేయువారు విషవైద్యము చేయువారును లోహయంత్రములను జేయువారునునగుదురు. ఇతర సూత్రములయందు చకారము చివరనుండుటచేతను ఈసూత్రములో మధ్యలోకూడ చకారముండుటచేతను జాంగులికులని లోహయంత్రిణు లని చెప్పబడు ఫలములు వైకల్పికములని చెప్పబడినట్లుగా తెలియబడు చున్నది

సూ॥ గజవ్యవహారిణశ్చోరాశ్చ కేతౌ॥ ౨౨॥

వ్యా॥ కారకాంశే కేతౌ ఫలమిదం॥

టీ। కేతౌ=కారకాంశయందుకేతువుండగా, గజవ్యవహారిణః= ఏనుగులసంబంధమగువ్యవహారముకలవారును, చోరాః=దొంగతనము చేయువారునునగుదురు.

సూ॥ రవిరాహుభ్యాం సర్పనిధనమ్॥ ౨౩॥

వ్యా॥ కారకాంశే రవి రాహుస్థిత్వా సర్పాన్మృతిర్భవతి॥

టీ॥ రవిరాహుభ్యాం=కారకాంశయందు సూర్యరాహువులుం డినయెడల, సర్పనిధనం=సర్పమువలన మరణముసంభవించును.

సూ॥ శుభదృష్టేతన్నివృత్తిః॥ ౨౪॥

వ్యా॥ శుభగ్రహావలోకితె రవి రాహు యోగే సర్పాన్మృతి ర్నస్యాత్॥

టీ॥ శుభదృష్టే=శుభగ్రహములయొక్క దృష్టియున్నయెడల తన్నివృత్తిః=సర్పమువలన మరణము కలుగక తొలగిపోవును.

తా॥ కారకాంశయందు పాపగ్రహములగు సూర్యుడురాహువు ఇద్దరును కలిసియున్నను వారికి శుభగ్రహదృష్టియున్నయెడల నాసర్పగండము తొలగిపోవును.

సూ॥ శుభమాత్రసంబంధాజ్జాంగులికః॥ ౨౫॥

వ్యా॥ కారకాంశగయో రవి రాహ్వోః శుభమాత్రయోగే సతి జాంగులికో విషవైద్యోభవేత్ మాత్రశబ్దేన పాపనివృత్తిః॥

టీ॥ శుభమాత్రసంబంధాత్=శుభగ్రహములసంబంధమువలన, జాంగులికః=విషవైద్యముచే జీవించువాడగును.

తా॥ కారకాంశయందు రవి రాహువు లిద్దరు కలసియుండగా వారితోగూడ శుభగ్రహములు కలసియున్నమాత్రమున విషవైద్యముచే జీవించువాడగును. సూత్రములో (మాత్ర) అను శబ్దముండుటచే ఆవైద్యముచే జీవించువాడేయగును గాని దానివలన పాపము సంభవింపదని భావము అనఁగా విషవైద్యజీవియగునేగాని సర్పాదివిషముచే పూర్వోక్తవిధిని మరణముకలుగదు.

సూ॥ కుజమాత్రదృష్టేగృహదాహకోఽగ్నిదోవా॥ ౨౬॥

వ్యా॥ కారకాంశగయో రవి రాహ్వోః కుజదృష్టౌ సత్యాం స్వగృహదాహకోఽగ్నిదోవాభవతి॥

టీ॥ కుజమాత్రదృష్టే = అంగారకునిచే జూడఁబడినంతమాత్రమున, గృహదాహకః=స్వగృహముదగ్ధమగువాఁడైనను, అగ్నిదోవా= ఇతరగృహములకు నిప్పుపెట్టువాఁడైననునగును.

తా॥ ఆరవిరాహులను అంగారకుడు చూచుచున్నయెడల ఆ జాతకునియొక్క గృహము దగ్ధమగును. లేదా జాతకుఁడు ఇతరగృహములను దగ్ధముచేయువాఁడైననునగును.

సూ॥ శుక్రదృష్టేర్నదాహః॥ ౨౭॥

వ్యా॥ కారకాంశగత రవి రాహ్వోః శుక్రదృష్టౌ సత్యాంగృహదాహోనస్యాత్కింతు అగ్నిదానమాత్రం కరోతీత్యర్థః॥

టీ॥ శుక్రదృష్టేః=శుక్రునిచూపువలన, నదాహః=స్వగృహము అగ్నిదగ్ధముకాదు.

తా॥ ఆకుజునిచే చూడబడుచున్న రవిరాహువులకు శుక్రుని చూపుకలిగినయెడల స్వగృహము అగ్నిదగ్ధముకాదుగాని యితరుల యిండ్లకు నగ్నిముట్టించువాడగును.

సూ॥ గురుదృష్టేస్త్వాసమీపగృహాత్॥ ౨౮॥

వ్యా॥ కారకాంశగయో రవి రాహ్వోః గురుదృష్టౌ సత్యాం శుక్రదృష్టౌ అసత్యామాసమీపగృహా త్సమీపగృహపర్యంతందాహస్స్యాత్ న స్వ గృహమాత్రస్య॥

టీ॥ గురుదృష్టేః = బృహస్పతియొక్క దృష్టివలన, ఆసమీప గృహాత్=సమీపగృహపర్యంతము దహనమగును.

తా॥ కారకాంశయందు రవిరాహువులుండినప్పుడు శుక్రదృష్టి లేక బృహస్పతియొక్క దృష్టికలిగినప్పుడు స్వగృహము మాత్రము దగ్ధముకాదుగాని తనయింటికి సమీపముననున్నయింటివఱకు నితరుల యిండ్లుమాత్రము దగ్ధమగును. గృహదహనము విషయములో రవి రాహువులకు గురుశుక్రుల దృష్టియున్నను కుజదృష్టికూడ యుండి నప్పుడే యీఫలము చెప్పవలెను.

సూ॥ సగులికేవిషదోవిషహతోవా॥ ౨౯॥

వ్యా॥ కారకాంశే గుళికసహితె సతి పరస్మై విషదాతా వా స్వయం విషహతస్స్యాత్ గులికా నయన ప్రకారస్తు వృద్ధై రుక్తః।

శ్లో॥ రవివారాది శన్యన్తం గుళికాదినిరూప్యతె। దివసానష్టధాకృత్వా వారేశాద్గణయేత్క్రమాత్। అష్టమోంశోనిరీశస్స్యా చ్ఛన్యంశోగుళిస్స్మృతః। రాత్రిమప్యష్టధాభక్త్వా వారేశాత్పంచమాదితః। గణయేద ష్టమః ఖండో నిష్పత్తిఃపరికీర్తితః। శన్యంశెగులికః ప్రోక్తో గుర్వంశేయమ

ఘంటకః । భౌమాంశే మృత్యు రాదిష్టో రవ్యంశే కాలసంజ్ఞికః । సౌమ్యాంశేర్ధప్రహరకః స్పష్టకర్మప్రదేశకః ॥ రవ్యాది సప్తవారేషు దినమాన మష్టధా విభజ్య తత్త ద్వారేశకం ప్రథమఖండాదిపం కృత్వాఽగ్రిమఖండేషు తత్తద్వారేశా దగ్రిమగ్రహాత్ క్రమే ణేశత్వేన జానీయా దష్టమః ఖండస్తునిరీశః ఏవం చ సప్తసు వారేషు శన్యంశో గులికానామా తథాచ రవివారే సప్తమః సోమె షష్ఠః భౌమె పంచమః బుధె చతుర్థః గురౌ తృతీయః శుక్రె ద్వితీయః శనౌ ప్రథమః ఖండో గులికా భవన్తి సప్త స్వపి వారేషు రాత్రిమాన మష్టధా విభజ్యతద్వారేశాత్పంచ మాద్యాః ఖండాధిపా జ్ఞేయాః రాత్రౌ వష్యష్టమఖండో నిరీశః ఏవంచ రవిరాత్రౌ తృతీయః ఖండః సోమె ద్వితీయః భౌమె ప్రథమః బుధె సప్తమః గురౌ షష్ఠః శుక్రే పంచమః శనౌ చతుర్థః ఖండో గులికా భవన్తి ఏవం సర్వేషు దినేషు రాత్రౌ చ గురుఖండోయమఘండనామా బుధఖండోర్ధప్రహార కాఖ్యః రవ్యంశః కాలసంజ్ఞో భౌమాంశో మృత్యునామేతిజ్ఞేయం. స్పష్టకర్మఇతి గులికాదీనాంస్పష్టీకరణంతు స్వస్వ దేశలగ్నప్రమాణానుసారేణ తత్త త్ఖండకాలాంత లగ్నాని స్పష్టాని కృత్వా గులికాది స్పష్టలగ్నైకస్యాంశోస్తి సఏవ కారకకారకాంశశ్చే త్సగులికోజాత ఇతి వివేచనీయం తథాచసంగ్రహః తథాచ రవివారాదా దినే గులికసంస్థితిః సప్తర్తు శర వేదత్రిద్వికుఖండేషుహిక్రమాత్ రాత్రౌ త్రి ద్వికు సప్తర్తు పంచ తుర్యేషు తత్థ్సితిః ఇతి॥

టీ॥ సగులికే = కారకాంశగులికునితోగూడినప్పుడు, విషదః= విషమునిచ్చువాడుగాని, విషహతోవా = విషమువలన మృతినొందువాడుగాని, భవేత్ =అగును.

తా॥ కారకాంశయందు గుళిక గ్రహమున్నయెడల తాను విషమువలన మృతినొందువాడుగాని యితరులకు విషము పెట్టి చంపువాడుగానియగును. గుళికాద్యప్రకాశగ్రహసాధనము వృద్ధపరాశరహోరయందు- శ్లో॥ రవివారాదిశన్యంతం గుళికాదినిరూప్యతే। దివసానష్టధాకృత్వా వారేశాద్గణయేత్క్రమాత్ । అష్టమోంశోనిరీశస్స్యా

న్యంశో గుళికస్మృతః రాత్రిమప్యష్టధాభక్త్వా వారేశాత్పంశమాదితః। గణయేదష్టమఃఖండో నిష్పతిఃపరికీర్తితః । శన్యంశే గుళికః ప్రోక్తో గుర్వంశేయమఘంటకః। భౌమాంశేమృత్యురాదిష్టో రవ్యంశేకాలసంజ్ఞకః। సౌమ్యాంశేఽర్ధప్రహారకః స్పష్టకర్మప్రదేశకః ॥ ఆదివారము మొదలేడువారములయందును పగటిప్రమాణమునుఎనిమిదిభాగములు చేసి ఆవారాధిపతిని మొదటిభాగమునకధిపతినిగానెంచి తర్వాతభాగములకు తర్వాతగ్రహముల క్రమప్రకారముగ నేడుగ్రహములును నధిపతులుగా నెంచుకొనవలయును. ఎనిమిదవభాగమునకెవరి యాధిపత్యమును లేదు. ఈ ప్రకారము చేయగా ఏడువారములయందును శనిగ్రహముయొక్క అంశ గుళికాంశయని చెప్పఁబడును. ఇట్లు నిర్ణయింపగా ఆదివారమునందు నేడవభాగము సోమవారమునందు నారవ భాగము మంగళవారమునందు నయిదవభాగము బుధవారమునందు నాల్గవభాగము గురువారమునందు మూడవభాగము శుక్రవారము నందు రెండవభాగము శనివారమునందు మొదటిభాగము గుళిక సంజ్ఞకలవియగును ఈవిధముగానే రాత్రిప్రమాణము నెనిమిది భాగములుచేసి ఆవారాధిపతినుండి యైదవదగు గ్రహమును మొదటిభాగమునకు నధిపతిగానెంచి యది మొదలుకొని యేడుగ్రహములను నేడు ఖండములకు నధిపతులుగా నెంచవలయును. రాత్రులయందును నెనిమిదవభాగమునకు నెవరి యాధిపత్యము లేదు. శనియొక్క భాగమునందు చిట్టచివర గుళికగ్రహముండును. ఇట్లాదివారమురాత్రియందు మూడవభాగమును, సోమవారమున రెండవభాగమును, మంగళవారమున మొదటి భాగమును, బుధవారమున నేడవభాగమును, గురువారమున నాఱవభాగమును, శుక్రవారమున నయిదవభాగమును, శనివారమున నాల్గవభాగమును గుళికాంశయగును. ఇట్లేడువారములయందును రాత్రులయందు శనియొక్క భాగము గుళికయనియు, బృహస్పతియొక్క భాగము యమఘంటకమనియు, బుధునియొక్క భాగము అర్ధప్రహారకమనియు, సూర్యునియొక్క భాగము కాలసంజ్ఞకమనియు, అంగారకునియొక్క భాగము మృత్యువనియు చెప్పఁబడు

చున్నవి. ఇష్టదినమునందాయా ఖండాంతములందు నిర్ధారణగా వ్యవహరింపబడు స్వదేశలగ్నప్రమాణానుసారముగ లగ్నములనుధృవపరచి పైనచెప్పబడినప్రకారమావారమునందు శనియొక్క ఖండమునందు చివరనుండు గుళికగ్రహమును సాధింపవలయును. జననకాలమునందు ఆత్మకారకాంశ గుళికాంశయగునేని జాతకుడు గుళికాంశయందు పుట్టినవాడగును. గుళికసాధనవిషయమై సంగ్రహవచనప్రమాణము-

శ్లో॥ తథాచరవివారాదౌ దినేగుళికసంస్థితిః । సప్త ౭ ర్తు ౬ శర ౫ వేద ౪ త్రి ౩ ద్వి ౨ కు ౧ ఖండేషుహిక్రమాత్ । రాత్రౌ త్రి ౩ ద్వి ౨ కు ౧ సప్త ౭ ర్తు ౬ పంచ౫ తుర్యైరషుతస్థితిః॥ ఆదివారము మొదలు శనివారపర్యంతము పగలు ౭-౬-౫-౪-౩-౨-౧ వ భాగములును రాత్రిలయందు ౩-౨-౧-౭-౬-౫-౪ వ భాగములును క్రమముగా గుళికాంశలగును.

సూ॥ చంద్రదృష్టౌచోరాపహృతధనశ్చోరోవా॥ ౩౦॥

వ్యా॥ సగుళికే కారకాంశె చంద్రదృష్టౌ సత్యాం చోరైర్హృతధనః స్వయమేవవాచోరఃస్యాత్॥

టీ॥ చంద్రదృష్టౌ=కారకాంశకు చంద్రునిదృష్టి కలుగుచుండగా, చోరాపహృతధనః=దొంగలు తెచ్చియిచ్చిన ధనముకలవాడుగాని, చోరోవా=దొంగగానియగును.

తా॥ ఆత్మకారకాంశ గుళికాశ్రితమై చంద్రునిచే జూడబడినయెడల జాతకుడు చోరులు తెచ్చియిచ్చిన ధనముతోగాని తాను స్వయముగా దొంగతనముచేసిగాని జీవించువాడగును.

సూ॥ బుధమాత్రదృష్టేబృహద్బీజః। ౩౧॥

వ్యా॥ సగుళికె కారకాంశెఽన్యగ్రహ దృష్టత్వే సతి బుధదృష్టేః స్థూలవృషణోభవతి॥

టీ॥ బుధమాత్రదృష్టే = ఒక్కబుధునియొక్క చూపు కలిగియుండగా, బృహద్బీజః=పెద్దవృషణములుగలవాడగును,

తా॥ కారకాంశ గుళికాంశలకలదియగుచు ఇతర గ్రహముల దృష్టిలేక ఒక్క బుధునిదృష్టియేకలిగియున్నయెడల జాతకుఁడు పెద్ద వృషణములు లేక బుడ్డకలవాడగును.

సూ॥ తత్రకేతౌ పాపదృష్టేకర్ణచ్ఛేదః కర్ణరోగోవా॥ ౩౨॥

వ్యా॥ నగులికే ఇతి పదం నివృత్తం తత్రకారకాంశే నవాంశ కుండల్యాం కేతౌ సతి పాపదృష్టే కర్ణచ్ఛేదః కర్ణరోగోవా భవతి॥

టీ॥ తత్ర=ఆకారకాంశయందు, కేతౌ = కేతువుండగా, పాప దృష్టే = పాపగ్రహముయొక్క చూపుకలుగుచుండగా, కర్ణచ్ఛేదః= చెవులు తెగిపోవుటగాని, కర్ణరోగోవా = చెవులయందు రోగముగాని కలుగును.

తా॥ ఇక గుళికాంశను విడిచి చెప్పబడుచున్నది. ఆత్మకారకాంశయందు కేతువుండగా పాపగ్రహదృష్టికలిగినయెడల జాతకుఁడు తెగిన జెవులుకలవాడుగాని చెవులయందేదైన రోగముకలవాడుగాని యగును.

సూ॥ శుక్రదృష్టేదీక్షితః॥ ౩౩॥

వ్యా॥ సకేతౌ కారకాంశే శుక్రదృష్టే సతి కయాచి ద్యజ్ఞక్రియయా దీక్షితఃస్యాత్॥

టీ॥ శుక్రదృష్టే = శుక్రునియొక్క చూపు కలుగుచుండగా, దీక్షితః=దీక్షకలవాడగును.

తా॥ కారకాంశ కేతువుతోగూడియుండగా శుక్రుడు చూచుచున్నయెడల నేదైన యజ్ఞదీక్షవహించువాడగును.

సూ॥ బుధశనిదృష్టే నిర్వీర్యః॥ ౩౪॥

వ్యా॥ సకేతౌ కారకాంశే బుధశనిదృష్టే నపుంసకస్స్యాత్॥

టీ॥ బుధశనిదృష్టే=బుధశనులచేజూడబడినయెడల, నిర్వీర్యః= వీర్యములేనివాడగును.

తా॥ కారకాంశ కేతువుతోగూడియుండగా బుధుడు శనియు జూచుచున్నయెడల జాతకుఁడు నపుంసకుఁడగును.

సూ॥ బుధశుక్రదృష్టేపౌనఃపునికో దాసీపుత్రోవా॥ ౩౫॥

వ్యా॥ సకేతౌ కారకాంశే బుధశుక్రదృష్టౌ పునఃపునరుక్తవచనవక్తా దాసీపుత్రోవాస్యాత్॥

టీ॥ బుధశుక్రదృష్టౌ=బుధునిచేతను శుక్రునిచేతను జూడబడుచుండగా, పౌనఃపునికః=మరలమరల చెప్పిమాటనే చెప్పునలవాటుగలవాడుగాని, దాసీపుత్రోవా=దాసీస్త్రీకిఁ బుత్రుడుగానియగును.

తా॥ కారకాంశ కేతువుతోగూడియుండగా బుధుడు శుక్రుడు చూచుచున్నయెడల చెప్పినమాటనే చెప్పుచు విశేషముగా మాట్లాడువాడుగాని దాసీపుత్రుడుగానియగును.

సూ॥ శనిదృష్టౌతపస్వీప్రేష్యోవా॥ ౩౬॥

వ్యా॥ సకేతౌ కారకాంశే ఖేటాంతరేణ దృష్టేపి శనిదృష్టౌ తపస్వీప్రేష్యోవాస్యాత్॥

టీ॥ శనిదృష్టౌ=శనిచూచుచుండగా, తపస్వీ = తపశ్శాలియు, ప్రేష్యోవా=నౌకరిచేయువాడుగానియగును.

తా॥ కారకాంశ కేతువుతోగూడియుండగా నితరగ్రహముల యొక్క చూపు కలిగియున్నను శనిచూచుచున్నయెడల తపస్సుజేయువాడుగాని యితరులకు నౌకరిచేయువాడుగాని యగును.

సూ॥ శనిమాత్రదృష్టౌసన్న్యాసాభాసః॥ ౩౭॥

వ్యా॥ సకేతౌ కారకాంశే ఖేటాంతరేణాదృష్టౌ సన్న్యాసాభాసః నపూర్ణసన్న్యాస ఇత్యర్థః కేతావితినివృత్తమ్॥

టీ॥ శనిమాత్రదృష్టౌ=శనిచేతనే చూడబడుచుండగా, సన్న్యాసాభాసః=సన్న్యాసితోసమానుఁడు.

తా॥ కారకాంశ కేతువుతోగూడియుండి యితర గ్రహములచే జూడఁబడక యొక్క శనిచేతనే చూడబడినయెడల సన్న్యాసితో సమానుఁడగునుగాని యథాశాస్త్రీయమైన సన్న్యాసికాదు.

సూ॥ తత్రరవిశుక్రదృష్టౌ రాజప్రేష్యః॥ ౩౮॥

వ్యా॥ కారకాంశే రవిశుక్రాభ్యాందృష్టౌ రాజభృత్యోభవతి॥

టీ॥ తత్రి=ఆకారకాంశ, రవిశుక్రదృష్టె = సూర్యశుక్రులచేఁ జూడబడుచుండగా, రాజప్రేష్యః = రాజకీయసంబంధమగు భృత్యుఁడగును.

సూ॥ రిష్ఫేబుధేబుధదృష్టెవామన్దవత్॥ 3౯॥

వ్యా॥ అథ కారకాంశా దశమాంశ మవలంబ్య విచారయతి కారకాంశా ద్దశమె బుధె సతి బుధదృష్టె వా సతి మందవత్ శనివత్ ప్రసిద్ధకర్మాజీవః శనావితిసూత్రోక్త ఫలం భవతీతి॥

టీ॥ రిష్ఫే=దశమస్థానమందు, బుధే = బుధుడుండినను, బుధదృష్టెవా = బుధునిచేజూడఁబడుచుండినను, మందవత్ = శనివలెనే ఫలమునిచ్చును.

తా॥ కారకాంశకు పదియవయాంశయందు బుధుడుండినను లేక బుధునిచే జూడఁబడినను శనికిఁ జెప్పబడినరీతి ప్రసిద్ధకర్మచే జీవించువాడగును.

సూ॥ శుభదృష్టెస్థేయః॥ ౪౦॥

వ్యా॥ కారకాంశాద్దశమె బుధేతర శుభగ్రహ దృష్టే స్థిరో భవతి న చంచలః బుధేతర శుభదృష్టత్వం కథం జ్ఞాత మితి చే ద్బుధదృష్టి ఫలస్యోక్తత్వాదేవ॥

టీ॥ శుభదృష్టె=శుభగ్రహముచేఁజూడఁబడినయెడల, స్థేయః=స్థిరస్వభావముకలవాడగును.

తా॥ కారకాంశకు పదియవయాంశ బుధునికంటె నితర శుభగ్రహములచేఁ జూడఁబడినయెడల స్థిరస్వభావముకలవాడగును.

సూ॥ రవౌగురుమాత్రదృష్టెగోపాలః॥ ౪౧॥

వ్యా॥ కారకాంశా ద్దశమె రవౌ సతి ఖేటాంతరాదృష్టె గురుమాత్రదృష్టె గోరక్షకోభవతి॥

టీ॥ రవౌ=సూర్యుడుండగా, గురుమాత్రదృష్టె = బృహస్పతిచేతనే చూడబడుచుండినయెడల, గోపాలః=గోరక్షకుఁడగును

తా॥ కారకాంశకు పదియవస్థానమందు సూర్యుడుండి యితర గ్రహములచే జూడఁబడక యొక్క బృహస్పతిచేతనే చూడఁబడుచుం డినయెడల గోరక్షకుఁడగును.

సూ॥ దారేచంద్రశుక్రదృగ్యోగాత్ప్రాసాదః॥ ౪౨॥

వ్యా॥ కారకాంశా చ్చతుర్థ ఫలమాహ కారకాంశాచ్చతుర్థే చంద్ర శుక్ర దృష్టి యోగాభ్యాం ప్రాసాదవాన్భవతి॥

టీ॥ దారే=చతుర్థస్థానమందు, చంద్రశుక్రదృగ్యోగాత్= చంద్రునియొక్కయు శుక్రునియొక్కయు దృష్టిగాని సంబంధముగాని కలిగినయెడల, ప్రాసాదః=మేడకలుగును.

తా॥ కారకాంశకు నాల్గవస్థానమందు చంద్రశుక్రులదృష్టిగాని సంబంధముగాని కలిగినయెడల మేడలు మొదలగునవికలవాడగును

సూ॥ ఉచ్చగ్రహేపి॥ ౪౩॥

వ్యా॥ కారకాంశా చ్చతుర్థస్థితే ఉచ్చరాశిగత గ్రహేపి ప్రాసాదవాన్భవతి॥

టీ॥ ఉచ్చగ్రహే=ఉచ్చగ్రహము, స్థితేపి=ఉన్నపుడును, ప్రాసాదః=మేడలుకలుగును.

తా॥ కారకాంశకు చతుర్థస్థానమందేగ్రహమైననుచ్చస్థితిలో నున్నయెడల మేడలు కలుగును

సూ॥ రాహుశనిభ్యాంశిలాగృహం॥ ౪౪॥

వ్యా॥ కారకాంశా చ్చతుర్థస్థితే రాహు శనిభ్యాం శిలా నిర్మితంగృహంభవతి॥

టీ॥ రాహుశనిభ్యాం=రాహుశనులచేత, శిలాగృహం = రాతి గృహముకలుగును.

తా॥ కారకాంశకు చతుర్థస్థానమందు శనిగాని రాహువు గానియుండినయెడల శిలానిర్మితమగు గృహముకలవాడగును.

సూ॥ కుజకేతుభ్యామైష్టకం॥ ౪౫॥

సూ॥ గురుణాదారవం॥ ౪౬॥

సూ॥ తార్ణంరవిణా॥ ౭౭॥

వ్యా॥ ఇదం సూత్రత్రయం రాహు శనిభ్యామితి సూత్రేణైవ కృతవ్యాఖ్యానమ్॥

తా॥ కారకాంశకుఁ జతుర్థస్థానమందు కుజకేతువులుండిన యెడల నిటుకలచే నిర్మింపఁబడినగృహమును గురువుండినయెడలదారు (కొయ్య) గృహమును రవియుండినయెడల తృణగృహమును (అనఁగా పూరిల్లును) కలవాడగును.

సూ॥ నవమేశుభదృగ్యోగాద్ధర్మనిత్యస్సత్యవాదీగురుభక్తశ్చ॥౭౮॥

వ్యా॥ అథ కారకాంశా న్నవమాంశ ఫలమాహ కారకాంశాన్నవమె శుభదృష్టి యోగాభ్యాం ధర్మ నిత్యత్వాదిమాన్భవతి॥

టీ॥ నవమే=నవమస్థానమందు, శుభదృగ్యోగాత్=శుభదృష్టిసంబంధమువలన, ధర్మనిత్యః=ధర్మమునందాసక్తికలవాడును, సత్యవాదీ=సత్యముగా మాట్లాడువాడును, గురుభక్తశ్చ=గురువునందు భక్తికలవాడునునగును.

తా॥ కారకాంశకు నవమస్థానమందు శుభగ్రహమున్నను శుభగ్రహదృష్టికలిగినను ధర్మమందాసక్తికలవాడును సత్యముగా మాట్లాడువాడును గురువునందు భక్తికలవాడునునగును.

సూ॥ అన్యథాపాపైః॥ ౭౯॥

వ్యా॥ నవమె పాపదృష్టి యోగాభ్యాం ధర్మనిత్యత్వాది రహితోభవతి।

టీ॥ పాపైః=పాపగ్రహములచేత, అన్యథా=పూర్వోక్తవిధమునకు విపరీతముగా జరుగును.

తా॥ నవమస్థానము పాపగ్రహములతోఁగూడియుండినను పాపగ్రహములచే జూడఁబడుచున్నను పైనజెప్పఁబడిన ధర్మనిత్యత్వాది గుణములేమియునుండవు

సూ॥ శనిరాహుభ్యాం గురుద్రోహః॥ ౮౦॥

వ్యా॥ నవమస్థాభ్యాం శనిరాహుభ్యాం తద్దృష్టిభ్యాంవాగురు ద్రోహః॥

టీ॥ శనిరాహుభ్యాం=శనిరాహువులచేత, గురుద్రోహః=గురుద్రోహముచేయువాడగును.

తా॥ నవమస్థానమందు శనిరాహువులున్నను నవమస్థానమును శనిరాహువులు చూచుచున్నను గురుద్రోహముచేయువాడగును.

సూ॥ గురురవిభ్యాంగురావవిశ్వాసః॥ ౫౧॥

వ్యా॥ నవమె గురు రవి దృగ్యోగాభ్యాం గురౌ నవిశ్వాసో భవతి॥

టీ॥ గురురవిభ్యాం=గురుసూర్యులదృష్టులచేత, గురౌ=గురువునందు, అవిశ్వాసః=విశ్వాసములేకుండుటకలుగును.

తా॥ నవమస్థానమున గురుసూర్యులుండినను వారిదృష్టికలిగినను గురువునందు విశ్వాసముండదు.

సూ॥ తత్రభృగ్వంగారకవర్గే పారదారికః॥ ౫౨॥

వ్యా॥ కారకాంశా న్నవమె శుక్ర భౌమాన్యతర షడ్వర్గెసతి పరస్త్రీనక్తస్స్యాత్॥

టీ॥ తత్ర=ఆనవమస్థానమునందు, భృగ్వంగారకవర్గే=శుక్రకుజులయొక్క షడ్వర్గము కలుగుచుండగా, పారదారికః=పరదారాగమనశీలుడగును.

తా॥ కారకాంశకు నవమాంశము శుక్రుని షడ్వర్గముగాని కుజుని షడ్వర్గముగాని కలదియగునేని పరదారాగమనము చేయువాడగును.

సూ॥ దృగ్యోగాభ్యామధికాభ్యామామరణం॥ ౫౩॥

వ్యా॥ నవమె శుక్ర భౌమాన్యతర షడ్వర్గే సతి షడ్వర్గాపేక్షయాఽధికాభ్యాం శుక్రభౌమ దృష్టి యోగాభ్యాం మరణపర్యన్తం పారదారికోభవతి॥

టీ॥ దృగ్యోగాభ్యాం=దృష్టియోగములు, అధికాభ్యాం=విశేషములగుచుండగా, ఆమరణం=మరణపర్యంతముండును.

తా॥ నవమస్థానమునకు శుక్రకుజులలో నెవరి షడ్వర్గము కలిగియున్నను ఆనవమస్థానమందు శుక్రకుజులుండినను వారి దృష్టియున్నను దానికంటె నధికమైనది కాబట్టి వాడు బ్రతికియున్నంతవఱకు పరదారాగమనము చేయుచుండును.

సూ॥ కేతునాప్రతిబన్ధః॥ ౫౮॥

వ్యా॥ కారకాంశా న్నవమె కేతోర్దృష్టి యోగాభ్యాం ప్రతిబన్ధః ఆమరణం పారదారికత్వస్య నివృత్తిర్భవతి।

టీ॥ కేతునా=కేతువుచేత, ప్రతిబంధః=పైనచెప్పఁబడిన విషయమునకు ప్రతిబంధము.

తా॥ కారకాంశకునవమస్థానమందు కేతువుండినను కేతుదృష్టి కలిగినను పూర్వోక్తవిధమున మరణపర్యంతము పరదారాగమనము చేయువాడుకాడుకాని ఒకప్పుడుమాత్రమేయగును

సూ॥ గురుస్త్రైణః॥ ౫౯॥

వ్యా॥ నవమస్థితేన నవమద్రష్ట్రా వా గురుణా స్త్రీలోలః॥

టీ॥ గురుణా=బృహస్పతిచేత, స్త్రైణః=స్త్రీలోలుఁడగును.

తా॥ బృహస్పతి నవమస్థానమును జూచినను అందున్నను స్త్రీలోలుఁడగును.

సూ॥ రాహుణార్థనివృత్తిః॥ ౬౦॥

వ్యా॥ నవమస్థేన నవమద్రష్ట్రా వా రాహుణా పరస్త్రీ సంగనివృత్తిః ద్రవ్యనాశః స్యాత్॥

టీ॥ రాహుణా = రాహువుచేత, అర్థనివృత్తిః = ధననివృత్తి కలుగును.

తా॥ నవమస్థానమునకు రాహువుయొక్క దృష్టిగాని స్థితిగాని యున్నయెడల పరదారాగమనము ద్రవ్యనాశనముకలుగును.

సూ॥ లాభేచంద్రగురుభ్యాంసుందరీ॥ ౬౧॥

వ్యా॥ అథ కారకాంశాత్సప్తమ ఫలమాహ అత్ర దృక్పదం నివృత్తం నవమపరికరణస్య సమాప్తత్వాత్ కారకాంశాత్సప్తమే చన్ద్రగుర్వోర్యోగే సతి స్త్రీసుందరీభవతి।

టీ॥ లాభే=సప్తమస్థానమందు, చంద్రగురుభ్యాం=చంద్రగురువులుండినయెడల, సుందరీ=సుందరముగలస్త్రీయగును.

తా॥ కారకాంశకు సప్తమస్థానమందు చంద్రుఁడు బృహస్పతియునుండినయెడల సుందరమైన స్త్రీకలవాడగును.

సూ॥ రాహుణావిధవా॥ ౫౮॥

వ్యా॥ సప్తమే రాహుయోగే విధవా స్త్రీగృహేభవతి॥

టీ॥ రాహుణా=రాహువుచేత,విధవా=విధవస్త్రీకలవాడగును.

తా॥ సప్తమస్థానమందు రాహువున్నయెడల విధవయగు స్త్రీకలవాడగును.

సూ॥ శనినావయోధికారోగిణీతపస్వినీవా॥ ౫౯॥

వ్యా॥ స్పష్టం॥

టీ॥ శనినా=శనిచేత, వయోధికా=ఎక్కువవయస్సుకలదిగాని, రోగిణీ=రోగముకలదిగాని, తపస్వినీవా = సన్యాసినియగు స్త్రీ గాని యుండును.

తా॥ సప్తమస్థానమందు శనియున్నయెడల తనకంటె నెక్కువవయస్సుకలదిగాని రోగముకలదిగాని సన్యాసినిగానియుండును.

సూ॥ కుజేనవికలాంగీ॥ ౬౦॥

వా॥ అలక్షణాంగీత్యర్థః॥

టీ॥ కుజేన=కుజునిచేత, వికలాంగీ=కురూపముగలస్త్రీయుండును.

తా॥ సప్తమస్థానమందు కుజుడున్నయెడల కురూపముగలస్త్రీయుండును.

సూ॥ రవిణాస్వకులేగుప్తాచ॥ ౬౧॥

వ్యా॥ సప్తమేరవియోగేస్వకులే భర్తృకులేగుప్తారక్షితాస్థితాస్యాదామరణం నతుస్వాతన్త్ర్యేణేతస్తతోటనశీలాచ కారాద్వికలాంగీచ॥

టీ॥ రవిణా=సూర్యునిచేత, స్వకులే=తనకులమందు, గుప్తాచ=రక్షింపఁబడినదిఅగును.

తా॥ సప్తమస్థానమందురవియున్నయెడల భర్తృవంశములోనే రక్షింపబడుచు మరణపర్యంతము నటు నిటు స్వాతంత్ర్యముచే తిరుగ లేనిదియు వికలాంగియునగును.

సూ॥ బుధేనకళావతీ॥ ౬౨॥

వ్యా॥ గీతవాద్యాదిషుకుశలా॥

టీ॥ బుధేన=బుధునిచేత, కలావతీ=విద్యలుకలదియగును.

తా॥ బుధుఁడు సప్తమస్థానముననున్నయెడల గీతావాద్యాది విద్యలయందు నేర్పరియగుస్త్రీకలుగును.

సూ॥ చాపేచన్ద్రేణానావృతేదేశే॥ ౬౩॥

వ్యా॥ కారకాంశాచ్చతుర్థే చన్ద్రే సతి పూర్వోక్తయోగేషు సత్సుఅనాచ్ఛాదితే దేశే ప్రోక్తః స్త్రీప్రథమసంగ ఇత్యర్థః కారకాంశాత్సప్తమే ధనుషి చన్ద్రే ఇతివార్థః॥

టీ॥ చాపే=చతుర్థస్థానమందు, చంద్రేణ=చంద్రుడుండుటచేత అనావృతే=ఆచ్ఛాదరహితమగు, దేశే=ప్రదేశమునందుకలుగును.

తా॥ కారకాంశకు చతుర్థస్థానమందు చంద్రుడున్నయెడల ఆచ్ఛాదనరహితమగు ప్రదేశమునందు స్త్రీసంగమము కలుగును లేక కారకాంశకు సప్తమస్థానము ధనుర్లగ్నమై దానియందు చంద్రుడున్నను నీపైన జెప్పఁబడిన ఫలము కలుగునని చెప్పవచ్చును.

సూ॥ కర్మణిపాపేశూరః॥ ౬౪॥

వ్యా॥ కారకాంశాత్తృతీయ ఫలమాహ కారకాంశాత్తృతీయేపాపే సతి శూరస్స్యాత్॥

టీ॥ కర్మణి=కారకాంశకు తృతీయమందు, పాపే=పాపగ్రహముండగా, శూరః=పరాక్రమముకలవాడగును.

తా॥ తృతీయస్థానమందు పాపగ్రహమున్నయెడల పరాక్రమముకలవాడగును.

సూ॥ శుభేకాతరః॥ ౬౫॥

వ్యా। తృతీయె శుభె కాతరతః

టీ॥ శుభే = శుభగ్రిహమున్నయెడల, కాతరః = భయశీలుఁడగును.

తా। శుభగ్రిహమున్నయెడల భయశీలుఁడగును.

సూ॥ మృత్యుచింతయోఃపాపేకర్షకః॥ ౬౬॥

వ్యా॥ తృతీయ షష్ఠయోః ఫలమాహ కారకాంశా త్తృతీయ షష్ఠయోరపి సపాపత్వే కృషీవలస్స్యాత్॥

టీ॥ మృత్యు చింతయోః = తృతీయ షష్ఠస్థానములయందు, పాపే=పాపగ్రిహమున్నయెడల, కర్షకః=వ్యవసాయదారుఁడగును.

తా॥ కారకాంశకు తృతీయషష్ఠమములందుఁ పాపగ్రిహముల యెడల కృషీవలుండగును.

సూ॥ నమేగురౌవిశేషేణ॥ ౬౭॥

వ్యా। నవమె గురౌ విశేషేణ కృషీవలః॥

టీ॥ నమే=నవమస్థానమందు, గురౌ=బృహస్పతియున్నయెడల, విశేషేణ=విశేషముగా వ్యవసాయదారుఁడగును

సూ॥ ఉచ్చేశుభేశుభలోకః॥ ౬౮॥

వ్యా॥ అథ కారకాంశా ద్ద్వాదశె ఫలమాహ॥ ద్వాదశె శుభె సతి శుభలోకప్రాప్తిః॥

టీ। ఉచ్చే=ద్వాదశమునందు, శుభే = శుభగ్రిహముండగా, శుభలోకః=శుభలోకప్రాప్తికలుగును.

తా॥ కారకాంశకు పండ్రెండవస్థానమందు శుభగ్రిహమున్న యెడల శుభలోకప్రాప్తియగును.

సూ॥ కేతౌకైవల్యం॥ ౬౯॥

వ్యా॥ కారకాంశె శుభె సతి ముక్తి రిత్యర్థః అథవా కారకాంశాద్ద్వాదశె కేతౌ సతి ముక్తిరితివార్థః॥

టీ॥ కేతౌ=కేతువుండగా, కైవల్యం=ముక్తికలుగును.

తా॥ కారకాంశయందు శుభుడుండగా ముక్తి సంభవించును లేక కారకాంశకు ద్వాదశస్థానమందు కేతువుండగా ముక్తి కలుగు ననియు చెప్పవచ్చును.

సూ॥ క్రియచాపయోర్విశేషేణ॥ ౭౦॥

వ్యా॥ కారకాంశే మేషే ధనుషి వా తత్రశుభసతి విశేషేణ ముక్తిః సాయుజ్య ముక్తిరిత్యర్థః అథవా మేషే ధనుషి వా ద్వాదశే కేతౌ సతి సాయుజ్య ముక్తి రిత్యర్థః వస్తు తస్తు శుభాపేక్షయా కేతోస్సాయుజ్య ముక్తి దాతృత్వాయోగ్యత్వా త్ప్రథమ వ్యాఖ్యైవసముచితేతి బోధ్యమ్ నచ సూత్రకారేణ కేతోః శుభత్వ ముక్తం కేతోశ్చేచ్ఛుభత్వం స్యాత్తర్హి చర దశాయాం మాత్ర శుభః కేతురితివక్ష్య మాణ సూత్రోత్తర దశాయా మేవ శుభః కేతురన్యత్ర నేత్యర్థేఽవ గమ్యతఇతి॥

టీ॥ క్రియాచాపయోః=మేషధనస్సులైనయెడల, విశేషేణ= ముఖ్యముగా ముక్తికలుగును.

తా॥ మేషముగాని ధనుస్సుగాని కారకాంశయగుచు నచ్చట శుభగ్రహముండినయెడల సాయుజ్యముక్తి కలుగును. మేషముగాని ధనుస్సుగాని ద్వాదశస్థానముగుచు ఆస్థానమందు కేతువున్నయెడల సాయుజ్యముక్తికలుగుననియైనను చెప్పవచ్చును. యథార్థము విచారించగా శుభగ్రహాపేక్షచే కేతువునకు సాయుజ్యముక్తినిచ్చుటయందు యోగ్యతసంభవించదు కాఁబట్టి శుభగ్రహస్థితిచేతనే సాయుజ్యముక్తి కలుగునని చెప్పెడి మొదటి వ్యాఖ్యానమే యోగ్యమైనది. అయితే సూత్రకారునిచే కేతువునకు శుభత్వము చెప్పఁబడలేదుగాని “అత్ర శుభః కేతుః” అను సూత్రమునననుసరించి చరదశయందు మాత్రమే కేతువు శుభగ్రహమని చెప్పబడెను. మిగిలిన ప్రదేశములయందు శుభత్వము చెప్పఁగూడదని తెలిసికొనవలెను.

సూ॥ పాపైరన్యథా॥ ౭౧॥

వ్యా॥ కారకాంశా ద్వాదశే కారకాంశే చ పాపయోగేన న శుభలోకో న ముక్తిరిత్యర్థః॥

టీ॥ పాపైః=పాపగ్రహములచే, అన్యథా=దీనికి విపరీతముగా నగును.

తా॥ కారకాంశయందుగాని కారకాంశకు పండ్రెండవస్థానమందుగాని పాపగ్రహములున్నయెడల శుభలోకప్రాప్తిగాని ముక్తి కాని కలుగదు.

సూ॥ రవికేతుభ్యాంశివేభక్తః॥ ౭౨॥

వ్యా॥ అమాత్యదాశే చైవ మితి పర్యన్తం కేతావితి పదమనువర్తతే కారకాంశే రవి కేతుభ్యాం మిలితాభ్యాం స్థితాభ్యాం శివే భక్తిర్భవతి అగ్రేప్యేవమేతయోజనా॥

టీ॥ రవికేతుభ్యాం=సూర్యకేతువులున్నయెడల, శివే = శివుని యందు, భక్తః=భక్తుఁడగును.

తా॥ కారకాంశయందు సూర్యుఁడు కేతువును కలసియున్న యెడల శివునియందు భక్తికలవాడగును.

సూ॥ చంద్రేణగౌర్యామ్॥ ౭౩॥

సూ॥ శుక్రేణలక్ష్మ్యామ్॥ ౭౪॥

సూ॥ కుజేనస్కందే॥ ౭౫॥

సూ॥ బుధశనిభ్యాంవిష్ణౌ॥ ౭౬॥

సూ॥ గురుణాసాంబశివే॥ ౭౭॥

సూ॥ రాహుణాతామస్యాందుర్గాయాంచ॥ ౭౮॥

వ్యా॥ ఏవంస్పష్టం॥

తా॥ కారకాంశయందు కేతువుండగా చంద్రుడున్నయెడల పార్వతియందును శుక్రుడుండిన లక్ష్మీదేవియందును అంగారకుఁడుండిన కుమారస్వామియందును బుధశనులుండిన విష్ణువునందును బృహస్పతి యుండిన సాంబశివునియందును రాహువుండిన భూతాది దేవతలందును దుర్గాదేవియందును భక్తికలవాడగును ఈసూత్రములందన్ని స్థలముల యందు కేతువుతోగూడియుండుటయే చెప్పనలెను.

సూ॥ కేతునాగణేశేస్కందేచ॥ ౭౯॥

వ్యా॥ తామస్యాం భూతాది దేవతాయాంచేతి॥

టీ॥ కేతునా=కేతువుచేత, గణేశే=గణాధిపతియందును, స్కందేచ=కుమారస్వామియందును.

తా॥ ఒక్క కేతువే యున్నయెడల విఘ్నేశ్వరునియందును కుమారస్వామియందును భక్తికలుగును.

సూ॥ పాపర్క్షేమన్దేక్షుద్రదేవతాసు॥ ౮౦॥

వ్యా॥ కారకాంశే పాపరాశౌ శుక్రే తత్రైవచ॥

టీ॥ పాపర్క్షే=పాపక్షేత్రమునందు, మందే = శనియుండగా, క్షుద్రదేవతాసు=నీచదేవతలయందు భక్తికలుగును.

తా॥ కారకాంశ పాపక్షేత్రమగుచు దానియందు శనియున్న యెడల కర్ణపిశాచి మొదలగు నీచదేవతలయందు భక్తికలుగును.

సూ॥ శుక్రేచ॥ ౮౧॥

వ్యా॥ కారకాంశే పాపరాశౌ శుక్రే తత్రైవచ॥

తా॥ కారకాంశ పాపక్షేత్రమగుచు దానియందు శుక్రుడున్నను నీచదేవతలయందే భక్తికలవాడగును.

సూ॥ అమాత్యదాసేచైవమ్॥ ౮౨॥

వ్యా॥ ఆత్మకారకగ్రహాన్న్యూనాంశే గ్రహః అమాత్యస్తస్మాద్యోదాసో రవ్యాది గణనయా షష్ఠో గ్రహ స్తస్మిన్పాపర్క్షే కారకాంశే సతి క్షుద్రదేవతా భక్తిరిత్యర్థః పన్థా స్తు అయ మర్థః సూత్రసమ్మతశ్చేత్పాపర్క్షె మన్ద శుక్రామాత్యదాసేషు క్షుద్రదేవతా స్వితి సూత్రం ప్రణీతం స్యాదితివదన్తి తన్నపవం చేన్మన్ద శుక్రామాత్యదాసేషు మిలితేషు సత్సుక్షుద్రదేవతా భక్తిరిత్యర్థస్స్యాత్ భవతువతేషామన్యతరస్యాపి పాపర్క్షస్థిత్యా క్షుద్రదేవతా భక్తిస్తస్మాద్యోగవిభాగ ఏవౌచిత ఇతి॥

టీ॥ అమాత్యదాసేచ=అమాత్యగ్రహమునకు ఆఱవరాశియందున్నను, ఏవం=ఈప్రకారముగానేయగును.

తా॥ ఆత్మకారకగ్రహముకంటె తక్కువ అంశకలది అమాత్యగ్రహము అని చెప్పఁబడును. ఆగ్రహము పాపగ్రహమగుచు కారకాంశకలదియగునేని క్షుద్రదేవతలయందు భక్తికలుగును. అయితే యీయర్థము సూత్రసమ్మతమైనయెడల "పాపక్షేత్రమందుగల శని శుక్ర అమాత్యదాసగ్రహములైన క్షుద్రదేవతులయందు" అని సూత్రార్థముగా జెప్పవలయునని కొందరు పండితులు చెప్పిరిగాని యదికాదు. వారియభిప్రాయానుసారముగా జెప్పినను పాపక్షేత్రములయందు పైనచెప్పఁబడిన శని శుక్ర అమాత్యదాసగ్రహములు కలిసియుండగా క్షుద్రదేవతులయందు భక్తికలుగునని యర్థముచెప్పనగును అవుగాక వీరిలో నెవరు పాపక్షేత్రమందున్నను క్షుద్రదేవతలయందు భక్తికలుగును అందువలన గ్రహములస్థితివిభాగమే యోగ్యమైనది.

సూ॥ త్రికోణేపాపద్వయెమాన్త్రికః॥ ౭౩॥

వ్యా॥ కారకాంశాత్పంచమనవమయోః పాపద్వయె క్రమేణ స్థితె సతి మాన్త్రికః మన్త్రవేత్తాభవతి॥

టీ॥ త్రికోణే=త్రికోణస్థానములయందు, పాపద్వయే=పాపగ్రహములు రెండున్నయెడల, మాంత్రికః=మంత్రశాస్త్రవేత్తయగును.

తా॥ కారకాంశకు పంచమ నవమస్థానములయందు రెంటియందును పాపగ్రహములుండినయెడల మంత్రశాస్త్రమును జదివినవాఁడగును.

సూ॥ పాపదృష్టేనిగ్రాహకః॥ ౭౪॥

వ్యా॥ త్రికోణద్వయె సపాపె పాప దృష్టె భూతాదీనాంనిగ్రహకర్తాస్యాత్॥

టీ॥ పాపదృష్టే=పాపగ్రహదృష్టికలిగియుండగా, నిగ్రాహకః=నిగ్రహించువాఁడగును.

తా॥ పంచమ నవమస్థానములయందు పాపగ్రహములుండి ఆ స్థానములను పాపగ్రహములచే చూడఁబడినయెడల భేతాళాది గ్రహములను స్వాధీనముచేసికొనువాఁడగును.

సూ॥ శుభదృష్టేఽనుగ్రాహకః॥ ౧౫॥

వ్యా॥ త్రికోణద్వయె శుభదృష్టేఽనుగ్రాహకః త్రికోణేనపాపె శుభదృష్టేఽనుగ్రాహకః లోకేష్వనుగ్రాహకర్తాస్యాత్॥

టీ॥ శుభదృష్టే=శుభగ్రహదృష్టి కలుగుచుండగా, అనుగ్రాహకః=అనుగ్రహించువాడగును.

తా॥ పంచమ నవమస్థానములయందు పాపగ్రహములుండి శుభగ్రహదృష్టి కలిగినయెడల ప్రజలననుగ్రహించు సమర్థుఁడగును.

సూ॥ శుక్రేందౌశుక్రదృష్టేరసవాదీ॥ ౧౬॥

వ్యా॥ కారకాంశె చన్ద్రె శుక్రదృష్టే సతి రసవాదీ భవతి॥

టీ॥ శుక్రేందౌ=శుక్రుడుగాని చంద్రుడుగాని యుండి, శుక్రదృష్టే=శుక్రునియొక్క దృష్టికలిగియుండగా, రసవాదీ=రసాయనశాస్త్రమును తెలిసినవాడగును.

తా॥ కారకాంశయందు శుక్రచంద్రులుండినను, చంద్రుడుండి శుక్రునిచే జూడఁబడినను రసాయనశాస్త్రవేత్తయగును.

సూ॥ బుధదృష్టేభిషక్॥ ౧౭॥

వ్యా॥ శుక్రేన్దౌ బుధదృష్టే సతి వైద్యో భవతి॥

టీ॥ బుధదృష్టే=బుధునిదృష్టియుండగా, భిషక్=వైద్యశాస్త్రవేత్తయగును

తా॥ కారకాంశయందు శుక్రచంద్రులుండగా బుధదృష్టియున్నయెడల వైద్యశాస్త్రమును జదివినవాడగును.

సూ॥ చాపేచంద్రేశుక్రదృష్టేపాండుశ్విత్రీ॥ ౧౮॥

వ్యా॥ కారకాంశా చ్చతుర్థే చన్ద్రె శుక్రదృష్టే సతి శ్వేతకుష్ఠీభవతి॥

టీ॥ చాపే=చతుర్థస్థానమందు, చంద్రే=చంద్రుడుండగా, శుక్రదృష్టె = శుక్రునిదృష్టికలుగుచుండగా, పాండుశ్విత్రీ=తెల్లకుష్ఠు కలవాడగును.

తా॥ కారకాంశకు నాల్గవస్థానమందు చంద్రుడుండగాశుక్రుని దృష్టియున్నయెడల తెల్లకుష్ఠురోగముకలవాడగును.

సూ॥ కుజదృష్టేమహారోగః॥ ౮౯॥

వ్యా॥ చాపగె చన్ద్రే కుజదృష్టె మహారోగః కుష్ఠీభవతి॥

టీ॥ కుజదృష్టె=అంగారకునిచూపుకలుగుచున్నయెడల, మహారోగః=విశేషరోగవంతుడగును.

తా॥ చతుర్థస్థానమందు చంద్రుడుండగా అంగారకునిదృష్టి యున్నయెడల కుష్ఠువ్యాధికలవాడగును.

సూ॥ కేతుదృష్టేనీలకుష్ఠం॥ ౯౦॥

వ్యా॥ అర్థః ప్రాగ్వత్॥

తా॥ చతుర్థస్థానమందు చంద్రుడుండగా కేతువుయొక్క చూపుకలిగిన నల్లకుష్ఠురోగముకలవాడగును.

సూ॥ తత్రమృతౌవాకుజరాహుభ్యాంక్షయః॥ ౯౧॥

వ్యా॥ కారకాంశా చ్చతుర్థే పంచమెవా యథాయోగం కుజరాహూచేత్తస్యా స్సర్వాక్షయరోగోభవతి॥

టీ॥ తత్ర=అక్కడగాని, మృతౌవా=పంచమస్థానమందుగాని, కుజరాహుభ్యాం=కుజుడు రాహువున్నయెడల, క్షయః=క్షయరోగము కలవాడగును.

తా॥ కారకాంశకు చతుర్థస్థానమందుగాని పంచమస్థానమందుగాని కుజరాహువులున్నయెడల క్షయరోగముకలవాడగును.

సూ॥ చంద్రదృష్టౌనిశ్చయేన॥ ౯౨॥

వ్యా॥ ఉక్తస్థానగయోః కుజ రాహ్వో శ్చన్ద్రదృష్టౌ సత్యాం నిశ్చయేన క్షయరోగః చన్ద్రదృష్ట్యభావె క్షయః స్వల్పః చన్ద్రదృష్టౌ ప్రబలఇతిభావః॥

టీ॥ చంద్రదృష్టౌ = చంద్రదృష్టికలిగియుండగా, నిశ్చయేన= రూఢిగాకలుగును.

తా॥ చతుర్థమందుగాని పంచమమందుగాని కుజరాహువు లుండగా వారికి చంద్రదృష్టియున్నయెడల రూఢిగా క్షయరోగము కలుగును అనగా చంద్రదృష్టి లేనియెడల రోగము స్వల్పముగా

నందును చంద్రదృష్టి యున్నయెడల ప్రబలమగు క్షయరోగముకల వాడగును.

సూ॥ కుజేనపిటకాదిః॥ ౯౩॥

వ్యా॥ తత్ర మృతౌవా స్థితేన కుజేన పిటకాదిర్భవతి॥

టీ। కుజేన=అంగారకునిచేత, పిటకాదిః=కురుపులు మొదలగు నవికలవాడగును.

తా। చతుర్థస్థానమందుగాని పంచమస్థానమందుగాని అంగారకుఁడున్నయెడల కురుపులు మొదలగు వ్యాధులుకలవాడగును.

సూ॥ కేతునాగ్రహణీజలరోగోవా॥ ౯౪॥

వ్యా॥ తత్ర మృతౌవా కేతుశ్చే త్సంగ్రహణీ జలోదరాద్యా రోగాభవన్తి॥

టీ॥ కేతునా=కేతువుచేత, గ్రహణీ = గ్రహణిరోగముగాని, జలరోగోవా=జలోదరముగానికలుగును.

తా॥ చతుర్థమందుగాని పంచమమందుగాని కేతువుండిన యెడల అతిసారము జలోదరము మొదలగు రోగములుకలవాడగును.

సూ॥ రాహుగుళికాభ్యాంక్షుద్రవిషాణి। ౯౫॥

వ్యా॥ తత్ర మృతౌవా రాహుగుళికౌయది తర్హి మూషికాది విషాణిభవన్తి॥

టీ॥ రాహుగుళికాభ్యాం = రాహువుగుళికయు నున్నయెడల, క్షుద్రవిషాణి=క్షుద్రజంతువులయొక్క విషములు సంభవించును.

తా॥ చతుర్థస్థానమందుగాని పంచమమందుగాని రాహువు గుళికయు నున్నయెడల యెలుకలు మొదలగునవి కరచుటచే వాని విషములవలన బాధింపఁబడువాడగును.

సూ॥ తత్రశనౌధానుష్కః॥ ౯౬॥

వ్యా॥ మృతావితి నివృత్తం కారకాంశే చతుర్థే శనౌ ధనుషి నిపుణః॥

టీ॥ తత్ర=ఆచతుర్థస్థానమందు, శనౌ=శనియుండగా, ధానుష్కః=ధనుర్ధారుఁడగును.

తా॥ చతుర్థస్థానమందుశనియున్నయెడల విలువిద్యలయందు నేర్పుగలవాఁడగును.

సూ॥ కేతునాఘటికాయన్త్రీ॥ ౯౭॥

వ్యా॥ తత్ర కేతుశ్చేద్ఘటియన్త్రీభవతి॥

తా॥ చతుర్థస్థానమందు కేతువుండినయెడల ఘడియారములు మొదలగు లోహయంత్రములనుచేయు నేర్పుకలవాఁడగును.

సూ॥ బుధేనపరమహంసోలగుడీవా॥ ౯౮॥

సూ॥ రాహుణాలోహయన్త్రీ॥ ౯౯॥

సూ॥ రవిణాఖడ్గీ॥ ౧౦౦॥

సూ॥ కుజేనకుంతీ॥ ౧౦౧॥

వ్యా॥ తత్ర బుధె సతి పరమహంసో లగుడీ వా అత్ర సర్వత్రాపి తత్రేతిపదమన్వేతి॥

టీ॥ బుధేన=బుధుఁడున్నయెడల, పరమహంసః=పరమహంసగాని, లగుడీవా=దండమును ధరించినవాఁడుగానియగును, రాహుణా=రాహువుచేత, లోహయంత్రీ = లోహయంత్రములుకలవాఁడును, రవిణా=సూర్యునిచేత, ఖడ్గీ=ఖడ్గముకలవాఁడును, కుజేన=అంగారకునిచేత, కుంతీ=కుంతమను ఆయుధముకలవాఁడునగును.

తా॥ కారకాంశకుఁ చతుర్థస్థానమందుగాని బుధుఁడుండిన పరమహంసగాని దండమును ధరించిన యతీశ్వరుఁడుగాని యగును. రాహువున్నయెడల లోహయంత్రములుకలవాఁడును సూర్యుఁడున్నయెడల ఖడ్గముకలవాఁడును అంగారకున్నయెడల కుంతమనెడి యాయుధముకలవాఁడునునగును

సూ॥ మాతాపిత్రోశ్చన్ద్రగురుభ్యాంగ్రంధకృత్॥ ౧౦౨॥

వ్యా॥ కారకాంశే తత్పంచమాంశేవా యథాయోగం చన్ద్రగురూచేద్గ్రంథకర్తాభవతి॥

టీ॥ మాతాపిత్రోః=కారకాంశయందుపంచమమందు, చంద్రగురుభ్యాం = చంద్రగురువులుండుటచేత, గ్రంథకృత్=గ్రంథములఁ జేయువాడగును.

తా॥ కారకాంశయందుగాని దానికి నైదవస్థానమందుగాని యథాయోగముగా చంద్రగురువులున్నయెడల గ్రంథకర్తయగును.

సూ॥ శుక్రేణకించిదూనమ్॥ ౧౦౩॥

వ్యా॥ కారకాంశే తత్పంచమెవా చంద్ర శుక్రాభ్యాం కించిదూనం గ్రంథకర్తృత్వం స్యాత్ నన్వయమర్థస్త్వయా కథం లబ్ధమితి చేత్కేవల శుక్రేణాగ్రే ఫలస్య వక్తవ్యత్వాత్ నచ గ్రంథకర్తృత్వే కించి దూనత్వకవ్యాదిత్వంచ భవతీతివాచ్యమ్ ఏవంచేతచ్ఛుక్రేణకించిదూనం గ్రంథకృత్కవిర్వాగ్మీ కావ్యజ్ఞశ్చేతి సూత్రం ప్రణీతంస్యాత్ తస్మాదయమేవార్థః సూత్రసమ్మతః నచసమాసాంతః పతిత పదానామేకాంశానువృత్తేరనౌచిత్య మితివాచ్యం అస్మిన్గ్రంథే త్వీయరీతిరస్త్యేవేతి॥

టీ॥ శుక్రేణ=శుక్రునిచేత, కించిదూనం=కొంచెముతక్కువగా గ్రంథకర్తయగును.

తా॥ కారకాంశయందుగాని దానికిఁ బంచమమందుగాని చంద్రుడు శుక్రుఁడునున్నయెడల బృహస్పతికి చంద్రసంబంధము కలిగినప్పటికంటె కొంచెము తక్కువగా గ్రంథకర్తయగును ఈ యర్థమెట్లు సిద్ధించెననగా ముందు కేవలము ఒక్క శుక్రునియొక్క ఫలమును జెప్పుటనుబట్టియే. మఱియు గ్రంథకర్తృత్వమునందే కొంచెము తక్కువ అని చెప్పవలయునుగాని సర్వక్రియలయందును తక్కువయని చెప్పవలదు అనఁగా కవిత్వమునందు వక్తృత్వమందు కావ్యజ్ఞతయందు విద్యావిషయములందును కొంచెము తక్కువేయనఁదగదు. అట్లైనచో "శుక్రేణకించిదూనం గ్రంథకృత్కవిర్వాగ్మీకావ్యజ్ఞశ్చ" అని ౧౦౩ సూత్రమునందు చెప్పవలసియుండెడిది. అందువలన మొదట చెప్పఁబడిన యర్థమే సూత్రసమ్మతమైనది. అయితే సమాసములోనున్న పదములలో యభిప్రాయము కొంతవరకే గ్రహించుటయు నుచిత

మంటిలేని యీగ్రంథములోనిరీతి యీవిధముగానేయున్నదని గ్రహిం చవలెను

సూ॥ బుధేనతతోపి॥ ౧౦౪॥

వ్యా॥ కారకాంశె తత్పంచమె వా చన్ద్రి బుధాభ్యాం శుక్రి యోగా పేక్షయాపిన్యూనగ్రంథకర్తృత్వంస్యాత్ ॥

టీ॥ బుధేన=బుధునిచేత, తతోపి=అంతకంటెతక్కువ.

తా॥ కారకాంశయందుగాని దానికి నైదవస్థానమందుగాని చంద్రుఁడు బుధుఁడునున్నయెడల చంద్రునితో శుక్రసంబంధము కలిగి నప్పటికంటె తక్కువగా గ్రంథకర్తృత్వము కలుగును.

సూ॥ శుక్రేణ కవిర్వాగ్మీ కావ్యజ్ఞశ్చ॥ ౧౦౫॥

వ్యా॥ మాతాపిత్రోర్లేకత్రానుక్తయోగె కవ్యాదిస్స్యాత్॥

టీ॥ శుక్రేణ=శుక్రునిచేత, కవిః=కవీశ్వరుఁడును, వాగ్మి=వక్త యు, కావ్యజ్ఞశ్చ=కావ్యనాటకాదులను జదివినవాఁడునునగును.

తా॥ కారకాంశలోగాని తత్పంచమాంశలలోగాని శుక్రుఁడున్న యెడల కవీశ్వరుఁడును వక్తయు కావ్యనాటకాది గ్రంథములనుజదివిన వాఁడునునగును.

సూ॥ గురుణాసర్వవిత్ గ్రాంథికశ్చ॥ ౧౦౬॥

వ్యా॥ అర్థఃపూర్వవత్ ॥

టీ॥ గురుణా=గురువుచేత, సర్వవిత్ = అన్నియు తెలిసినవా ఁడును, గ్రాంథికశ్చ=గ్రంథకర్తయునునగును.

తా॥ కారకాంశయందు బృహస్పతియున్నయెడల సర్వ విద్య లను తెలిసినవాఁడును గ్రంథకర్తయుగగును.

సూ॥ నవాగ్మీ॥ ౧౦౭॥

వ్యా॥ వక్తృత్వం నేత్యర్థః॥

టీ॥ నవాగ్మీ = గురునివలన వక్తృత్వముకలవాఁడు మాత్రము కాఁడు.

సూ॥ విశిష్య వైయాకరణో వేదవేదాంగవిచ్చ॥ ౧౦౮॥

వ్యా॥ పునరపిగురోరేవఫలమాహ। స్పష్టం॥

టీ। విశిష్య వైయాకరణః=అన్ని వ్యాకరణములను జదివినవాడును వేదవేదాంగవిచ్చ=వేదములను వేదాంగములనుజదివినవాడుననగును.

తా॥ కారకాంశయందు బృహస్పతియుండగా నవవ్యాకరణములను జదివినవాడును నాలుగువేదములను ఆఱుశాస్త్రములను జదివినవాడుననగును.

సూ॥ సభాజడశ్శనినా। ౧౦౯॥

వ్యా॥ ఉక్తస్థానగేన మన్దేన సభాజాడ్యమ్॥

టీ॥ శనినా=శనిచేత, సభాజడః=సభలో పిరికితనముకలవాడగును.

తా॥ కారకాంశయందు శనియుండెనేని సభలో ప్రసంగించుటకు శక్తిలేనివాడగును.

సూ॥ బుధేనమీమాంసకః॥ ౧౧౦॥

వ్యా॥ స్పష్టం॥

తా॥ కారకాంశయందు బుధుడున్నయెడల మీమాంసాశాస్త్రమునందు నిపుణతకలవాడగును.

సూ॥ కుజేననైయాయికః॥ ౧౧౧॥

వ్యా॥ స్పష్టం.

తా॥ కారకాంశయందు అంగారకుడున్నయెడల తర్కశాస్త్రమునందు ప్రావీణ్యముకలుగును.

సూ॥ చంద్రేణసాంఖ్యయోగజ్ఞఃసాహిత్యజ్ఞోగాయకశ్చ॥౧౧౨॥

వ్యా॥ స్పష్టం.

టీ। చంద్రేణ=చంద్రునిచేత, సాంఖ్యయోగజ్ఞః=సాంఖ్యయోగశాస్త్రమును దెలిసినవాడును, సాహిత్యజ్ఞః=సాహిత్యమును దెలిసినవాడును, గాయకశ్చ=సంగీతమును నేర్చినవాడుననగును.

తా॥ కారకాంశయందు చంద్రుడున్నయెడల సాంఖ్యయోగశాస్త్రమును (అనఁగా వేదాంతశాస్త్రములో నొకరిమతము) కావ్య

నాటకాది గ్రంథములను జదివినవాడును సంగీతశాస్త్రమును నేర్చిన వాడునునగును.

సూ॥ రవిణా వేదాన్తజ్ఞో గీతజ్ఞశ్చ॥ ౧౧౩॥

వ్యా॥ స్పష్టం.

టీ॥ రవిణా=సూర్యునిచేత, వేదాంతజ్ఞః=వేదాంతమును దెలిసినవాడును, గీతజ్ఞశ్చ=సంగీతమును దెలిసినవాడునగును.

తా॥ కారకాంశయందు సూర్యుడున్నయెడల వేదాంతశాస్త్రమును భగవద్గీతాది గ్రంథములను సంగీతశాస్త్రమును జదివినవాడగును.

సూ॥ కేతునాగణితజ్ఞః॥ ౧౧౪॥

వ్యా॥ స్పష్టం.

తా॥ కేతువున్నయెడల గణితశాస్త్రములం దెలిసినవాడగును.

సూ॥ గురుసమ్బన్ధేనసాంప్రదాయసిద్ధిః॥ ౧౧౫॥

వ్యా॥ పూర్వోక్తయోగె గురుదృష్టి గురుషడ్వర్గ సమ్బన్ధే సతి తత్తచ్ఛాస్త్ర సమ్ప్రదాయజ్ఞోభవతి॥

టీ॥ గురుసంబంధేన = బృహస్పతియొక్క సంబంధముచే, సాంప్రదాయసిద్ధిః=ఆన్నిసాంప్రదాయములను దెలిసినవాడగును

తా॥ కారకాంశయందు కేతువుండగా బృహస్పతియొక్క దృష్టిగాని షడ్వర్గముగాని యున్నయెడల నాగణితాది శాస్త్రములను సాంప్రదాయములతో దెలిసినవాడగును.

సూ॥ భాగ్యేచైవమ్॥ ౧౧౬॥

వ్యా॥ కారకాంశా ద్వితీయేపి చన్ద్ర గుర్వాది పూర్వోక్త యోగేన గ్రంథకర్తృత్వాది పూర్వోక్తఫలంస్యాదిత్యర్థః॥

టీ॥ భాగ్యేచ = ద్వితీయమందున్నను, ఏవం = ఈప్రకారమే ఫలము కలుగును.

తా॥ కారకాంశకు ద్వితీయస్థానమందు పూర్వమందు చెప్పంబడిన చంద్రుడు బృహస్పతి మొదలగు గ్రహములయొక్కస్థితికలుగు

చుండగా గ్రంథకర్తృత్వము మొదలగు పూర్వము చెప్పఁబడిన ఫల
ములు కలుగును.

సూ॥ సదాచైవమిత్యేకే। ౧౧౭॥

వ్యా॥ కారకాంశా త్తృతీయే పి పూర్వోక్త గ్రంథయోగేన
గ్రంథకర్తృత్వాది ఫలమూహ్యమిత్యేకే॥

టీ॥ సదాచ=తృతీయస్థానమందును, ఏవమితి = ఈప్రకారమే
యని, ఏకే=కొందరనిరి.

తా॥ కారకాంశకు తృతీయస్థానమందును పూర్వము చెప్పఁ
బడిన గ్రహకూటము కలుగుచుండగా గ్రంథకర్తృత్వాది గుణములు
కలుగునని కొందఱు పండితులు చెప్పిరి.

సూ॥ భాగ్యే కేతౌ పాపదృష్టే స్తబ్ధవాక్॥ ౧౧౮॥

వ్యా॥ కారకాంశా ద్ద్వితీయె కేతౌ పాపదృష్టే సతి స్తబ్ధవాక్
కించిత్సంలగ్న వచనః కింవాప్రత్యుత్తర దానె ఝడిత్యసమర్థ వాణీకః
స్యాత్॥

టీ॥ భాగ్యే=ద్వితీయస్థానమందు, కేతు = కేతువుండగా, పాప
దృష్టె=పాపగ్రహదృష్టియున్నయెడల, స్తబ్ధవాక్=మందమైన వాక్కు
కలుగును.

తా॥ కారకాంశకు ద్వితీయస్థానమందు కేతువుండి దానికి
పాపగ్రహదృష్టి కలిగెనేని మందమగు సంభాషణకలవాడగును.

సూ॥ స్వపితృ పదా ద్భాగ్య రోగయోః పాపే సామ్యే కేమ
ద్రుమః॥ ౧౧౯॥

వ్యా॥ స్వకీయ జన్మలగ్నా జ్జన్మలగ్నా ద్వారూఢాద్వా ద్వితీయా
ష్టమయో రాశ్యోః కేవలా పాపౌస్థః సగ్రహ త్వేపి శుభపాపాన్యతరైక
గ్రహ త్వేన ద్విగ్రహవత్త్వాదినా సమసంఖ్యాచేత్తస్తదా కేమద్రుమ
యోగోభవతి నను స్వశబ్దేన కారకాంశబోధః కథంనఉచ్యతే స్వశబ్దః
కారకాంశ బోధకశ్చేత్ పితృపదాదితి వాక్యా దేవతల్లాభె పునరుపా
దానం వ్యర్థంస్యాత్ స్వశబ్దాభావె పితృపదాత్కారకాంశా త్కార
కాంశారూఢాదయమర్థస్స్యాత్ అపేక్షితస్తు జన్మలగ్నాల్లగ్నా రూఢా

ద్వేతి స్వశబ్దేనతుస్వీయ లగ్నాల్లగ్నారూఢా ద్వేత్యర్థోభవతీతి అయమే వార్థః పరంపరాశుశ్రితత్వాచీనైరుక్తః॥ శ్లో॥ ఆరూఢాజ్జన్మలగ్నాద్వా పాపాస్త్రీహానిగాయది। కేవలానగ్రహాత్వేపి సమసంఖ్యాశుభాశుభా। చంద్రదృష్టావిశేషేణ యోగఃకేమద్రుమోమతః॥ ఇతి యత్తుకారక లగ్నారూఢేభ్య ఇతి స్వామిభిరుక్తం తద్వృద్ధసమ్మతంనేతి॥

టీ॥ స్వపితృపదాత్ = జన్మలగ్నమునకుగాని ఆరూఢలగ్నము నకుగాని, భాగ్యరోగయోః=ద్వితీయాష్టమస్థానములయందు, పాపే= పాపగ్రహములుండినను, సామ్యే=సమత్వముగానుండినను, కేమద్రు మః=కేమద్రుమమనెడు యోగముసంభవించును.

తా॥ స్వకీయజన్మలగ్నమునకుగాని జన్మలగ్నారూఢ లగ్నము నకుగాని ద్వితీయాష్టమస్థానములయందు కేవల పాపగ్రహములున్నను లేక గ్రహములు కలిసియున్నను లేక కేవల శుభగ్రహములుగాని కేవలపాపగ్రహములుగాని సమసంఖ్యనున్నయెడల కేమద్రుమయోగ మనఁబడును. ఈసూత్రములోనుండు స్వశబ్దముచే ఇచ్చట కారకాంశ నెందుకుగ్రహింపలేదనిన పితృశబ్దముచేతనే ఆయర్థము వచ్చుచుండగా స్వశబ్దము ప్రయోగించుట వ్యర్థమనందగదు స్వశబ్దము ప్రయోగింప కుండినయెడల పితృపదమువలన పూర్వసూత్రములందువలెనే కార కాంశను గ్రహించి కారకాంశకుగాని కారకాంశారూఢ లగ్నమునకు గాని ద్వితీయాష్టమస్థాములని చెప్పవలసివచ్చును. అట్లుగాక ఇచ్చట ప్రకృతాపేక్షితమైనది జన్మలగ్నమునకుగాని జన్మలగ్నారూఢలగ్నము నకుగాని ద్వితీయాష్టమస్థానములని చెప్పవలసియున్నది. అందువలన స్వశబ్దముచే జన్మలగ్నముగాని జన్మలగ్నారూఢ లగ్నముగాని యని చెప్పవలయును. ఈయర్థము వృద్ధపరాశరులచే పరంపరానుపాత్యము గాచెప్పఁబడెను. శ్లో॥ ఆరూఢాజ్జన్మలగ్నాద్వా పాపాస్త్రీహానిగాయది। కేవలానగ్రహాత్వేపి సమసంఖ్యాశుభాశుభా। చంద్రదృష్టావిశేషేణ యోగఃకేమద్రుమోమతః॥ ఆరూఢలగ్నమునకుగాని జన్మలగ్నమునకు గాని ద్వితీయాష్టమస్థానములయందు కేవలపాపులుగాని కేవలశుభులు గాని రెండు నాలుగు మొదలగు సమసంఖ్యగలగ్రహములున్నయెడల

కేమద్రుమయోగమనియు దానికి చంద్రదృష్టికూడ యున్నయెడల మిక్కిలి యెక్కువ యనియు చెప్పఁబడినది. "కారకాంశకుగాని ఆరూఢమునకుగాని" యని "స్వామి" చే జెప్పఁబడినభావము వృద్ధ వాక్యసాంప్రదాయముకాదు.

సూ॥ చంద్రదృష్టౌవిశేషేణ॥ ౧౨౦॥

వ్యా॥ ప్రోక్త యోగే సతి ద్వితీయాష్టమయో శ్చన్ద్ర దృష్టౌ సత్యాం విశేషేణ కేమద్రుమో దరిద్రయోగో భవతి॥

టీ। చంద్రదృష్టౌ = చంద్రదృష్టికలిగియుండగా, విశేషేణ= అధికముగా ఆయోగముపట్టును.

తా॥ పూర్వము చెప్పఁబడిన యోగమునకు చంద్రునియొక్క దృష్టియున్నయెడల తప్పక ఆయోగము సంభవించును. కేమద్రుమ యోగమనఁగా దారిద్ర్యయోగము.

సూ॥ సర్వేషాం చైవంపాకే॥ ౧౨౧॥

వ్యా॥ ననుపూర్వోక్త ఫలాని కిం సర్వదా భవన్తి అహోస్వి త్కాలవిశేష ఇత్యాహ సర్వేషాం రాశీనాం పాకే దశాయా మేవం పూర్వోక్తాని ఫలాని భవన్తి అథవా సర్వేషాం రాశీనాం పాకేచదశా రంభకాలేఽపి పూర్వోక్త కేమద్రుమ యోగ విచారః కార్యః కేమ ద్రుమె సతి దశాయాం దారిద్ర్యంస్యాదితి॥

టీ। సర్వేషాం=అన్నిరాసులయొక్క, పాకే = దశలయందు, ఏవం=ఈప్రకారముగానేయగును.

తా॥ ఈపైన జెప్పఁబడిన ఫలములు ఎప్పుడును కలుగుగా లేక యొకానొకప్పుడాయను సందియమును నివారించుచున్నాడు. అన్ని రాసులయొక్క దశాపాకములందు నాఫలములు కలుగును. లేక కేమద్రుమయోగమును సంబంధించినగ్రహములదశాప్రారంభమందు ఈకేమద్రుమయోగము చేసికొనవలయుననియైనను చెప్పవచ్చును.

ఇతి శ్రీ నీలకంఠ జ్యోతిర్విరచితాయాం జైమినీ సూత్ర వ్యాఖ్యాయాం సుబోధిన్యాం ప్రథమాధ్యాయస్య ద్వితీయపాదస్సమాప్తః॥

# జైమినీయసూత్రములు.

## ప్రథమాధ్యాయే తృతీయపాదః.



సూ॥ అథ పదం॥ ౧॥

వ్యా॥ అథారూఢకుండలీ గ్రహా నవలంబ్య ఫలాని వక్తుం పద మధికరోతి అథైతదనంతరం యావ దీశాశ్రియం పదమృక్షాణా మితి సూత్రలక్షిత మారూఢాపరపర్యాయం పదమధిక్రియతే॥

టీ॥ అథ=అనంతరము, పదం=పదమునుగుఱించి చెప్పఁబడు చున్నది.

తా॥ ఈ పాదమునందు ఆరూఢకుండలీస్థానమునందుగల గ్రహ ములననుసరించి ఫలములు చెప్పఁబడుచున్నవి "యావదీశాశ్రియం పదమృక్షాణాం" అను సూత్రప్రకారము ఆరూఢలగ్నమను నామాం తరముగల పదమునుగుఱించి చెప్పఁబడుచున్నది.

సూ॥ వ్యయేసగ్రహేఁగ్రహదృష్టేశ్రీమంతః॥ ౨॥

వ్యా॥ అథైకాదశస్థాన ఫలమాహ లగ్నపదాదేకాంశే సగ్రహే గ్రహాంతరదృష్టే సతి లక్ష్మీవన్తో భవన్తి॥

టీ॥ వ్యయే=ఏకాదశస్థానము, సగ్రహే=గ్రహములతోఁగూడి నదై, గ్రహదృష్టే = గ్రహములచే జూడఁబడినదగునేని, శ్రీమంతః= సంపన్నులగును.

తా॥ ఆరూఢలగ్నమునకేకాదశస్థానమందు గ్రహముండియితర గ్రహదృష్టియున్నయెడల నైశ్వర్యముకల రగును.

సూ॥ శుభైర్న్యాయ్యోలాభః॥ 3॥

వ్యా॥ ఏకాదశస్థా గ్రహా ఏకాదశ ద్రష్టారశ్చ గ్రహా యది శుభాస్తర్హి న్యాయమార్గాల్లాభస్స్యాత్॥

టీ॥ శుభైః=శుభగ్రహములచేత, న్యాయ్యః=న్యాయప్రకార మగు, లాభః=లాభములుగును.

తా॥ ఏకాదశస్థానమందున్న గ్రహములును ఆస్థానమునుజూచు గ్రహములును శుభగ్రహములైనయెడల న్యాయమార్గమున ద్రవ్యము సంపాదించును.

సూ॥ పాపైరమార్గేణ॥ ౪॥

వ్యా॥ పాపగ్రహైశ్చే దేకాదశస్థా ద్రష్టారశ్చ తర్హ్యమార్గేణ శాస్త్ర విరుద్ధ మార్గేణ లాభో మిశ్రైర్మిశ్రోలాభ ఇతిజ్ఞేయం॥

టీ॥ పాపైః=పాపగ్రహములచేత, అమార్గేణ=అన్యాయముగ సంపాదించును

తా॥ ఏకాదశస్థానమందుండు గ్రహములు నాస్థానమును జూచు గ్రహములును పాపులైన నన్యాయప్రవర్తమున ద్రవ్యమును సంపాదించును లేక కొందఱు శుభులు కొందఱు పాపులునైన మిశ్రమార్గము ననగా అన్యాయమునను న్యాయముననుగూడద్రవ్యార్జనముచేయును.

సూ॥ ఉచ్చాదిభిర్విశేషాత్॥ ౫॥

వ్యా॥ ఉచ్చ స్వగృహాదిస్థ గ్రహయోగాదినా విశేషప్రాప్తిః ఉచ్చాది గుణవద్భ్యాం శుభపాపాభ్యాం న్యాయాదన్యాయాచ్చ విశేషతో లాభ ఇత్యర్థః వృద్ధైరప్యుక్తం॥ శ్లో॥ ఆరూఢాల్లగ్నభవనం గ్రహాఃపశ్యేత్తు నవ్యయం। యస్యజన్మనిసోపిస్యా త్ప్రబలో ధనవానపి॥ ద్రష్టృగ్రహాణాం బాహుల్యే తదాద్రష్టరితుంగనే। సార్గలేచాపితత్రాపి బహ్వర్గలసమాగమె। శుభగ్రహార్గలేతత్ర తత్రాప్యుచ్చగ్రహార్గలే। సుఖానిస్వామినాదృష్టే లగ్నభాగ్యాఘపేనవా। జాతస్యపుంసఃప్రాబల్యం నిర్దిశేదుత్తరోత్తరమ్॥ ఇతికోపిగ్రహోయది ద్వాదశంనపశ్యతీతి॥

టీ॥ ఉచ్చాదిభిః = ఉచ్చమొదలగుగుణములచేత, విశేషాత్ = అధికముగా సంపాదించును.

తా॥ ఉచ్చస్వక్షేత్రముమొదలగు స్థానములయందుగల గ్రహయోగమువలనవిశేషలాభప్రాప్తికలుగును. అనగానుచ్చస్వక్షేత్రాది గుణములుగల శుభపాపగ్రహములవలన న్యాయాన్యాయానుసారముగా విశేషలాభప్రాప్తికలుగునని యర్థము. ఇందునుగూర్చి వృద్ధకారిక- శ్లో॥ ఆరూఢాల్లాభభవనం గ్రహాఃపశ్యేత్తునవ్యయం। యస్య

జన్మనినోపిస్యాత్ప్రబలోధనవానపి। ద్రష్టృగ్రహాణాం బాహుళ్యే తదా ద్రష్టరితుంగగే। సార్గళేచాపితత్రాపి బాహుళ్యర్గళసమాగమే । శుభగ్రహార్గళేతత్ర తత్రాప్యుచ్చగ్రహార్గళే। సుఖానిస్వామినాదృష్టే లగ్నభాగ్యాధిపేనవా । జాతస్యపుంసః ప్రాబల్యం నిర్దిశేదుత్తరోత్తరం॥ ఆరూఢలగ్నమున కేకాదశస్థానమును గ్రహము చూచుచున్న యెడల విశేషముగు ధనవంతుడగును. మఱియు చూచుగ్రహములధికముగా నుండుట, చూచుగ్రహముచ్చస్థానమందుండుట, అర్గళముతోకూడుట, అందును బాహుళ్యర్గళమగుట, అందును శుభార్గళమగుట, అందును ఉచ్చగ్రహార్గళమగుట, లగ్నాధిపతిచేతనుగాని లగ్నభాగ్యాధిపతులచే తనుగాని చూడఁబడుట ఈ మొదలగు హేతువులలో ఒకదానికంటె నొకటి యనేకముగా జాతకునకు ప్రబలదశనిచ్చునని వృద్ధులు చెప్పిరి. మఱియు నేగ్రహమైనను పండ్రెండవస్థానమును జూడకుండునప్పుడే యీయోగముపట్టునుగాని ద్వాదశస్థానము గ్రహముచే జూడఁబడినప్పుడీయోగము సంభవింపదు.

సూ॥ నీచేగ్రహదృగ్యోగాద్వ్యయాధిక్యం॥ ౬॥

వ్యా॥ అథ పదా ద్ద్వాదశ ఫల మాహ ద్వాదశే గ్రహసత్వే గ్రహాన్తరదృష్టౌ భూయాన్వ్యయ ఇత్యర్థః శుభగ్రహేసద్వ్యయః పాపేఽసద్వ్యయఇతి।

టీ॥ నీచే=ద్వాదశమందు, గ్రహదృగ్యోగాత్ = గ్రహముల దృష్టివల్లగాని స్థితివల్లగాని, వ్యయాధిక్యం=అధికముగా కర్చగును.

తా॥ ద్వాదశమందు గ్రహములున్నను మఱియితరగ్రహముల దృష్టికలిగినను విశేషముగ ఖర్చుచేయువాడగును. శుభగ్రహములుండినయెడల యోగ్యముగా కర్చుచేయును పాపగ్రహములున్నయెడల దుర్వ్యయమగును.

సూ॥ రవిరాహుశుక్రైర్నృపాత్॥ ౭॥

వ్యా॥ పదాద్ద్వాదశే రవిరాహుశుక్రై ర్వ్యస్తై స్సమస్తైర్వా రాజమూలోవ్యయస్స్యాత్॥

టీ॥ రవిరాహుశుక్రైః=సూర్యుడు రాహువు శుక్రులుండుట చేత, నృపాత్=రాజమూలముగా ఖర్చు చేయును.

తా॥ ఆరూఢలగ్నమునకు ద్వాదశస్థానమందు సూర్యుఁడు రాహువు శుక్రుఁడు నీమూఁడుగ్రహములు కలిసియున్నను లేక ఇందే గ్రహమున్నను ప్రభుమూలముగా ఖర్చగును.

సూ॥ చంద్రదృష్టౌనిశ్చయేన॥ ౮॥

వ్యా॥ ద్వాదశగే రవ్యాదౌ చన్ద్రదృష్టిశ్చే న్నిశ్చయా ద్రాజమూలోవ్యయః చన్ద్రదృష్ట్యభావేతు సందిగ్ధఇతి॥

టీ॥ చంద్రదృష్టౌ=చంద్రునిదృష్టికలిగియుండఁగా, నిశ్చయేన=రూఢిగానగును

తా॥ ద్వాదశస్థానమందు రవిరాహుశుక్రులుండగా చంద్రుడు చూచుచున్నయెడల నిశ్చయముగా రాజమూలమునఖర్చగును చంద్రదృష్టిలేనియెడల నీచెప్పఁబడిన ఫలమువిషయమై సందేహము.

సూ॥ బుధేనజ్ఞాతిభ్యోవివాదాద్వా॥ ౯॥

వ్యా॥ బుధె ద్వాదశగే జ్ఞాతినిమిత్తాచ్చ కంటకాద్వా ద్రివ్యవ్యయః॥

టీ॥ బుధేన=బుధుడుండుటచేత, జ్ఞాతిభ్యః=జ్ఞాతులవల్లనుగాని, వివాదాద్వా=కలహరూపముగానైనను వ్యయమగును.

తా॥ బుధుడు ద్వాదశమందుండగా జ్ఞాతులవల్లనుగాని మరియొక విధముగా కలహరూపముగాగాని ఖర్చగును.

సూ॥ గురుణాకరమూలాత్॥ ౧౦॥

వ్యా॥ గురుద్ద్వాదశేచే త్కరవ్యాజేన వ్యయః॥

తా॥ ద్వాదశస్థానమందు బృహస్పతియుండుటచే పన్నులరూపముగా ఖర్చగును.

సూ॥ కుజశనిభ్యాంభ్రాతృముఖాత్॥ ౧౧॥

వ్యా॥ ద్వాదశె కుజశనీచేద్భ్రాతృద్వారావ్యయః॥

టీ॥ కుజశనిభ్యాం=అంగారకశనులుండుటచేత, భ్రాతృముఖాత్=సోదరులద్వారాఖర్చగును.

తా॥ ద్వాదశమందు కుజుడు శనియు నుండుటచేత సోదరులు మొదలగువారివలన ఖర్చుకలుగును.

సూ॥ ఏతైర్వ్యయంఏవంలాభః॥ ౧౨॥

వ్యా॥ అథైకాదశే లాభవ్యయం వదతిదిశతి ఏతైర్ద్వాదశస్థానపతితైః గ్రహైర్యథా వ్యయ ఉక్తస్తథా తైరేవైకాదశగైస్తైరేవప్రకారేణలాభోపిభవతీత్యర్థః॥

టీ॥ ఏతైః=ఈగ్రహములచేత, వ్యయే = ఏకాదశస్థానమందు, ఏవం=ఈప్రకారముగానే, లాభః=లాభము చెప్పఁదగియున్నది

తా॥ ద్వాదశస్థానమందు పైనజెప్పఁబడిన గ్రహములుండిన నేప్రకారముగా వ్యయమగునో యాగ్రహములే యేకాదశస్థానమందున్నయెడల అప్రకారముగానే లాభము కలుగునని యూహింపవలసియున్నది.

సూ॥ లాభేరాహుకేతుభ్యాముదరరోగః॥ ౧౩॥

వ్యా॥ అథ పదాత్సప్తమె ఫలమాహ పదాత్సప్తమె రాహుకేత్వోరన్యతరేణోదరరోగఃస్యాత్॥

టీ॥ లాభే=సప్తమస్థానమందు, రాహుకేతుభ్యాం = రాహుకేతువులచేత, ఉదరరోగః=ఉదరరోగము, స్యాత్=కలుగును.

తా॥ ఆరూఢలగ్నమునకు సప్తమస్థానమందు రాహువుగాని కేతువుగాని యున్నయెడల నుదరరోగముకలుగును.

సూ॥ తత్రకేతునాఝుడితిజ్యానిలింగాని॥ ౧౪॥

వ్యా॥ అథ పదాద్ద్వితీయస్థ కేతోః ఫలమాహ తత్ర పదాద్ద్వితీయె కేతుయోగేన శీఘ్రమేనం వార్ధక్య చిహ్నాని భవన్తి యత్తుస్వామ్యాదిభిర్లాభపదానువృత్యా తత్ర సప్తమె ఇత్యుక్తం తన్న ఏవం చేత్తర్హి కేతునా ఝుడితిజ్యానిలింగానీతి సూత్రం ప్రణీతం స్యాత్తత్రేతి కిమర్థమితి అన్యచ్చ చన్ద్రగురు శుక్రేషు శ్రీమన్త ఇతి వక్తవ్యత్వా

త్సప్తమస్య ధన విచారాశ్రయత్వా భావా దితి యదుక్తం వృద్ధైః॥

శ్లో॥ ఆరూఢాత్ షష్ఠమెపాపె చోరస్స్యాచ్ఛుభవర్జితె। షష్ఠమెద్వితీయె। ఆరూఢాద్వాపిసౌమ్యేతు సర్వదిశ్యధిపోభవేత్ । సర్వజ్ఞస్తత్రజీవెస్యాత్కవిర్వాదీచభార్గవె॥ వాపిద్వితీయె ఇత్యర్థః॥

టీ। తత్ర=ద్వితీయస్థానమందు, కేతునా = కేతువుచేత, జ్యానిలింగాని=వార్థక్యచిహ్నములు, ఝుడితి=శీఘ్రముగాకలుగును.

తా॥ ద్వితీయస్థానముయొక్క ఫలితమును చెప్పుచున్నాడు. ఆరూఢలగ్నమునకు ద్వితీయస్థానమందు కేతువున్నయెడల త్వరలోనే ముసలిలక్షణములు ప్రారంభమగును. అయితే పైసూత్రములో లాభపదముచే సప్తమస్థానమునుగుఱించిచెప్పఁబడుటవలన ఈసూత్రములో "తత్ర" అను పదమునకు ఆసప్తమస్థానమునందేయను నర్థము స్వామి మొదలగువారు చెప్పిరిగాని యది యథార్థముకాదు. వారియభిప్రాయముగానే చెప్పినయెడల "కేతునాఝుడితిజ్యానిలింగాని" అని సూత్రముండినచాలును "తత్ర" అనుపదము చెప్పనవసరముండదు మఱియు "చంద్రగురుశుక్రేషుశ్రీమంతః" అని ముందు ద్వితీయ భావమును గురించి చెప్పబోవుచున్నాడు. ఆసూత్రములో నేస్థానమునైనను నిర్దేశించి చెప్పకుండుటచే పైన చెప్పబడిన "తత్ర" అనగా ద్వితీయమునందు నర్థముగల పదమునే గ్రహింపవలెను. అట్లుగాక ఆసూత్రమునందు సప్తమస్థానమనియే చెప్పెదమంటిరేని సప్తభావమువలన ధనమునుగురించి యెప్పుడును విచారింపఁబడదు కాఁబట్టి పూర్వోత్తరసందర్భముచే "తత్ర" అను పదమునకు ద్వితీయస్థానమని యర్థము చెప్పవలయును ఈవిధముగానే వృద్ధకారికయందును - శ్లో॥ ఆరూఢాత్ షష్ఠభేపాపే చోరస్స్యాచ్ఛుభవర్జితే । (షష్ఠభే=ద్వితీయరాశౌ) ఆరూఢాద్వాపి(ద్వితీయే) సౌమ్యేతుసర్వదిశ్యధిపోభవేత్। సర్వజ్ఞస్తత్రజీవేస్యాత్కవిర్వాదీచభార్గవె। ఆరూఢలగ్నమునకుద్వితీయస్థానమందు శుభగ్రహములు లేక పాపగ్రహము లేక యున్నయెడల చోరుడగుననియు ఆద్వితీయస్థానమందు శుభగ్రహములున్నయెడల సన్నిదిక్కులను పాలించు ప్రభువగుననియు బృహస్పతియున్నయెడల సర్వజ్ఞుడగు

వనియు శుక్రుడున్నయెడల కవీశ్వరుఁడును వక్తయు నగునని చెప్పఁబడినది. ఈశ్లోకములలో చెప్పఁబడిన "షష్ఠభే" అను పదమువలనను "వాపి" అను పదమువలనను అక్షరసంఖ్యచే ద్వితీయస్థానమనునర్థము గ్రహింపఁదగియున్నది.

సూ॥ చంద్రగురుశుక్రేషుశ్రీమంతః॥ ౧౫॥

వ్యా॥ పదా ద్వితీయే వ్యస్తతయా సమస్తతయావా చన్ద్రాదిషుసత్సు శ్రీమన్తోభవన్తి॥

టీ॥ చంద్రగురుశుక్రేషు=చంద్రుఁడు గురుఁడు శుక్రుఁడునున్నయెడల, శ్రీమంతః=ఐశ్వర్యముకలవారగుదురు

తా॥ చంద్రుఁడు గురుఁడు శుక్రుఁడు ఆరూఢలగ్నమునకు ద్వితీయస్థానమందు నందరు కలిసిగాని లేక వారిలో కొందఱుగాని యున్నయెడల నైశ్వర్యముకలవారగుదురు.

సూ॥ ఉచ్చేనవా॥ ౧౬॥

వ్యా॥ ద్వితీయస్థితేన శుభపాపాన్యతరగ్రహేణోచ్చస్థితేనవా శ్రీమన్తోభవన్తి॥

టీ॥ ఉచ్చేనవా=ఉచ్చస్థానమందుండుటచేతను శ్రీమంతులగుదురు.

తా॥ ద్వితీయస్థానమందు శుభులుగాని పాపులుగాని యుచ్చస్థానస్థితియందుండిరేని ఐశ్వర్యముకలవారగుదురు.

సూ॥ స్వాంశవదన్యత్ప్రాయేణ॥ ౧౭॥

వ్యా॥ అన్యదత్రానుక్త ఫలం కారకాంశవద్బోధ్యం ప్రాయేణేత్యుక్త్యాన సర్వత్ర కారకాంశవత్ఫలం ఔపదేశిక శాస్త్రవిరుద్ధస్యాతిదేశికశాస్త్రస్యా ప్రవృత్తేరితి॥

టీ॥ ప్రాయేణ=తరుచుగా, స్వాంశవత్ = కారకాంశవలెనే, అన్యత్=ఇతరమైనది చూడవలెను.

తా॥ ఇక్కడచెప్పబడని యేఫలితములైనను కారకాంశవలెనే తరుచుగా చూచుకొనవలెను. తరుచుగాననుటచే నొకానొకస్థానమందు కారకాంశవలెనే చెప్పఁబడదు. గ్రంథములో విధించి చెప్పబడుదానికి విరుద్ధముగా నితర విషయము చెప్పుటకు వీలులేదు.

సూ॥ లాభపదే కేంద్రే త్రికోణేవా శ్రీమన్తః॥ ౧౮॥

వ్యా॥ లగ్నారూఢాత్కేంద్రే త్రికోణేవా లాభపదే లగ్నాత్సప్తమారూఢే సతి లక్ష్మీవన్తో భవన్తి॥

టీ॥ లాభపదే=లగ్నమునుండి సప్తమభావమునకారూఢము, కేంద్రే=కేంద్రము, త్రికోణేవా = త్రికోణముగాని అయినయెడల, శ్రీమంతః=ఐశ్వర్యముకలవారగుదురు.

తా॥ లగ్నారూఢస్థానమునకు కేంద్రస్థానముగాని త్రికోణస్థానముగాని లగ్నమునకు సప్తమారూఢస్థానమైనయెడల శ్రీమంతులగుదురు.

సూ॥ అన్యథాదుఃస్థే॥ ౧౯॥

వ్యా॥ లగ్నారూఢాత్సప్తమారూఢె దుఃస్థె షష్ఠాష్టమ వ్యయస్థైనత్యన్యథాస్యుః శ్రీమన్తోనేశ్వరః॥

టీ। దుఃస్థే=షష్ఠాష్టమ వ్యయస్థానమైనయెడల, అన్యథా=విపరీతముగానగును.

తా॥ లగ్నారూఢమునకు సప్తమారూఢము షష్ఠాష్టమవ్యయస్థానమైనయెడల ఐశ్వర్యహీనులగుదురు.

సూ॥ కేంద్రేత్రికోణోపచయేషుద్వయోర్మైత్రీ॥ ౨౦॥

వ్యా॥ లగ్న పదాత్సప్తమ పదె కేంద్రే త్రికోణోపచయగే సతి ద్వయోర్భార్యాభర్త్రోః మైత్రీభవతి ఏవంలగ్నపదాత్పుత్రాది భావ పదె కేంద్రే త్రికోణోపచయగె సతి తయోస్తయోర్మైత్రీజ్ఞేయా అత్రోపచయపదం షష్ఠాతిరిక్తపరం రిపురోగచిన్తాసు వైర మితి వక్తవ్యత్వాత్॥

టీ॥ కేంద్రే=కేంద్రస్థానముగాని, త్రికోణోపచయేషు=త్రికోణస్థానముగాని ఉపచయస్థానముగాని ఐనయెడల, ద్వయోః=భార్యాభర్తలకు, మైత్రీ=స్నేహముకలుగును.

తా॥ లగ్నారూఢమునకు సప్తమారూఢము కేంద్రస్థానముగాని త్రికోణస్థానముగాని యుపచయస్థానముగానియైనయెడల భార్యా

భర్తలిరువురకు నెప్పుడు స్నేహభావముండును. ఈ ప్రకారముగానే పుత్రభావము సోదరభావము మొదలగువానిని విచారించునప్పుడు పైన చెప్పబడినరీతిగా నాయాభావములకు కేంద్రత్రికోణోపచయస్థానముల నాలోచించి మిత్రత్వమును చెప్పవలయును. ముందు చెప్పబోవు సూత్రార్థమునను సరించి యిచ్చట నుపచయపదముచే నారవస్థానముకంటె మిగిలిన ద్వితీయ దశమైకాదశస్థానముల గ్రహింపవలయును.

సూ॥ రిపురోగచిన్తాసు వైరమ్॥ ౨౧॥

వ్యా॥ లగ్న పదా త్తత్తద్భావ పదె షష్ఠాష్టమ వ్యయగే సతి తయో స్తయో ర్వ్యయం భవతి లాభ పద ఇత్యాది సూత్ర చతుష్టయం వృద్ధైస్సంగృహీతం లగ్నారూఢదార పదం మిథః కేంద్ర గతం యది త్రిలాభేవా త్రికోణేవా తథా రాజాన్వ యాధమః ఆరూఢాత్ పుత్ర పిత్రో స్తు త్రిలాభ కేంద్రగాయది ద్వయో ర్మైత్రీ త్రికోణేతు సామ్యంద్వేషోన్యథా భవేత్ ఏవం దారాది భావానా మపి పత్యాది మిత్రతా జాతకద్వయమాలోక్య చిన్తనీయం విచక్షణైః ఇతి॥

టీ॥ రిపురోగచింతాసు=ద్వాదశాష్టమషష్ఠస్థానములైనయెడల వైరం=వైరముగానుండును.

తా॥ లగ్నారూఢమునకు సప్తమారూఢము షష్ఠాష్టమస్థానమైనయెడల భార్యాభర్తలకిరువురకు వైరముకలుగును. ఇట్లేపుత్రాది భావములను విచారించునప్పుడు పితృపుత్రాదులకు వైరముగా నుండునని చెప్పవలయును. అనఁగా తండ్రి కుమారులకు, తల్లికుమారులకు, అన్నదమ్ములకు నీవిధముగా చూచుకొనవలయును “లాభపదే” అను సూత్రము మొదలు నాలుగు సూత్రములయొక్క యభిప్రాయము వృద్ధపరాశరులచే సంక్షేపముగా నిట్లు చెప్పఁబడినది. శ్లో॥ లగ్నారూఢందారపదం మిథఃకేంద్రగతంయది। త్రిలాభేవాత్రికోణేవా తథా రాజాన్వయాధమః। ఆరూఢాపుత్రపిత్రోస్తు త్రిలాభ కేంద్రగాయది। ద్వయోర్మైత్రీత్రికోణేతు సామ్యంద్వేషోన్యథాభవేత్। ఏవందారాది

భావానా మపిపత్న్యాదిమిత్రతా । జాతకద్వయమాలోక్య చింతనీయం విచక్షణైః ॥ లగ్నారూఢస్థానము సప్తమారూఢస్థానము పరస్పరము కేంద్రముస్థానములైనను తృతీయలాభ త్రికోణస్థానములైనను చిన్నిరాజగును. పైనచెప్పఁబడిన స్థానములకంటె నితరస్థానములైనయెడల హీనుఁడగును. పుత్రారూఢము పిత్రారూఢము తృతీయలాభత్రికోణ స్థానములైనయెడల వారిరువురకు నెప్పుడు ప్రేమభావము కలిగియుండును త్రికోణస్థానమైనయెడల సమత్వముగానుండును. పైనజెప్పఁబడిన స్థానములకంటె వ్యతిరేకముగానున్నయెడల కలహముకలవారై యుందురు. ఈ ప్రకారముగ నుభయుల జాతకముల నాలోచించి దారాదిభావములవలన పత్న్యాదులకు మిత్రత్వమును చెప్పవలయును.

సూ॥ పత్నీలాభయోర్దిష్ట్యానిరాభాసార్గలయోః॥ ౨౨॥

వ్యా॥ పత్నీలాభయో ర్లగ్నపద తత్సప్తమయో ర్నిరాభాసార్గలయో నిష్ప్రతిబన్ధార్గలయోర్దిష్ట్యా భాగ్యంభవతి దిష్టేత్యాకారాన్తశ్శబ్దః "దిష్ట్యాసముపజోషంచేత్యానన్దే" ఇత్యమరః అథవా దిష్టమేవ దిష్ట్యం భాగధేయం యేషాంతే దిష్ట్యాః భాగ్యవన్త ఇత్యర్థః అత్రప్రాచీనైరుక్తం శ్లో॥ యస్యపాపశ్శుభోవాపి గ్రహస్తిష్ఠేచ్ఛుభార్గలె । తేన దృష్టేక్షితంలగ్నం ప్రాబల్యాయోపకల్పతె । యదిపశ్యేద్గ్రహస్తస్య విపరీతార్గలస్థితః॥ ఇతి పత్నీలాభయోరితి భాగ్యయోగ సిద్ధే పదరూపలగ్న గత దృష్ట్యా తస్యైవభాగ్య ప్రాబల్య రూపో గుణోనేన విజ్ఞాపిత ఇతి విశేషః॥

టీ॥ పత్నీలాభయోః=లగ్నసప్తమస్థానములయందు, నిరాభాసార్గలయోః = నిరాటంకమైన అర్గళముండుటచే, దిష్ట్యా = ఐశ్వర్యము కలుగును.

తా॥ ఇందునుగురించి ప్రాచీనకారిక - శ్లో॥ యస్యపాపశ్శుభోవాపి గ్రహస్తిష్ఠేచ్ఛుభార్గళే । తేనదృష్టేక్షితంలగ్నం ప్రాబల్యాయోపకల్పతే। యదిపశ్యేత్ గ్రహస్తస్య విపరీతార్గళస్థితః ॥ ఎవనియొక్క శుభార్గళమందు శుభగ్రహముగాని పాపగ్రహముగానియుండునో అట్టి యేగ్రహముచేతనైనను లగ్నపదము చూడబడునో అట్టి లగ్న

పదము మిక్కిలి ప్రబలమైనదగుచు నైశ్వర్యమును కలుజేయును కాని విపరీతార్గళమందే గ్రహమైననుండి యాగ్రహముయొక్క దృష్టియున్నయెడల ఫలమేమియునీయదు మఱియు (పత్నీలాభయోః) అని భాగ్యమునిమిత్తము రెండుస్థానములను నిర్దేశించి యిప్పుడు లగ్నపదమునే చెప్పుట శుభార్గళగ్రహదృష్టిసంబంధముచే భాగ్యయోగప్రాబల్యము సప్తమస్థానముకంటె లగ్నపదమునకే యధికమగుటచేనని యెంచదగియున్నది.

సూ॥ శుభార్గళేధనసమృద్ధిః॥ ౨౩॥

వ్యా॥ పదసప్తమయోః శుభైరేవయద్యర్గలం తర్హి ధనంబహువర్ధతే ఏతేన పాపార్గలేన ధనం భవతి శుభగ్రహార్గలే తతో విశేష ఇత్యర్థః పూర్వసూత్రే శుభపాప సాధారణ్యేన విపరీతార్గలం వినిర్ముక్తార్గలస్య ధనాది సత్త్వలక్షణ భాగ్యయోగః ఫలమిత్యుక్తం అస్మిన్ సూత్రేతు శుభమాత్ర ఘటితే ధన వృద్ధిః సార్వాదిక పాప మాత్ర ఘటితే ధనవత్త్వమాత్రమ్ పాపశుభోభయ ఘటితే కదాచిద్ధనసమృద్ధిః కదాచిద్ధనవత్త్వమేవేతి ననుభయపుణ్యేతి శ్లోకోక్త శుభపాప సాధారణ విపరీతార్గల భిన్న శుభార్గలమేవాత్ర శుభార్గలత్వేన కుతో నగృహ్యత ఇతిచేదుచ్యతే సూత్రద్వయే ఏకరూపాచేదర్గలా స్యాత్తర్హి పూర్వేణైవేతి సూత్రస్య వైయర్థ్యాపత్తేరితిభావః నచ భాగ్యవత్త్వధనవత్త్వభేదాదితివాచ్యమ్ ధనం వినా భాగ్యవత్త్వాఽప్రతీతేరిత్యలమ్॥

టీ॥ శుభార్గళే = శుభార్గళము కలుగుచుండగా, ధనసమృద్ధిః= విశేషమగు ధనము కలుగును.

తా॥ లగ్నసప్తమస్థానములకు శుభగ్రహములచేతనే యర్గళమున్నయెడల ధనము విశేషముగా వృద్ధియగును. ఇట్లు చెప్పుటచే పాపార్గళమున్నయెడల ధనము కలుగుననియు శుభార్గళమున్నయెడల నంతకంటె విశేషముగా కలుగుననియు నభిప్రాయము. పూర్వసూత్రములో పాపార్గళము లేకుండి శుభపాపసాధారణ్యారూపార్గళముచే ధనాదులు కలుగుట మొదలగు భాగ్యయోగము ఫలితముగా జెప్పబడినది. ఇప్పుడీసూత్రములో శుభగ్రహములు మాత్రముండినయెడల

ధనవృద్ధియు నెప్పుడు పాపగ్రహఘటనచే ధనముమాత్రమేయనియు చెప్పఁబడెను. మఱియు శుభులు పాపులు నుభయులు కలిసియున్నయెడల నొకానొకప్పుడు ధనముకలుగుటయు నొకానొకప్పుడువృద్ధికానుండుటయు జెప్పఁబడెను కాని "భయపుణ్యా" అనే వెనుక చెప్పఁబడిన శ్లోకములో శుభపాపగ్రహసాధారణరూపముగాను విపరీతార్గళముకంటె భిన్నముగాను శుభార్గళము చెప్పఁబడినది దానినే శుభార్గముగా నిక్కడకూడ యెందుకు చెప్పలేదనినయెడల రెండుసూత్రములయందును చెప్పఁబడిన అర్గళావిషయమొకవిధమేయైనయెడల నిప్పుడీ సూత్రము చెప్పుట వ్యర్థమగును. లేక భాగ్యవంతుఁడు ధనవంతుఁడునని రెండుభేదములుగా చెప్పరాదాయనిననెడల ధనముననుసరించియే భాగ్యవంతుఁడగునుగాని వేరే కానేరదుకదా.

సూ॥ జన్మకాలఘటికాస్వేకదృష్టాసురాజానః॥ ౨౮॥

వ్యా॥ జన్మలగ్నం ప్రసిద్ధం జన్మలగ్నం హోరాలగ్నం ఘటికాలగ్నం ఏతేషు త్రిష్వపి కేనచి దేకేన గ్రహేణ దృష్టేషు రాజానో భవన్తి అత్రైకగ్రహ దృష్టి విషయత్వ మపేక్షితం నత్వేకగ్రహమాత్ర దృష్టత్వం కాల లగ్నానయనం ప్రాగుక్తం ఘటికాలగ్నానయనం తు వృద్ధైరుక్తం॥ శ్లో॥ లగ్నాదేక ఘటీమాత్రం యాతిలగ్నందినేదినే। పరంతుఘటికాలగ్నం నిర్దిశేత్కాలవిత్తమః॥ ఇతిస్పష్టార్థః॥

టీ॥ జన్మకాలఘటికాసు=జన్మలగ్న, కాలలగ్న, ఘటికాలగ్నములు, ఏకదృష్టాసు=ఒక్కగ్రహముచే జూడఁబడినయెడల, రాజానః=రాజులయ్యెదరు.

తా॥ జన్మలగ్న, కాలలగ్న, ఘటికాలగ్నములు మూడింటి నొకేగ్రహము చూచుచున్నయెడల ప్రభువులగుదురు "ఏకదృష్టాసు" అనుచోట పైనచెప్పఁబడిన మూడులగ్నములను వేర్వేరు గ్రహములు చూడక ఎక్కగ్రహమే యామూటిని చూచుచుండవలయును. ఇట్లు మూడులగ్నములను చూచుచున్న గ్రహములు రెండు మూడున్న శుభాధిక్యమగును. కాలలగ్నమనఁగా హోరాలగ్నము తత్సాధనమిది

వరలో జెప్పఁబడినది. ఘటికాలగ్న సాధనము వృద్ధపరాశరులచే. శ్లో॥ లగ్నాదేకఘటీమాత్రం యాతిలగ్నందినేదినే । పరంతుఘటికాలగ్నం నిర్దిశేత్కాలవిత్తమః॥ లగ్నము మొదలొక్కొక్క ఘడియచే నొక్కొక్కలగ్నముగ ప్రతినిత్యము గడచుచుండుననియు దానినే ఘటికాలగ్నమనియు నిర్దేశించిచెప్పిరి. అనఁగా సూర్యోదయమునుండి యెన్ని ఘటికల కిష్టకాలమగునో జన్మలగ్నమునండి యన్నిరాసుల లెక్కింపగా ఘటికాలగ్నమగును.

సూ॥ పత్నీలాభయోశ్చరాశ్యంశకదృక్కాణైర్వా॥ ౨౫॥

వ్యా॥ జన్మరాశి కుండలీ నవాంశకుండలీ దృక్కాణకుండలీషు లగ్నసప్తమయోర్ద్వయో రప్యేక గ్రహా దృష్టయో స్సతోః రాజానో భవన్తి ద్రేక్కాణానయనయనం రాశి త్రిభాగా ఇతి పూర్వ ముక్తం తథాచ కుండలీత్రియభేదేన లగ్నసప్తమద్వయగణనయా షట్సమ్పద్యన్తే షట్స్వపి ఏకగ్రహదృష్టౌ రాజయోగః పూర్ణ ఇత్యర్థః రాశిర్జన్మ కాలే చన్ద్రాక్రాంత రాశిర్నతులగ్నమితి।

టీ॥ రాశ్యంశదృక్కాణైర్వా = రాశిఅంశద్రేక్కాణములచేత నైనను, పత్నీలాభయోః = లగ్నసప్తమములొక్కగ్రహముచే జూడఁబడినయెడల రాజులగుదురు.

తా॥ రాశిచక్రము అంశచక్రము ద్రేక్కాణచక్రము అను నీ మూడుచక్రములలో నున్నట్టి లగ్నసప్తమస్థానములొక్క గ్రహము చేతనే చూడఁబడినయెడల రాజులగుదురు ద్రేక్కాణమనగా రాశిలోని మూడవభాగము. ఇట్లు చెప్పుటచే మూడు చక్రములయందును లగ్నసప్తమస్థానములు రెండు రెండు చొప్పున ఆఱుస్థానములగును. ఈయాఱుస్థానముల నొక్కగ్రహమే చూచినయెడల పూర్ణమగు రాజయోగముకలుగును. ఇక్కడరాశియనగా జన్మకాలమునందు చంద్రునిచే నాక్రమింపబడినరాశియేగాని జన్మకాలలగ్నముకాదని తెలిసికొనదగియున్నది.

సూ॥ తేష్వేకస్మిన్న్యూనేన్యూనం॥ ౨౬॥

వ్యా॥ రాజయోగ ద్వయేపి కించి ద్వైకల్యాపర మిదంసూత్రం తాశ్చ తాని చతాని తేషు రాశ్యంశకదృక్కాణేషు జన్మకాలఘటికా

సుచ ఏకస్మి న్నేకగ్రహదృష్ట్యాన్యూనే సతి ద్వయో ర్లగ్నయో రేక దృష్టయో స్సతోః న్యూన రాజత్వ మి త్యర్థః ఏత దుక్తం వృద్ధైః॥
శ్లో॥ విలగ్నఘటికాలగ్న హోరాలగ్నానిపశ్యతి । ఉచ్చగ్రిహేరాజ యోగో లగ్నద్వయమథాపివా। రాశేర్ద్రేక్కాణతోంశాచ్చ రాశేరంశా దథాపివా । యద్వారాశిదృకాణాభ్యాం లగ్నదృష్టాతుయోగదః । ప్రాయేణాయంజాతకేషు ప్రభూణామేవదృశ్యతె ॥ వాక్యాంతరంచ ॥ జన్మకాలఘటీలగ్నె ష్వేకేనైవేక్షి తేషుతు। ఉచ్చారూఢేతుసమ్ప్రాప్తే చన్ద్రాత్రిగాత్రిన్నేవిశేషతః । త్రాన్తేవాగురుశుక్రాభ్యాం కేనాప్యుచ్చగ్రి హేణవా। దుష్టార్గలగ్రహాభావే రాజయోగోనసంశయః॥ ఇతి॥

టీ॥ తేషు=వానిలో, ఏకస్మిన్=ఒకటి, న్యూనే=తక్కువగు చుండగా, న్యూనం=రాజయోగముతక్కువగును.

తా॥ పూర్వము చెప్పఁబడిన రాజయోగముల రెంటియందును ఏకాంశమైనను తక్కువైనయెడల నాయోగమును తక్కువగానగును. అనఁగాజన్మలగ్న, హోరాలగ్న, ఘటికాలగ్నములలోగాని రాశిచక్ర కాలచక్రి ఘటికాచక్రిములలోగానిదేనిలోనైనను నొకదాని కేకగ్రిహ దృష్టి లేక మిగిలిన రెండుచక్రిములలో లగ్నన ప్తమస్థానముల కేకగ్రి హదృష్టియున్నయెడల కొంచెము తక్కువైన రాజత్వము కలుగును. ఇందునుగుఱించి వృద్ధవాక్యము- శ్లో॥ విలగ్నఘటికాలగ్న హోరా లగ్నానిపశ్యతి। ఉచ్చగ్రహేరాజయోగో లగ్నద్వయమథాపివా। రాశే ద్రేక్కాణతోంశాచ్చ రాశేరంశాదథాపివా। యద్వారాశిదృకాణా భ్యాం లగ్నదృష్టాతుయోగదః । ప్రాయేణాయంజాతకేషు ప్రిభూణా మేవదృశ్యతే ॥ ఏగ్రిహమైనను విలగ్న ఘటికాలగ్న హోరాలగ్న ముల మూఁడింటినిగాని లేక రెంటినిగాని చూచినయెడల రాజయోగ ముకలుగును. ఉచ్చస్థానమందుండి చూచుచున్నయెడల మిక్కిలి అధి కమైనయోగము, మఱియు రాశిద్రేక్కాణాంశచక్రిములు మూఁడింటి వల్లనుగాని లేక యిందే రెండు చక్రిములువల్లనుగాని లగ్నమును జూచునట్టి గ్రహము రాజయోగము నిచ్చును. ఈ యోగము తరు చుగా ప్రభువులకు తటస్థించును ఇందులకు మరియొక ప్రిమాణము-

శ్లో॥ జన్మకాలఘటీలగ్నే ష్వేకేనైవేక్షితేషుతు । ఉచ్చారూఢేతుసంప్రాప్తే చంద్రాక్రాంతేవిశేషతః । క్రాంతేవాగురుశుక్రాభ్యాం కేనాప్యుచ్చగ్రహేణవా । దుష్టార్గళగ్రహాభావే రాజయోగోనసంశయః ॥ జన్మకాలలగ్న ఘటికాలగ్నములొక్కగ్రహముచే జూడఁబడిన రాజయోగముకలుగును. ఉచ్చస్థానమందున్నను చంద్రునిచే నాక్రమింపబడినను మిక్కిలిమంచిది. గురుశుక్రులచేతనుగాని లేక యుచ్చస్థానమందున్న యేగ్రహముచేనైనగాని యాక్రమింపబడినను రాజయోగముకాని యీయోగము దుష్టార్గళమందు గ్రహములు లేకుండినయెడల తప్పక కలుగునుగాని దుష్టార్గళమందు గ్రహములుండినను కలుగదు.

సూ॥ ఏవమంశతోదృక్కాణతశ్చ॥ ౨౭॥

వ్యా॥ జన్మేతి సూత్రోక్త రాజయోగ మంశదృక్కాణయోరతిదిశతి యథా జన్మేతి సూత్రే జన్మలగ్న కుండల్యాసహ హోరాఘటికా కుండల్యో స్సముచ్చయ స్తథై వాంశకుండల్యా దృక్కాణ కుండల్యాచ పృథక్పృథక్కాల ఘటికాకుండల్యా సముచ్చితే తథాచ లగ్నకాలఘటికాసు అంశకాలఘటికాసు దృక్కాణఘటికాసు చైకదృష్టాసు రాజాన ఇతి రాజయోగత్రయంసిద్ధ్యతి రాజయోగాంతరం గ్రంథాంతరాద్వృద్ధైస్సంగృహీతం శ్లో॥ నిశార్ధాచ్చదినార్ధాచ్చపరంసార్ధద్వినాడికా శుభస్స్యాత్తద్భవో రాజా ధనీవా తత్సమోపివా ఇతి॥

టీ॥ ఏవం=ఈప్రకారము, అంశతః=అంశచక్రివల్లను, దృక్కాణశ్చ=ద్రేక్కాణచక్రమువల్లను.

తా॥ "జన్మకాలఘటికాసు" అను సూత్రములో జన్మలగ్న చక్రముతో హోరాఘటికాచక్రములు సముచ్చయముగా చెప్పఁబడినవిధమున నంశచక్రముతోడను ద్రేక్కాణచక్రముతోడను కాలచక్రఘటికాచక్రములు సముచ్చయముగ గ్రహింపఁదగియున్నది. ఇట్లు చేయుగా జన్మకాల ఘటికాలగ్నములు, అంశకాలఘటికాలగ్నములు, ద్రేక్కాణకాల ఘటికాలగ్నములు నేకగ్రహముచే జూడఁబడినయెడన రాజులగుదురని మూడురాజయోగములు సిద్ధించుచున్నవి. మఱియొక

రాజయోగ మితర గ్రంథాను సారముగా నిట్లు చెప్పఁబడి యున్నది. శ్లో॥ నిశార్థాచ్చదినార్ధాచ్చపరంసార్ధద్వినాడికా। శుభాస్యాత్తద్భవోరాజా ధనీవాతత్సమోపివా ॥ పగలు రెండుజాముల తర్వాతనుగాని రాత్రి రెండుజాముల తర్వాతనుగాని రెండు ఘడియలన్నర కాలము అనఁగా నొంటిఘంటలోపు కాలము శుభమగును. ఆకాలములో జనన మైనవాడు రాజుగాని ధనవంతుడుగాని ధనికునితో సమానుడుగాని యగును.

సూ॥ చంద్రశుక్రయోర్మిథోదృష్టయోఃసింహస్థయోర్వాయానవంతః॥ ౨౭॥

వ్యా॥ అథ యానయోగమాహ శుక్రచన్ద్రౌ యత్రక్వచిద్విద్యమానౌ యది పరస్పరం దృష్టిభాజౌ తర్హి యానవన్తో భవన్తి ఏవం శుక్రచన్ద్రావేవ యది సింహస్థౌ తృతీయగౌ శుక్రాచ్చన్ద్రే తృతీయగే చన్ద్రాచ్ఛుక్రేవా తృతీయగె సత్యపియానవన్త ఇతి గోలార్థః తదుక్తం వృద్ధైః ॥ శ్లో॥ చంద్రఃకవింకవిశ్చన్ద్రం పశ్యత్యపితృతీయగే। శుక్రాచ్చన్ద్రేతతశ్శుక్రే తృతీయెవాహనార్థవాౘ॥

టీ॥ చంద్రశుక్రయోః=చంద్రశుక్రులు, మిథః = పరస్పరము, దృష్టయోః = చూచుచున్నవారగుచుండగాను, సింహస్థయోర్వా= పరస్పరము తృతీయస్థానమందుండినను, యానవంతః=వాహనముగల వారగుదురు

తా॥ వాహన యోగమును జెప్పుచున్నాడు — శుక్రుఁడు చంద్రుఁడు నేరాశియందుండినను నొకరినొకరు చూచుచున్నయెడల సవారి, యేనుగు, గుఱ్ఱము మొదలగు వాహనములనెక్కు వారగుదురు. మరియు శుక్రునకు తృతీయమందు చంద్రుఁడుగాని చంద్రునకుఁ దృతీయమందు శుక్రుఁడుగాని యున్నయెడలను నట్టియోగమే కలుగును. ఇందులకు వృద్ధవాక్యము- శ్లో॥ చంద్రఃకవింకవిశ్చంద్రం పశ్యత్యపితృతీయగే। శుక్రాచ్చంద్రేతతశ్శుక్రే తృతీయేవాహనార్థవాౘ॥ పైయర్థమే యీశ్లోకమువలన కలుగుచున్నది.

సూ॥ శుక్రకుజకేతుషు వైతానికాః॥ ౨౯॥

వ్యా॥ శుక్రాదిషు మిథో దృష్టిమత్సు పరస్పరం తృతీయస్థేషు వా వితానాదిరాజచిహ్నవన్తో భవన్తి॥

టీ॥ శుక్రకుజకేతుషు=శుక్రుఁడుకుజుఁడు కేతువులకుపూర్వము చెప్పబడిన స్థితికలిగియుండగా, వైతానికాః = మేలుకట్టు మొదలగు రాజచిహ్నములు కలవారగుదురు.

తా॥ శుక్రుఁడు కుజుఁడు కేతువు నీమూఁడు గ్రహములు పూర్వము చెప్పఁబడినవిధముగా నొకరినొకరుచూచుచున్నను నొకరికొకరికి తృతీయరాశిస్థితికలిగినను (మేలుకట్టు) వితానము మొదలగు రాజలక్షణములు కలవారగుదురు.

సూ॥ స్వభాగ్యదారమాతృభావసమేషుశుభేషురాజానః॥ ౩౦॥

వ్యా॥ ఆత్మకారకా ద్రాశ్యాదినా ద్వితీయ చతుర్థ పంచమ భావతుల్యేషు శుభగ్రహేషు రాజానోభవన్తి ఏవంచ తత్తత్కారణ వశా త్తేషాం తేషామపిఫలమూహ్యమ్ తస్మాత్పుత్రాదికారకే ష్వపి రాజయోగ బలె పుత్రాదీనామపి రాజత్వం వాచ్యం॥

టీ॥ శుభేషు = శుభగ్రహములు, స్వభాగ్యదారమాతృభావసమేషు=ఆత్మకారకరాశ్యాదినుండి ద్వితీయ చతుర్థ పంచమభావముల యందు సమానముగా నున్నవారగుచుండగా, రాజానః = రాజులు, భవంతి=అగుచున్నారు.

తా॥ ఆత్మకారకగ్రహమునకు ద్వితీయ చతుర్థ పంచమ స్థానములయందు శుభగ్రహములు సమానముగనున్నయెడల రాజులగుదురు. ఇందువలన నాయాకారకానుసారముగ నాయాగ్రహముల ఫలమూహింపవలయును. ఇట్లు పుత్రాది కారకములయందును రాజయోగబలము కలిగినయెడల పుత్రాదులకును రాజయోగము చెప్పవలయును.

సూ॥ కర్మదాసయోఃపాపయోశ్చ॥ ౩౧॥

వ్యా॥ ఆత్మకారక తృతీయ షష్ఠ భావసమయోః పాపయో శ్చరాజానోభవన్తి॥

టీ॥ పాపయోః=పాపగ్రిహములును, కర్మదాసయోః=తృతీయషష్ఠస్థానములయందున్నవారగుచుండినను రాజులగుదురు.

తా॥ ఆత్మకారకగ్రహమునుండితృతీయషష్ఠస్థానములయందును పాపగ్రిహములు సమానముగానున్నయెడల రాజులగుదురు.

సూ॥ పితృలాభాధిపాచ్చైవం॥ ౩౨॥

వ్యా॥ కారకే నిరుకం యోగద్వయం లగ్నసప్తమాధిపయోరపిదిశతి లగ్నాధిపాత్సప్తమాధిపాచ్చైవం ద్వితీయ చతుర్థ పంచమ భావసమేషు శుభేషు తృతీయషష్ఠభావసమయోః పాపయోశ్చరాజాన ఇత్యర్థః నచారూఢాధికారా త్పితృపదేనారూఢో గ్రాహ్య ఇతివాచ్యం జన్మేతి సూత్రా చ్ఛాత్రికారేణ క్వచిత్కారకా త్క్వచిజ్జన్మలగ్నాదుక్తత్వా త్పితృశబ్దేనాస్మిన్గ్రంథే ప్రియోలగ్నస్యైవగ్రిహణాచ్చేతి॥

టీ॥ పితృలాభాధిపాశ్చ=లగ్నసప్తమాధిపతులవల్లను, ఏవం=ఈప్రికారమేకలుగును.

తా॥ కారకమందు చెప్పఁబడిన రెండుయోగములను లగ్నసప్తమాధిపతులయందును జెప్పుచున్నాడు. లగ్నాధిపతినుండియు సప్తమాధిపతినుండియు ద్వితీయ చతుర్థ పంచమ స్థానములయందు శుభగ్రిహములు సమానముగా నుండినను తృతీయ షష్ఠస్థానములయందు పాపగ్రహములు సమానముగనుండినను రాజులగుదురు ఈ యధ్యాయమున నారూఢమునుగుఱించి చెప్పఁబడుచున్నకారణమున "పితృ" శబ్దముచే నారూఢలగ్నమని చెప్పనక్కరలేదు "జన్మకాల" అను సూత్రమువలన నొకానొకచోట కారకము మొదలుకొనియు నొకానొకచోట జన్మలగ్నము మొదలుకొనియు చెప్పుటవలన తెలుచుగా నీగ్రింథమందు సూత్రికారునిచే "పితృ" శబ్దము జన్మలగ్నముకొరకే చెప్పఁబడినదని గ్రిహింపవలయును.

సూ॥ మిశ్రేసమాః॥ ౩౩॥

వ్యా॥ యదితత్రి పాపః శుభస్థానే శుభః పాపస్థానేఫలమాహ యోగద్వయె శుభపాపమిశ్రిణే సతి సమారాజసమారిత్యర్థః॥

టీ॥ మిశ్రే = శుభపాపమిశ్రమము కలిగియుండగ, సమాః= రాజులతోసమానులగుదురు.

తా॥ పాపస్థానమందు శుభస్థానమందు శుభపాపులు కలిసి యున్నను రాజసమానులగుదురు.

సూ॥ దరిద్రావిపరీతే॥ ౩౪॥

వ్యా॥ శుభస్థానే పాపా ఏవ పాపస్థానే శుభావేవతర్హి దరిద్రా భవన్తి॥

టీ॥ విపరీతే=ఈచెప్పినదానికంటె వ్యతిరేకముగనున్నయెడల, దరిద్రాః=దరిద్రులగుదురు.

తా॥ పైనచెప్పఁబడినవిధికంటె వ్యతిరేకముగ శుభస్థానమందు ప్రత్యేకముగ పాపగ్రహములేయుండినను పాపస్థానమందు ప్రత్యేకము శుభగ్రహములేయుండినను దరిద్రులగుదురు.

సూ॥ మాతరిగురౌశుక్రేచంద్రేవారాజకీయాః॥ ౩౫॥

వ్యా॥ లగ్నాధిపాత్సప్తమాధిపాచ్చ పంచమే గుర్వాద్యన్యతమె సతి రాజకీయా రాజాధికారవన్తో భవన్తి॥

టీ॥ మాతరి=పంచమస్థానమందు, గురౌ=గురువుగాని, శుక్రే=శుక్రుఁడుగాని, చంద్రేవా = చంద్రుఁడుగానియున్నయెడల, రాజకీయాః=రాజసంబంధమగు నుద్యోగముకలవారగుదురు.

తా॥ లగ్నాధిపతినుండిగాని సప్తమాధిపతినుండిగాని పంచమ స్థానమందు గురుశుక్రచంద్రులలో నెవరున్నను రాజసంబంధమగు నుద్యోగముచేయువారగుదురు.

సూ॥ కర్మణిదాసేవాపాపేసేనాన్యః॥ ౩౬॥

వ్యా॥ లగ్నసప్తమాధిపాభ్యాం తృతీయె షష్ఠే వా పాపే సతి సేనాధిపతయోభవన్తి॥

టీ॥ కర్మణి=తృతీయమందుగాని, దాసేవా = షష్ఠస్థానమందు గాని, పాపే=పాపగ్రహముండగ, సేనాన్యః = సేనాధిపతులగుదురు.



తా॥ లగ్నాధిపతినుండిగాని సప్తమాధిపతినుండిగాని తృతీయస్థానమందైనను షష్ఠస్థానమందైనను పాపగ్రహమున్నయెడల సేనాధిపతులగుదురు.



సూ॥ స్వపితృభ్యాం కర్మదాసస్థ దృష్ట్యాతదీశ దృష్ట్యామాతృనాథ దృష్ట్యాచధీమంతః॥ ౩౨॥

వ్యా॥ అథ బుద్ధియోగమాహ॥ ఆత్మకారకాల్లగ్నాచ్చ తృతీయ షష్ఠగతగ్రహదృష్ట్యా కారకే లగ్నేచేత్యర్థః తథా తృతీయషష్ఠేశ దృష్ట్యా తథా పంచమేశ దృష్ట్యా లగ్నకారకయోర్ధీమన్తో భవన్తి॥

టీ॥ స్వపితృభ్యాం=ఆత్మకారకమునుండియులగ్నమునుండియు, కర్మదాసస్థదృష్ట్యా= తృతీయషష్ఠస్థానములయందున్న గ్రహములయొక్కదృష్టిచేతను, తదీశదృష్ట్యా = ఆరాసుల అధిపతుల దృష్టిచేతను, మాతృనాథదృష్ట్యా =పంచమాధిపదృష్టిచేతను, ధీమంతః =బుద్ధిమంతురగుదురు

తా॥ ఆత్మకారకమునకు లగ్నమునకు ఆత్మకారకమునుండియు లగ్నమునుండియు తృతీయషష్ఠస్థానములయందున్న గ్రహములయొక్క దృష్టిగాని లేక ఆతృతీయషష్ఠస్థానాధిపతులదృష్టిగాని పంచమాధిపతి దృష్టిగాని కలిగినయెడల బుద్ధిమంతులగుదురని పండితులుచెప్పిరి.

సూ॥ దారేశదృష్ట్యాసుఖినః॥ ౩౩॥

వ్యా॥ కారకాల్లగ్నాద్వా చతుర్థేశ దృష్ట్యా లగ్నకారకయోస్సుఖినోభవన్తి॥



టీ॥ దారేశదృష్ట్యా=చతుర్థాధిపతియొక్కదృష్టిచే, సుఖినః= సుఖవంతులగుదురు.

తా॥ లగ్నకారకస్థానములకు కారకస్థానమునుండిగాని లగ్నమునుండిగాని చతుర్థాధిపతియొక్క దృష్టి యున్నయెడల సుఖవంతులగుదురు.

సూ॥ రోగేశదృష్ట్యాదరిద్రాః॥ ౩౯॥

వ్యా॥ కారకలగ్నాభ్యా మష్టమేశస్య కారకలగ్నయోర్దృష్ట్యా దరిద్రాభవన్తి॥

టీ॥ రోగేశదృష్ట్యా=అష్టమాధిపతియొక్కదృష్టిచే, దరిద్రాః= దరిద్రులగుదురు.

తా॥ కారకలగ్నములకష్టమాధిపతియొక్క దృష్టి కారకస్థానమందుగాని లగ్నమందుగాని యున్నయెడల దరిద్రులగుదురు.

సూ॥ రిపునాథదృష్ట్యావ్యయశీలాః॥ ౪౦॥

వ్యా॥ కారకలగ్నాభ్యాం ద్వాదశేశస్య లగ్నకారకయోర్దృష్ట్యా వ్యయస్వభావా భవన్తి॥

టీ॥ రిపునాథదృష్ట్యా = ద్వాదశస్థానాధిపతియొక్క దృష్టిచే, వ్యయశీలాః=ఖర్చుచేయువారగుదురు.

తా॥ లగ్నకారకస్థానములు ఆస్థానములకు ద్వాదశాధిపతిచే జూడఁబడినయెడల ఖర్చుచేయు స్వభావముకలవారగుదురు.

సూ॥ స్వామిదృష్ట్యాప్రబలాః॥ ౪౧॥

వ్యా॥ లగ్నే లగ్నేశదృష్ట్యా కారకే కారకాశ్రయరాశిదృష్ట్యా బలవంతోభవన్తి॥

టీ॥ స్వామిదృష్ట్యా = అధిపతులయొక్కదృష్టిచే, ప్రబలాః= విశేషముగ వ్యయస్వభావముకలవారగుదురు.

తా॥ లగ్నాధిపతిచే లగ్నము కారకాధిపతిచే కారకస్థానము చూడఁబడుచున్నయెడల విశేషముగ ఖర్చుచేయువారగుదురు.

సూ॥ పశ్చాదిరిపుభాగ్యయో ర్గ్రహసామ్యంబంధః కోణయో రిపుజాయయోః కీటయుగ్మయోర్దారరిఫ్ఫయోశ్చ॥ ౪౨॥

వ్యా॥ అథాపదోగా నాహ॥ పశ్చాల్లగ్నా ద్విర్ద్వాదశయోః పంచమనవమయో ర్ద్వాదశషష్ఠయో రేకాదశ తృతీయయో శ్చతుర్థ

దశమయోర్వా గ్రహసామ్యే ఏకశ్చేదేశః ద్వావేద్వౌ త్రయశ్చేత్త్రి య ఇతిరీత్యా ఖేటసామ్యే సతి బంధః కారాపతనం భవతి తత్రి పతి తేషు షడ్ధికరేషున సముచ్చయంనియమ ఇతివాచ్యం ఏవమృక్షాణాం తదీశానాంచ శుభసమ్బన్ధే నిరోధమాత్రిం పాపసమ్బన్ధా చ్ఛృంఖలా ప్రిహారాదయః ఋక్షాణాం ద్విద్వాదశాది ద్వికానాం పూర్వోక్త రీత్యా శుభసంబంధే సతి ద్వితీయ ద్వాదశయో రిత్యాది ద్వికయో రన్యతరయోగఘటకతయా శుభసంబంధశ్చేన్నిరోధమాత్రం నతుపీడా పాపసంబంధా త్కేవల పాపసంబంధా చ్ఛృంఖలాదయో భవన్తి ద్వి ద్వాదశాదిషు శుభసంబంధాభావేపి ద్వాదశేసోదిషు శుభసంబంధే సతి నిరోధమాత్రిం పాపసంబంధేతు శృంఖలాదయో భవన్తీత్యర్థః॥

టీ॥ పశ్చాత్ = లగ్నమునుండి, రిపుభాగ్యయోః = ద్వితీయ ద్వాదశస్థానములయందును, కోణయోః = పంచమ నవమ స్థానముల యందును, రిపుజాయయోః=ద్వాదశషష్ఠస్థానములయందును, కీటయుగ్మయోః = ఏకాదశతృతీయస్థానములయందును, దారరిప్ఫయోశ్చ= చతుర్థ దశమ స్థానములయందును, గ్రిహసామ్యం = సమానముగ గ్రహములున్నయెడల, బంధః=కారాగారవాసము సంభవించును.

తా॥ లగ్నమునుండి ద్వితీయ ద్వాదశ స్థానములయందైనను, నవమపంచమస్థానములయందైనను, ద్వాదశషష్ఠస్థానములయందైనను ఏకాదశతృతీయస్థానములయందైనను, చతుర్థ దశమస్థానములయందైనను, గ్రిహములు సమానముగ నున్నయెడల చెరసాల నివాసము కలుగును. ఇచ్చట చెప్పఁబడిన వానినిగుఱించి సముచ్చయ నియమములేదు. రాసులకు తదధిపతులకు శుభగ్రిహ సంబంధము కలిగిన యెడల నిరోధించుటయే సంభవించును. పాపగ్రిహసంబంధమున్న యెడల సంకెలులు వేయుట దెబ్బలు కొట్టుట మొదలగు బాధలు కలుగును. ద్వితీయ ద్వాదశములనియు, పంచమనవములనియు, నీ ప్రికారము రెండు రెండు జంటలగా చెప్పఁబడిన రాసులకు పూర్వము చెప్పఁబడిన రీతిచే శుభగ్రిహ సంబంధము కలుగుచుండగా ద్వితీయ ద్వాదశములు మొదలగు జంటలలో నొకజంటకైననుశుభసంబంధము

కలిగినయెడల నిరోధించుటయేగాని పీడింపబడడు. శుభునికి పాపగ్రహ సంబంధమున్నను అన్నియు పాపగ్రహములైనను గొలుసులు వేయుట కొట్టుట మొదలగు బాధలు కలుగును. ద్వితీయద్వాదశములు మొదలగు స్థానములకు శుభగ్రహసంబంధము లేకపోయినను ఆద్వాదశాది స్థానాధిపతులకు శుభగ్రహసంబంధమున్నను నిర్బంధము మాత్రమే కలుగును. పాపగ్రహసంబంధమున్నయెడల సంకెలులువేయుట మొదలగు బాధాకరములగు పనులు జరుగును. గ్రహసామ్యమనగా పైన జంటలగా జెప్పఁబడిన రెండు రెండు రాసులలో నొకరాశిలో నొక్క గ్రహముండిన రెండవరాశిలోను నొక్కగ్రహమే యుండవలయును. ఒకరాశిలో రెండుగ్రహములున్న రెండవదానిలోను రెండు గ్రహములు నొకదానిలో మూడుగ్రహములున్న రెండవదానిలోను మూడు గ్రహములుండవలెను ఈవిధముగా గ్రహసామ్యమునుగుఱించి చెప్పఁబడినది.

సూ॥ శుక్రాద్గౌణపదస్థో రాహుః సూర్యదృష్టో నేత్రహా॥ ౪౩॥

వ్యా॥ అథ నేత్రభంగయోగమాహ॥ శుక్రాల్లగ్నాద్గౌణపదస్థః పంచమరాశ్యారూఢస్థో రాహుః సూర్యదృష్టశ్చే న్నేత్రనాశకస్స్యాత్॥

టీ॥ శుక్రాత్=లగ్నమునుండి, గౌణపదస్థః=పంచమస్థానమందుండిన, రాహుః=రాహువు, సూర్యదృష్టః=సూర్యునిచే జూడఁబడిన యెడల, నేత్రహా=నేత్రములను బోగొట్టువాడగును.

తా॥ రాహువు లగ్నమునకు పంచమస్థానమందుండి సూర్యునిచేజూడఁబడినయెడల నేత్రములకు భంగముచేయును.

సూ॥ స్వదారగయోః శుక్రచన్ద్రయో రాత్రోద్యం రాజచిహ్నానిచ॥ ౪౪॥

వ్యా॥ స్వస్మాదాత్మకారకా చ్చతుర్థగయో శ్శుక్రచన్ద్రయోః సతో రాత్రోద్యం వాద్యవిశేషో రాజచిహ్నానిపతాకాదీనిచస్స్యుః॥

టీ॥ స్వదారగయోః = ఆత్మకారకమునకు చతుర్థస్థానములఁ బొందిన, శుక్రచంద్రయోః = శుక్రిచంద్రులవలన, ఆతోద్యం=ఢంకనవభత్ మొదలగు వాద్యవిశేషములును, రాజచిహ్నానిచ = యితరమగు రాజచిన్నెలును గలవాడగును.

తా॥ ఆత్మకారకలగ్నమునకుఁ జతుర్థస్థానమందు శుక్రుఁడు చంద్రుఁడునున్నయెడల ఢంకనభత్ మొదలగు వాద్యవిశేషములు పతాకము మొదలగు రాజచిన్నెలుకలవాడగును.

ఇతి శ్రీ నీలకంఠ జ్యోతిర్విరచితాయాం
జైమినీ సూత్రవ్యాఖ్యాయాం
సుబోధిన్యాం ప్రథమాధ్యాయస్య
తృతీయపాదస్సమాప్తః॥



# జైమినీయసూత్రములు.

## ప్రథమాధ్యాయే చతుర్థపాదః.



సూ॥ ఉపపదం పదం పిత్రనుచరాత్ ॥ ౧॥

వ్యా॥ అథోపపదాదిక మవలంబ్య ఫలమాదిశతి తత్రాదావుప పదం లక్షయతి లగ్నానుచరాత్పాదం లగ్నాద్ద్వాదస్య రాశేః యత్ప దం తదుపపదమిత్యర్థః నను పితృనుచరపదేన ద్వాదశస్య బోధః కథం మితిచేదుచ్యతే పితృలగ్నమనుచరం ద్వితీయం యస్యేతివ్యుత్పత్యా గృహాణ యత్తు పితృనుచరాదితిపాఠం స్వీకృత్యాఖండాత్స ప్తసంఖ్యా లాభాత్స ప్తమాత్పదముపపదమితి పండితైరుక్తం తదయుక్తం ఏవంచేల్లా ఘవా దుపపదపదం లాభాదితిసూత్రం ప్రణీతంస్యాదిత్యలం॥

టీ॥ పితృనుచరాత్=ద్వాదశస్థరాశినుండి, పదం=పదమును, ఉపపదం=ఉపపదమని తెలిసికొనవలయును.

తా॥ ఉపపదము మొదలగువానినవలంబించి ఫలమును జెప్పఁ దలచి ముందుగా నుపపదమును నిర్వచన చేయుచున్నాడు. లగ్నము నకు ద్వాదశమగు రాశియొక్క పదము అనఁగా ద్వాదశమునకారూ ఢముపపదమని చెప్పఁబడుచున్నది. "పితృనుచర" మను పదముచే ద్వాదశమని యెట్లు గ్రహింపఁదగినదనిన "పితృనుచర" అను శబ్దము నకు లగ్నము ద్వితీయముఁగాగల రాశియనగా ద్వాదశమని యర్థము. "పిత్రనుచరాత్" అను పాఠమ్ముగ్రహించి యిందులోకఖండమున నేడను సంఖ్య లభించుటచే సప్తమస్థానము నిగ్రహించి యుపపద మనగా సప్తమమునకు పదమని పేృమనిధి పండితులచేఁ జెప్పఁబడెను గాని యది యుక్తము కాదు. అట్లు సప్తమపదమును గుఱించియే చెప్పఁదలచినయెడల "ఉపపదంపదంలాభాత్" అని సూత్రముండెడిది. కావున నుపపదమనఁగా వ్యయారూఢమేగాని సప్తమారూఢముకాదని రూఢియగుచున్నది.

సూ॥ తత్రిపాపస్య పాపయోగే ప్రవ్రజ్యా దారనాశోవా॥ ౨॥

సూ॥ తత్రతఫలమాహ॥ పాపస్య తత్రపాపస్వామికే తస్మిన్నుప పదా ద్వితీయె పాపయోగె సతి ప్రవ్రజ్యా సన్యాసః స్త్రీనాశో వా స్యాత్ యథాకారకాధికారపదాధికారయో స్తత్రేతి పదేన కారకె పదె ఇత్యర్థో భవతి తథాత్రోపపదే ఇతి కుతో నోక్త మితి చే త్సత్యం తతోభయతాధికారః స్థితః అత్ర నాస్తీతి తత్రి పదేన ద్విసంఖ్యా లాభా దుపపద ద్వితీయె ఇత్యుక్తం అనుభవ సిద్ధత్వాచ్చేతి తదుక్తం వృద్ధైః శ్లో॥ ఆరూఢాత్షష్ఠభెపాపె చోరస్స్యాచ్ఛుభవర్జితె। ఆరూఢా ద్వాపిసామ్యేతు సర్వాదిశ్యధిపోభవేత్। సర్వజ్ఞ స్తత్రిజీవేస్యా త్క్షవిర్వా దెవభార్గవె ఇతి ॥ ఆరూఢా దుపపదా దారూఢపదేన చే దారూఢం గృహ్యాతె తర్హి పదాధికార ఏవో క్తంస్యాన్నత్వత్రేతి న చోపపదాదితి వక్తవ్యె ఆరూఢా దితి కథ ముక్తమితివాచ్యం।

టీ॥ తత్రి=ఉపపదమునకు ద్వితీయమయిన, పాపస్య=పాపగ్రహాధిపత్యముకలిగినరాశికి, పాపయోగే=పాపగ్రహసంబంధముకలుగుచుండగా, ప్రవ్రజ్యా=సన్యసించుటగాని, దారనాశోవా=భార్యనశింటగాని సంభవించును.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానము పాపగ్రహాధిపత్యము కలదై దానియందు పాపగ్రహమున్న యెడల నాజాతకునకు సన్యాసముగాని భార్యానాశముగాని సంభవించును. "తత్రి" అను పదమునకు కారకాధికారపదాధికారములందు నాకారకమునందును పదమందును నని యర్థమును జెప్పినరీతి నిచ్చటను "తత్ర" అను పదమునకుపపదము నందలి యర్థమెందుచే జెప్పలేదనిన నచ్చట నుభయస్థలములందు నధికారముకలదు. ఇచ్చట నావిధముగ లేదు "తత్రి" అను పదముచే రెండనుసంఖ్య సిద్ధించునుగాన "ద్వితీయస్థానమందు" నని చెప్పుట యుక్తము కాఁబట్టి యుపపదమునకు ద్వితీయస్థానమునందని యిచ్చట చెప్పఁదగియున్నది ఇదియే యనుభవసిద్ధమైనయర్థము అప్రకారమే వృద్ధులచే జెప్పఁబడినది- శ్లో॥ ఆరూఢాత్ షష్ఠభేపాపే చోరస్స్యాచ్ఛుభవర్జితే। ఆరూఢాద్వాపిసామ్యేతు సర్వాదిశ్యధిపోభవేత్। సర్వజ్ఞస్త

త్రజీవేస్యా త్కవిర్వాగ్మీచభార్గవె ॥ ఉపపదమునకు ద్వితీయము పాప గ్రిహరాశియై యందు శుభులు లేకుండినయెడల చోరుడగును. ఉప పదమునకు ద్వితీయస్థానమందు శుభగ్రహమున్నయెడల సర్వదిక్కులకు నధిపతియగును. మఱియు నాద్వితీయస్థానమందు బృహస్పతి యున్న యెడల సర్వజ్ఞుడును, శుక్రుడున్నయెడల కవియు వక్తయునగును. ఇచ్చట "షష్ఠ" "తత్ర" శబ్దములు రెండును ద్వితీయస్థానమునుగూర్చి చెప్పును.

సూ॥ ఉపపదస్యారూఢత్వాదేవనాత్రరవిఃపాపః॥ 3॥

వ్యా॥ అత్రి విషయె రవిః పాపత్వేన న గ్రాహ్యః తేనసింహె ఉపపదద్వితీయె మేషాది పాపరాశౌ రవౌవా సతి నే దంఫలమిత్యర్థః॥

టీ॥ ఉపపదస్య=ఉపపదము, ఆరూఢత్వాదేవ = ఆరూఢస్థాన మగుటవల్లనే, అత్ర=ఈవిషయమునందు, రవిః=సూర్యుడు, నపాపః= పాపుడుకాడు.

తా॥ ఈవిషయములో సూర్యుని పాపగ్రహముగా నెంచకూడ దని చెప్పుచున్నాడు అందుచే సూర్యుడుసింహమందుననున్న ఉపపదము నకు ద్వితీయస్థానమగు మేషాది పాపరాశియందుననున్న పూర్వము చెప్పబడిన దుష్టఫలము కలుగదని యోచవలయును.

సూ॥ శుభదృగ్యోగాన్న॥ ౪॥

వ్యా॥ ఉపపదద్వితీయె శుభదృష్టియోగాభ్యా ముక్తయోగే సత్యపినేదంఫలంభవతి॥

టీ॥ శుభదృగ్యోగాత్ = శుభగ్రిహముల దృష్టివలనను సంబం ధమువలనను, న=పూర్వము చెప్పబడినఫలము కలుగదు.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానమునందుశుభగ్రహమున్నను శుభగ్రిహ దృష్టి సంభవించినను ౨వ సూత్రిమందు చెప్పిన దుష్ట ఫలము సంభవింపదు.

సూ॥ నీచేదారనాశః॥ ౫॥

వ్యా॥ ఉపపదా ద్వితీయె నీచగ్రిహాంశకే నీచగ్రిహాధిష్ఠితేవా సతి దారనాశోభవతి॥

టీ। నీచే=నీచత్వముకలుగుచుండగా, దారనాశః = భార్యావి యోగము కలుగును.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానమునీచగ్రహాంశకలదియైనను లేక నీచగ్రహామాస్థానమందున్నను భార్యనశించును.

సూ॥ ఉచ్చేబహుదారః॥ ౬॥

వ్యా॥ ఉపపదద్వితీయెఉచ్చేశ ఉచ్చగ్రహాధిష్ఠితేవా సతిబహు దారస్స్యాత్॥

టీ॥ ఉచ్చే = ఉచ్చస్థానమగుచుండగా, బహుదారః = అనేక భార్యలుకలవాడగును.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానముచ్చగ్రహాధిపత్యము కలది యైనను ఆస్థానమందు గ్రహముచ్చస్థితిలో నుండినను ననేకభార్యలుకల వాడగును.

సూ॥ యుగ్మేచ॥ ౭॥

వ్యా॥ ఉపపదద్వితీయె మిథునే సతి బహుదారస్స్యాత్॥

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానము మిథున రాశియైనను బహుభార్యలుకలవాడగును

సూ॥ తత్ర స్వామియుక్తే స్వర్క్షే వా తద్ధేతా వుత్తరాయుషి నిర్దారః॥ ౮॥

వ్యా॥ దారనాశ యోగె విలంబకారయోగ మాహ॥ తత్రో(?)ప పదద్వితీయె స్వామినాయుక్తే ఉత్తరాయుషి నిర్దారస్స్యాత్ తచ్ఛబ్దేన పూర్వపరామర్శః తద్ధేతౌ తస్యోపపద ద్వితీయస్య హేతుః స్వామీ తస్మిన్స్వర్క్షే స్వరాశౌ సతి చోత్తరాయుషి నిర్దార స్స్యాత్ రాశేః కారణీభూతో గ్రహ ఏవతస్మాత్స్వామినః స్వగృహయోగోపేక్షితః ననుస్వామ్యాదిభిస్తచ్ఛబ్దేన దారకారకగ్రహాణాత్త్వయేదం కథముక్త మితిచేచ్ఛృణు ఆదౌదారకారకగ్రహాణాభావాత్తచ్ఛబ్దేన దారకా రకగ్రహాణానౌచిత్యాత్ పూర్వం దారనాశపదేన దారకారకబోధా భావాచ్చ నను రవిచన్ద్రయోరేకగృహత్వాత్స్వర్క్షేతద్ధేతావిత్యంశస్య సంభవోనేతిచేన్మాస్త్వస్మాకంకాక్షతిరితి॥

టీ॥ తత్ర=ఉపపదమునకు ద్వితీయస్థానము, స్వామియుక్తే=అధిపతితో గూడినదగుచుండగా, తద్దేతౌ = ఆయుపపద ద్వితీయాధిపతి, స్వక్షేత్రేవా=స్వక్షేత్రమందుండగా, ఉత్తరాయుషి = ఉత్తరవయస్సునందు, నిర్దారః=భార్యలేనివాడగును.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానము తదధిపతితో గూడినను ఉపపదద్వితీయాధిపతికి స్వక్షేత్రస్థితికలిగినను పూర్వవయస్సు గడచిన పిమ్మట ననఁగా 50 సంవత్సరములు గడచినపిమ్మట భార్యావియోగముకలుగును.

సూ॥ ఉచ్చేతస్మిన్నుత్తమకుద్దారలాభః॥ ౯॥

వ్యా॥ తస్మిన్నుపపదద్వితీయస్వామిని ఉచ్చరాశౌ స్థితె సత్యుత్తమకులాద్దారలాభస్స్యాత్॥

టీ॥ తస్మిన్=ఉపపదద్వితీయాధిపతి, ఉచ్చే=ఉచ్చస్థానమందుండగా, ఉత్తమకులాత్=ఉత్తమవంశమునుండి, దారలాభః = భార్య లభించును.

తా॥ ఉపపదద్వితీయాధిపతికి ఉచ్చరాశిస్థితికలిగెనేని యుత్తమకులవతియగు స్త్రీనిబొందును.

సూ॥ నీచేవిపర్యయః॥ ౧౦॥

వ్యా॥ తస్మిన్నుపపదద్వితీయస్వామిని నీచరాశిస్థితే సత్యనుత్తమకులాద్దార లాభస్స్యాత్॥

టీ॥ నీచే=నీచస్థానమందుండెనేని, విపర్యయః=దీనికంటె వ్యతిరేకముగాకలుగును.

తా॥ ఉపపద ద్వితీయాధిపతి నీచరాశియందున్నయెడల తనకంటె తక్కువకులమునుండి స్త్రీని బొందువాడగును

సూ॥ శుభసంబంధాత్సుందరీ। ౧౧॥

వ్యా॥ ఉపపదద్వితీయ శుభవర్గదృష్టియోగే సతి స్త్రీ సుందరీ భవతి॥

టీ॥ శుభసంబంధాత్=శుభగ్రహసంబంధమువలన, సుందరీ=భార్యసుందరమైనస్త్రీయగును.

తా॥ ఉపపదద్వితీయస్థానయునకు శుభగ్రహస్థితిగాని దృష్టిగాని యున్నయెడల సౌందర్యముగల భార్యకలవాడగును.

సూ॥ రాహుశనిభ్యా మపవాదాత్త్యాగో నాశో వా॥ ౧౨॥

వ్యా॥ ఉపపదద్వితీయె రాహుశనిభ్యాం యోగే సతి లోకాపవాదాత్త్రియాస్త్యాగో నాశో వాస్యాత్॥

టీ॥ రాహుశనిభ్యాం = రాహుశనులచేత, అపవాదాత్ = అపవాదవలన, త్యాగో వా = విడిచిపెట్టుటగాని, నాశో వా = నాశనముగాని కలుగును.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానమందు రాహు శనులున్న యెడల లోకాపవాదమువలన భార్యను విడిచిపెట్టుటగాని భార్యా వినాశముగాని సంభవించును.

సూ॥ శుక్రకేతుభ్యాంరక్తప్రదరః॥ ౧౩॥

వ్యా॥ ఉపపదద్వితీయె శుక్రకేతుయోగే సతి రక్తప్రదరరోగవతీస్త్రీస్యాత్॥

టీ॥ శుక్రకేతుభ్యాం = శుక్రకేతువులచేత, రక్తప్రదరః = రక్తప్రదరమనురోగము స్యాత్ = కలుగును.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానమందు శుక్రకేతువులున్న యెడల భార్య రక్తప్రదరరోగముకలదియగును.

సూ॥ అస్థిస్రావోబుధకేతుభ్యామ్॥ ౧౪॥

వ్యా॥ ఉపపదద్వితీయె బుధకేతుభ్యాం యోగే అస్థిస్రావరోగవతీస్త్రీస్యాత్॥

టీ॥ బుధకేతుభ్యాం = బుధకేతువులచేత, అస్థిస్రావః = అస్థిస్రావమనురోగముకలుగును.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానమందు బుధకేతువులున్న యెడల భార్యకు అస్థిస్రావమనురోగముకలుగును.

సూ॥ శనిరాహుభిరస్థిజ్వరః॥ ౧౫॥

వ్యా॥ ఉపపదద్వితీయె శన్యాదిత్రికయోగేఽస్థిజ్వరవతీస్యాత్॥

టీ॥ శనిరవిరాహుభిః = శనిసూర్యరాహువులచేత, అస్థిజ్వరః= ఎముకలజ్వరముకలుగును.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానమందు శని సూర్యుడు రాహువునున్నయెడల నెముకలనుకూడ బాధించునట్టి జ్వరముచే భార్య పీడింపబడునదగును.

సూ॥ బుధకేతుభ్యాంస్థౌల్యమ్॥ ౧౬॥

వ్యా॥ ఉపపదద్వితీయెబుధకేతుభ్యాంయోగేస్థూలాస్త్రీస్యాత్॥

టీ॥ బుధకేతుభ్యాం=బుధకేతువులచేత, స్థౌల్యం=స్థూలత్వము కలుగును.

తా॥ ఉపపదమునకు ద్వితీయస్థానమందు బుధకేతువులుండుట వలన భార్య స్థూలమైన శరీరముకలదియగును.

సూ॥ బుధభౌమక్షేత్రేమందారాభ్యాం నాశికారోగః॥ ౧౭॥

వ్యా॥ బుధగృహే భౌమగృహే వ్రోపపదద్వితీయగతె సతి శనిభౌమాభ్యాం యోగేనాసికారోగవతీస్స్యాత్॥

టీ॥ బుధభౌమక్షేత్రే=బుధుని గృహమందుగాని కుజుని గృహమందుగానీ, మందారాభ్యాం=శని అంగారకులచేత, నాసికారోగః= ముక్కునందు రోగముకలుగును.

తా॥ బుధునిగృహముగాని అంగారకునిగృహముగాని యుపపదమునకు ద్వితీయస్థానమై దానియందు శన్యంగారకులున్నయెడల భార్యకు నాసికారోగముకలుగును.

సూ॥ కుజక్షేత్రేచ॥ ౧౮॥

సూ॥ గురుశనిభ్యాం కర్ణరోగోనరహకాచ॥ ౧౯॥

వ్యా॥ బుధకుజాన్యతరక్షేత్రే ఉపపదద్వితీయగే సతి తత్రగురుశనియోగే కర్ణరోగవతీ నరహకా నాడికా నిస్సరణరోగవతీచస్యాత్॥

టీ॥ కుజక్షేత్రేచ=అంగారకునిక్షేత్రమందును, గురుశనిభ్యాం= గురువు శనియుండుటచేత, కర్ణరోగః = చెవులసంబంధమగు రోగము కలుగును, నరహాకాచ=నాడులసంబంధమగు రోగమును కలుగును.

తా॥ బుధునిక్షేత్రమందుగాని యంగారకుని క్షేత్రమందుగాని బృహస్పతియు శనియు నున్నయెడల చెవులయందు వ్యాధికలుగును. మఱియునరములులాగుట మొదలగు రోగములచేభార్యపీడింపబడును.

సూ॥ గురురాహుభ్యాందన్తరోగః॥ ౨౦॥

వ్యా॥ బుధకుజాన్యతర క్షేత్రిగె ఉపపద ద్వితీయె గురురాహుభ్యాం యోగె దన్తరోగవతీస్యాత్॥

టీ॥ గురురాహుభ్యాం = గురురాహువులచేత, దంతరోగః= దంతములయందు వ్యాధికలుగును.

తా॥ ఉపపదద్వితీయస్థానము బుధకుజులలో నెవరిక్షేత్రమైన నగుచు దానియందు గురువు రాహువు నున్నయెడల భార్య దంతరోగముకలదియగును.

సూ॥ శనిరాహుభ్యాంకన్యాతులయోఃపంగుర్వాతరోగోవా॥ ౨౧॥

వ్యా॥ కన్యాతులాన్యతరగె ఉపపదద్వితీయె శనిరాహుభ్యాం యోగె పంగుర్వాతరోగవతీస్యాత్॥

టీ॥ కన్యాతులయోః= కన్యయందుగాని తులయందుగాని, శనిరాహుభ్యాం=శనిరాహువులుండుటచే, పంగుః=కుంటిగాని, వాతరోగోవా=వాతరోగముగాని కలుగును.

తా॥ ఉపపదద్వితీయస్థానము కన్యారాశిగాని తులరాశిగాని యని యగుచు దానియందు శనిరాహువులున్నయెడల భార్య కుంటిదిగాని వాతరోగముకలదిగానియగును.

సూ॥ శుభదృగ్యోగాన్న॥ ౨౨॥

వ్యా॥ యద్యుపపదద్వితీయె దృష్టిర్వాస్యాత్తర్హి నిరుక్తాదోషాన్యుః॥

టీ॥ శుభదృగ్యోగాత్ = శుభగ్రహస్థితిగాని దృష్టిగాని కలిగిన యెడల, న=కలుగవు.

తా॥ ఉపపదద్వితీయస్థానమునకు శుభగ్రహస్థితిగాని దృష్టిగాని యున్నయెడల పైనజెప్పబడిన దుష్టఫలము లేమియుకలుగవు.

సూ॥ సప్తమాంశగ్రహేభ్యశ్చైవం॥ ౨౩॥

వ్యా॥ ఉపపదాద్యాః సప్తమోభావ స్తద్భావస్య నవాంశశ్చ తాభ్యాంతయోః స్వామినౌ గ్రహౌతాభ్యాంచ ద్వితీయె ఏవం పూర్వోక్తాని ఫలాని సమున్నేయాని తదుక్తం వృద్ధైః సప్తమేశ ద్వితీయస్థేప్యేవం ఫలముదాహృతం ఇతి॥

టీ॥ ఏవం=ఈప్రకారముగా, సప్తమాంశగ్రహేభ్యః = సప్తమాంశమువల్లను గ్రహములవల్లను ఫలములను దెలిసికొనవలయును.

తా॥ ఉపపదమునకు సప్తమభావముయొక్కయు సప్తమ భావ నవాంశముయొక్కయు సప్తమభావ నవాంశాధిపతుల యొక్కయు ద్వితీయస్థానములవలన పూర్వము చెప్పఁబడిన ఫలములను దెలిసికొనవలెను ఇందునుగుఱించి వృద్ధవాక్యము - శ్లో॥ సప్తమేశాద్ద్వితీయస్థేప్యేవంఫలముదాహృతం॥

సూ॥ బుధశనిశుక్రేచానపత్యః॥ ౨౮॥

వ్యా॥ ఉపపదా త్సప్తమాంశ గ్రహేషు బుధశనిశుక్రయోగే సత్యపత్యహీనోభవతి॥

టీ॥ బుధశనిశుక్రే=బుధశనిశుక్రులగుచుండగా, అనపత్యః= సంతానముండదు.

తా॥ ఉపపదమునకు సప్తమభావ తన్నవాంశ గ్రహములు బుధునితోగాని శనితోగాని శుక్రునితోగాని కూడియున్నయెడల సంతానము లేనివాడగును.

సూ॥ పుత్రేషురవిరాహుగురుభిర్బహుపుత్రః॥ ౨౯॥

వ్యా॥ ఉపపదా త్సప్తమాంశ గ్రహేభ్యః పంచమస్థానేషు రవ్యాదిషు సత్సు బహుపుత్రస్స్యాత్॥

టీ॥ పుత్రేషు=పంచమస్థానములయందు, రవిరాహుగురుభిః= సూర్యుడు రాహువు గురువు ఉండుటచే, బహుపుత్రః=అనేకపుత్రులు కలవాడగును.

తా॥ ఉపపదమునకు సప్తమభావ తన్నవాంశ గ్రహములకు పంచమస్థానములందు సూర్యుడు రాహువు బృహస్పతియున్నయెడల ననేకమంది తనయులుకలుగుదురు.

సూ॥ చంద్రేణైకపుత్రః॥ ౨౬॥

వ్యా॥ సప్తమాంశ గ్రహేభ్యః పంచమస్థానేషు చన్ద్రేసతిఏక పుత్రస్స్యాత్॥

టీ॥ చంద్రేణ=చంద్రునిచేత, ఏకపుత్రః =ఒక్కకుమారుఁడు కలవాడగును.

తా॥ సప్తమాంశగ్రహములకు పంచమస్థానములందు చంద్రుడుండిన ఒక్కకుమారుడేకలుగును.

సూ॥ మిశ్రేవిలంబాత్పుత్రః॥ ౨౭॥

వ్యా॥ ఉపపదా త్సప్తమాంశగ్రహేభ్యః పంచమస్థానేషు అనపత్యత్వాదిగ్రహమిశ్రణే సతి విలమ్బా త్పుత్రలాభస్స్యాత్॥

టీ॥ మిశ్రే=రెండువిధములగుగ్రహములుండగా, విలంబాత్=ఆలస్యమువలన, పుత్రః=పుత్రులుకలవాడగును.

తా॥ ఉపపదమునకు సప్తమాంశగ్రహములకు బంచమస్థానములయందు సంతానము కలిగించు గ్రహములును కలిగించని గ్రహములును నీరెండువిధములైనవియు నున్నయెడల చాలకాలమునకు సంతానముకలుగును.

సూ॥ కుజశనిభ్యాందత్తపుత్రః॥ ౨౮॥

వ్యా॥ ఉపపదా త్సప్తమాంశగ్రహేభ్యః పంచమేషు కుజశనిభ్యాం స్థితాభ్యాం దత్తపుత్రవాన్స్యాత్॥

టీ॥ కుజశనిభ్యాం=కుజశనులచేత, దత్తపుత్రః=దత్తపుత్రుఁడు కలవాడగును.

తా॥ ఉపపదమునకు సప్తమాంశగ్రహములకు బంచమస్థానములయందు అంగారకుఁడుగాని శనిగాని యుంటచే సంతానము లేక కుమారుని దత్తతజేసికొనును.

సూ॥ ఓజేబహుపుత్రః॥ ౨౯॥

వ్యా॥ ఉపపదా త్సప్తమాంశగ్రహేభ్యః పంచమేషు ఓజరాశౌ సపి బహుపుత్రస్స్యాత్॥

టీ॥ ఓజే=విషమరాశియగుచుండగా, బహుపుత్రః = అనేక పుత్రులుకలవాడగును.

తా॥ సప్తమాంశగ్రహములకు బంచమస్థానము విషమరాశి యగునేని బహుపుత్రులుకలవాడగును.

సూ॥ యుగ్మేల్పపుత్రః॥ ౩౦॥

వ్యా॥ ఉక్తస్థానే యుగ్మరాశౌ సత్యల్పాపత్యో భవతి॥

టీ॥ యుగ్మే=సమరాశియగునేని, అల్పపుత్రః = స్వల్పముగా సంతతికలవాడగును.

సూ॥ గృహక్రమా త్కుక్షితదీశ పంచమాంశ గ్రహేభ్య శ్చైవమ్॥ ౩౧॥

వ్యా॥ గృహక్రమాత్ జన్మలగ్నక్రమాత్ తదాభావానాం విచారః క్రియతె తథా కుక్షితదీశాదిభ్యోఽపి కుర్యాత్ కుక్షి తదీశా వుపపదోపపదేశౌ తాభ్యాం పంచమాంశగ్రహాః పంచభావ స్తద్భా వస్థ నవాంశశ్చతాభ్యాంతయోః స్వామిగ్రహాభ్యాంచైవ పూర్వోక్త ఫలవిచారః కార్యఇత్యర్థః తస్మాద్యత్ర యస్యసంభవ స్తస్యాగ్రిమసూ త్రేనువృత్తిఃకార్యా భ్రాతృభ్యా మిత్యాదిసూత్రె షూపపదోపదేశా భ్యాం విచారః కార్యఇతి కుక్షిపదేన ప్రకరణపతితోపపదస్యగ్రహణం నను స్వాప్యాదిభిః కుక్షితదీశావితి సింహావలోకనమిత్యుక్తం తత్సర్వసాధా రణ్యా దనుపయుక్తం విశేషతోస్మికచ్ఛాస్త్రేఽఙ్కురగమ్యాం కానా మేకగ్రహణాదితి॥

టీ॥ గృహక్రమాత్ = జన్మలగ్నమునుండివలెనే, కుక్షితదీశ పంచమాంశగ్రహేభ్యః=ఉపపదమునుండియు దానియధిపతినుండియు పంచమభావతదధిపతులవల్లను, ఏవం=ఈప్రకారముగానే ఫలమును విచారింపవలెను.

తా॥ జన్మలగ్నమునుండి ఫలములను విచారించినవిధముగానే యుపపదమువల్లను, తదుపపదాధిపతివల్లను, పంచమభావమువల్లను, పంచమభావమునందుగల నవాంశమువల్లను, పంచమభావనవాంశాధి పతులవల్లను పూర్వము చెప్పఁబడిన ఫలములను విచారింపవలయును.

ఎచ్చట నేవిషయమునకు ప్రసక్తికలుగునో అచ్చట నావిషయమునకు ముందుసూత్రముతో సంబంధము చేసికొనవలెను. "భ్రాతృభ్యాం" మొదలగు చెప్పఁబోవు సూత్రములయందు నుపపదమువల్లను ఉపదాధిపతులవల్లను విచారణచేయవలెను. ప్రకృతసంబంధముచే కుక్షిపదమునకు ఉపపదమనియర్థము "కుక్షితదీశౌ" అను వాక్యమునకు సింహరాశియు దానియధిపతియగు సూర్యుఁడు నని స్వామి మొదలగు వారిచే జెప్పఁబడెనుగాని యది సర్వసాధారణముగా నుపయోగింపదు ఈశాస్త్రములో విశేషముగ నక్షరములవల్లనే సంఖ్య గ్రహింపఁబడు చున్నది.

సూ॥ భాతృభ్యాంశనిరాహుభ్యాంభ్రాతృనాశః॥ 3 ౨॥

వ్యా॥ ఉపపదోపదేశాభ్యాం భ్రాతృస్థాభ్యా మేకాదశతృతీయస్థాభ్యాం శనిరాహుభ్యాం భ్రాతృనాశః। ఏకాదశే జ్యేష్ఠస్య తృతీయే కనిష్ఠస్య నాశః కర్మాదిభిర్భ్రాతుర్వ్యయాది జ్యేష్ఠస్యేతి సూత్రదర్శనాత్ నను ఉపపదోపదేశాభ్యా మితి కుతః సమాగత మితిచేచ్ఛృణు గృహక్రమా దితిసూత్రాత్కుక్షితదీశపదాత్ నచసమానపతితపదానామేకాంశానువృత్తి రసంభవా దితి వాచ్యం అన్యపదేభ్యో భ్రాతృవిచారాయోగ్యత్వా దేకాంశానువృత్తే రితిభావః॥

టీ॥ భ్రాతృభ్యాం=ఏకాదశ తృతీయస్థానములయందుగల, శని రాహుభ్యాం = శనిరాహువులచేత, భ్రాతృనాశః = సోదరనాశనము కలుగును.

తా॥ ఉపపదమునకును ఉపపదాధిపతికిని నేకాదశతృతీయస్థానములయందు శని రాహువులున్నయెడల సోదరనాశము కలుగును. "కర్మాదిభిర్భ్రాతుర్వ్యయాదిజ్యేష్ఠస్య" అనెడి సూత్రప్రకారము ఏకాదశస్థానమువలన జ్యేష్ఠునిగుఱించియు తృతీయస్థానమువలన కనిష్ఠుని గుఱించియు జెప్పవలయును. "గృహక్రమాత్" అను సూత్రములో "కుక్షితదీశౌ" అని చెప్పియున్నది కాఁబట్టి యిచ్చటను ఉపపదము నుపపదాధిపతియనియు గ్రహింపవలయును. అయితే సమాసములో

నుండు శబ్దములలో కొన్నింటిని విడిచి కొన్నింటినే తీసికొనవచ్చునా యని చెప్పకూడదు. ఇతర పదములవలన భాతృవిచారణ చేయుట సంబంధము లేదు కాఁబట్టి యందవసరమగు పదములను గ్రహింప వచ్చును కాఁబట్టి యికముందునైనను అవుసరముగలపర్యంతము కుక్షి తద్దీశపదములు గ్రహింపదగియున్నది.

సూ॥ శుక్రేణవ్యవహితేగర్భనాశః॥ 33॥

వ్యా॥ ఏకాదశ తృతీయాన్యతరస్థేన శుక్రేణ యథాక్రమం వ్యవహిత పూర్వపరమాతృగర్భనాశస్స్యాత్॥

టీ॥ శుక్రేణ=శుక్రునిచేత, వ్యవహితే = వ్యవధానముగల, గర్భనాశః=గర్భమునశించును.

తా॥ ఏకాదశతృతీయస్థానములలో నెచ్చటనైనను శుక్రుడున్న యెడల వ్యవహితపూర్వాపర భాతృగర్భములకు నాశనముకలుగును. అనఁగా నేకాదశమందున్నయెడల వ్యవహిత జ్యేష్ఠభాతృగర్భమునకు తృతీయమందున్నయెడల వ్యవహితకనిష్ఠభాతృగర్భమునకు హానికలుగును. అనఁగా గర్భములోనే శిశువునశించును. వ్యవహితమనఁగా తనకు మధ్య నెవరైన నొక సోదరుడుండగా తర్వాత వారినిగుఱించి చెప్పుటయని తెలిసికొనవలయును.

సూ॥ పితృభావశుక్రదృష్టేపి॥ 34॥

వ్యా॥ లగ్నేలగ్నాదష్టమేవా శుక్రదృష్టే సత్యపివ్యవహిత గర్భనాశ ఇత్యర్థః॥

టీ॥ పితృభావశుక్రదృష్టేపి=లగ్నమునుగాని లగ్నమునకష్టమ స్థానమునుగాని శుక్రుఁడు చూచుచున్నను వ్యవహిత గర్భనాశనము కలుగును.

సూ॥ కుజగురుచన్ద్రబుధైర్బహుభాతరః॥ 35॥

వ్యా॥ ఉపపదోపదేశాభ్యాం తృతీయై కాదశస్థైః కుజాదిభి ర్భాతృబాహుల్యంస్యాత్॥

టీ॥ కుజ గురు చంద్రి బుధైః = కుజుఁడు గురువు చంద్రుఁడు బుధుఁడు అను నీగ్రిహములచేత, బహుభ్రాితరః = అనేకసోదరులు కలుగుదురు.

తా॥ ఉపపదమునకు నుపపదాధిపతికి నేకాదశ తృతీయస్థాన ములయందు నంగారకుఁడు బృహస్పతి చంద్రుఁడు బుధుఁడు నున్నయె డల ననేకసోదరులుకలవాడగును.

సూ॥ శన్యారాభ్యాందృష్టే యథాస్వం భ్రాితృనాశః॥ ౩౮॥

వ్యా॥ ఉపపదోపదేశాభ్యాం తృతీయైకాదశయోః శన్యారదృష్టౌసత్యాం యథాస్వం భ్రాితృస్థాన మనతిక్రమ్య తృతీయేదృష్టేకనిష్ఠ స్యైకాదశే దృష్టే జ్యేష్ఠస్యోభయత్రి దృష్టావుభయోశ్చనాశస్స్యాత్॥

టీ॥ శన్యారాభ్యాం=శనిఅంగారకులచేత, దృష్టే=చూడబడుచుండగా, యథాస్వం=దానికితగినట్లుగా, భ్రాితృనాశః = సోదరనాశనము కలుగును.

తా॥ ఉపపదమునకు నుపపదాధిపతికి నేకాదశ తృతీయస్థానములు శనిచేతను నంగారకునిచేతను జూడఁబడినయెడల దృష్టికి తగినట్లు ననఁగా నేకాదశస్థానము చూడఁబడిన జ్యేష్ఠభ్రాతకును తృతీయస్థానము చూడఁబడిన కనిష్ఠభ్రాితకును రెండుస్థానములు చూడబడిన నుభయులకును నాశనముకలుగును.

సూ॥ శనినాస్వమాత్రిశేషశ్చ॥ ౩౭॥

వ్యా॥ ఉపపదోప దేశాభ్యాం తృతీయైకాదశయో శ్శనిదృష్టౌ సత్యాం కేవలం స్వమాత్రిశేషః స్యాదన్యేనశ్యన్తీత్యర్థః॥

టీ॥ శనినా=శనిచేత, స్వమాత్రశేషశ్చ=తానుమాత్రమేమిగిలి యుండువాడగును.

తా॥ ఉపపదమునకు నుపపదాధిపతికి నేకాదశతృతీయస్థానములలో దేనికైనను శనివీక్షణమున్నయెడల సోదరులందఱు నశించి తానొక్కఁడే మిగిలియుండును.

సూ॥ కేతౌభగినీబాహుల్యమ్॥ 3౮॥

వ్యా॥ ఉపపదోపదేశాభ్యాం తృతీయైకాదశయోః కేతౌ సతి భగిన్యోర్యథాస్వం భూయస్యోభవన్తి॥

టీ॥ కేతౌ=కేతువుండగా, భగినీబాహుల్యం = తోబుట్టువులు చాలమందికలుగుదురు.

తా॥ ఉపపద ఉపపదాధిపతులకు నేకాదశతృతీయస్థానములలో కేతువుండగా నాస్థితికితగినట్లు తనకుముందుగాని వెనుకగాని తోబుట్టువులు విశేషముగానుందురు.

సూ॥ లాభేశాద్భాగ్యభెరాహౌదంష్ట్రావాౙ్॥ 3౯॥

వ్యా॥ ఉపపదసప్తమేశా ద్ద్వితీయరాశౌ రాహౌ సతి స్థూల దంష్ట్రావాన్స్యాత్ తదుక్తం పాశ్చ్యైః ॥ శ్లో॥ సప్తమేశాద్ద్వితీయస్థే రాహౌమూకఃఖలేస్థితె । అదన్తోధి కదన్తోవా దంష్ట్రాయుక్తోథవా భవేత్। పవనవ్యాధిమాన్కేతౌ యద్వాస్స్యాదస్ఫుటోక్తిమాౙ్। తత్ర నానాగ్రహైర్యోగో మిశ్రంఫలముదాహృతం ఇతి॥

టీ॥ లాభేశాత్=సప్తమాధిపతినుండి, భాగ్యభే=ద్వితీయస్థానమందు, రాహౌ=రాహువుండగా, దంష్ట్రావాౙ్ = అధికదంతములు కలవాడగును.

తా॥ ఉపపదమునకు సప్తమస్థానాధిపతి యున్న రాశినుండి ద్వితీయస్థానమందు రాహువున్నయెడల విశేషదంతములు కలవాడగును ఇందులకు వృద్ధవాక్యము— శ్లో॥ సప్తమేశాద్ద్వితీయస్థే రాహౌ మూకఃఖలేస్థితే । అదంతోధికదంతోవా దంష్ట్రాయుక్తోథవాభవేత్। పవనవ్యాధిమాౙ్కేతౌ యద్వాస్స్యాదస్ఫుటోక్తిమాౙ్ । తత్రనానా గ్రహైర్యోగె మిశ్రంఫలముదాహృతం ॥ సప్తమరాశ్యధిపతికి ద్వితీయ రాశియందు రాహువున్నను లేక మరియొక క్రూరగ్రహమున్నను మూగవాడుగాని, దంతములు లేనివాడుగాని, విశేష దంతములుకల వాడుగాని, పెద్దకోరలుకలవాడుగాని యగును. మరియు కేతువున్న

యెడల వాతరోగముకలవాడుగాని నంగిమాటలు (నత్తి)కలవాడుగాని యగును. శుభులు పాపులు మిశ్రిమముగ నున్నయెడల మిశ్రిమ ఫలమును చెప్పవలెను.

సూ॥ కేతౌ స్తబ్ధవాక్॥ ౮౦॥

వ్యా॥ ఉపపదసప్తమేశా ద్వితీయె కేతౌసతి స్తబ్ధవాగస్ఫుటోక్తిమాన్స్యాత్॥

టీ॥ కేతౌ=కేతువుండగా, స్తబ్ధవాక్ = స్ఫుటములేని (ముద్ద) మాటలుకలవాడగును.

తా॥ ఉపపద సప్తమరాశ్యధిపతికి ద్వితీయస్థానమందు కేతువుండగా స్ఫుటములేని ముద్దమాటలుకలవాడగును.

సూ॥ మన్దేకురూపః॥ ౮౧॥

వ్యా॥ ఉపపదసప్తమేశా ద్వితీయె శనౌ సతి కురూపో భవతి॥

టీ॥ మందే=శనియుండగ, కురూపః=అందములేనివాడగును.

తా॥ ఉపపదసప్తమరాశ్యధిపతికి ద్వితీయరాశియందు శనియుండగా వికారరూపముకలవాడగును.

సూ॥ స్వాంశవశాద్గౌరనీలపీతాదివర్ణాః॥ ౮౨॥

వ్యా॥ ఆత్మకారకాశ్రితనవాంశస్వభావా జ్జాతకాంతరప్రసిద్ధా జ్జాతకవతోవర్ణాగ్రాహ్యాః ఏవంచ తత్తత్కారకాంశతస్తేషాం వర్ణాజ్ఞేయాఇత్యపిబోధ్యమ్॥

టీ॥ స్వాశవశాత్ = తమయొక్క అంశలవలన, గౌరనీలపీతాది వర్ణాః=ఎఱుపు నలుపు పసుపు మొదలగు వర్ణములుకలుగును.

తా॥ ఆత్మకారకుడాశ్రియించిన నవాంశమువలన తత్తద్గ్రిహవర్ణములననుసరించి జాతకునకు నెరుపు నలుపు పసుపు మొదలగు దేహకాంతులను జెప్పవలయును.

సూ॥ అమాత్యానుచరాద్దేవతాభక్తిః॥ ౮౩॥

వ్యా॥ అమాత్యగ్రహా న్న్యైనోయోగ్రహ స్తస్మా ద్దేవతా భక్తిర్విచారణీయా అమాత్యానుచరో దేవతా కారక స్తస్య పాపత్వే క్రూరదేవతాయాం శుభత్వే సౌమ్యదేవతాయాం ఉచ్చగత్వే స్వర్క్షగతత్వేచ భక్తిదృఢతా నీచగత్వే భక్త్యస్థైర్యమిత్యాదికంజ్ఞేయం॥

టీ॥ అమాత్యానుచరాత్ = అమాత్యగ్రహముకంటె తక్కువైన గ్రహమువలన, దేవతాభక్తిః = దేవతులయందు భక్తి విచారింపవలయును.

తా॥ అమాత్య గ్రహముకంటె తక్కువగు గ్రహమువలన దేవతా భక్తినిగుఱించి విచారణచేయవలయును. అమాత్యానుచర గ్రహము దేవతాకారకమైనది. ఆగ్రహము పాపగ్రహమైనయెడల నీచదేవతులయందు భక్తికలుగును. శుభగ్రహమైనయెడల నుత్తమ దేవతలయందు భక్తికలుగును. ఉచ్చక్షేత్రమందు స్వక్షేత్రమందు నున్నయెడల దృఢమైన భక్తియు నీచశత్రురాసులయందున్నయెడల చంచలమైన భక్తికలవాడగుననియు బహుజ్యోతిష గ్రంథములయందు చెప్పఁబడినది. అమాత్యగ్రహమునుగుఱించి ప్రథమపాదములో వివరింపఁబడినది.

సూ॥ స్వాంశే కేవలంపాపసంబంధేపరజాతః॥ ౭౭॥

వ్యా॥ కారకాంశె శుభగ్రహరహితే కేవలం పాపసంబంధే జారజాతో భవతి సంబంధస్తు దృష్టియోగ షడ్వర్గై ర్జ్ఞేయః॥

టీ॥ స్వాంశే = కారకాంశము, కేవలం = ముఖ్యముగ, పాపసంబంధే = పాపగ్రహసంబంధము కలిగియుండగ, పరజాతః = ఇతరులవలన పుట్టినవాడగును.

తా॥ కారకాంశము శుభగ్రహసంబంధము లేక కేవల పాప గ్రహముయొక్క సంయోగము దృష్టి షడ్వర్గము మొదలగు సంబంధము కలిగియున్న పరపురుషునివలన జనించినవాడగును.

సూ॥ నాత్రిపాపాత్॥ ౭౮॥

వ్యా॥ అత్ర కారక శ్చే త్పాపో భవతి తదాత్విదం ఫలం న స్యాత్ కారకాతిరిక్తా దేవ పాపసంబంధాఫలం వాచ్యం నక్కారకాత్పా పాదిత్యర్థః అథవాఽత్రాష్టమెపాపగ్రహెసతినాయంయోగః

టీ॥ అత్ర=ఈవిషయములో, పాపాత్ = పాపకారకాంశము వలన, న=కాదు.

తా॥ పైన జెప్పఁబడిన ఫలము కారకుఁడు పాపుడైనందువలన కలుగదు. కారకుఁడు కాక తదితరమగు పాపగ్రహసంబంధమువలననే కలుగునని చెప్పవలయును లేక అష్టమస్థానమందు పాపగ్రహమున్నను పైనచెప్పఁబడిన యోగముపట్టదు

సూ॥ శనిరాహుభ్యాంప్రసిద్ధిః॥ ౪౬॥

వ్యా॥ శనిరాహూ యది యోగఘటకౌ శనిరాహూ దృష్టి యోగషడ్వర్గైః పరజాతత్వప్రసిద్ధిర్భవతి॥

టీ॥ శనిరాహుభ్యా=శనిరాహువులచేత, ప్రసిద్ధిః=అందఱకు దెలిసియుండును.

తా॥ శనిరాహువులయొక్క స్థితి దృష్టి షడ్వర్గము మొదలగు నవి యున్నయెడల పరపురుషునివలన పుట్టినవాడని యందరకును ప్రసిద్ధియై యుండును.

సూ॥ గోపనమన్యేభ్యః॥ ౪౭॥

వ్యా॥ అన్యేభ్యః పాపగ్రహేభ్యో యోగే సతి పరజాతత్వగోపనంభవతి॥

టీ॥ అన్యేభ్యః=ఇతరగ్రహములవలన, గోపనం = ప్రసిద్ధికాక యుండును.

తా॥ ఇతర పాపగ్రహములయోగముకలిగియున్నయెడల పర పురుషునివలన పుట్టినవాడని ప్రసిద్ధిగా దెలియఁబడదు.

సూ॥ శుభవర్గేఽపవాదమాత్రమ్॥ ౪౮॥

వ్యా॥ పాపగ్రహేషు యోగఘటకేషు సత్సు కారకాంశే శుభషడ్వర్గసంబంధే సతితుపరజాతత్వాపవాద ఏవభవేన్నతు పరజాతత్వమిత్యర్థః॥

టీ॥ శుభవర్గే = శుభవర్గసంబంధముకలిగియుండగా, అపవాద మాత్రం=అపవాదయేకలిగియుండును.

తా॥ పాపగ్రిహయోగము కలిగియుండినను కారకాంశము నందు శుభషడ్వర్గ సంబంధమున్నయెడల పరపురుషునివలన పుట్టిన వాడుకాదు కాని పరపురుషునివలన పుట్టినవాడని అపవాదముమాత్రి ముకలుగునని చెప్పవలయును.

సూ॥ ద్విగ్రిహేకులముఖ్యః॥ ౪౯॥

వ్యా॥ కారకాంశే ద్విగ్రిహయోగె సతి కులముఖ్యోభవతి॥

టీ॥ ద్విగ్రిహే=రెండుగ్రహములుండగా, కులముఖ్యః=వంశ ములో ప్రసిద్ధినొందును.

తా॥ కారకాంశమునందు రెండుగ్రహములున్నయెడల వంశ ములో ప్రితిష్ఠకలవాడగును.

ఇతి శ్రీ నీలకంఠ జ్యోతిర్విద్విరచితాయాం
జైమినీ సూత్రవ్యాఖ్యాయాం
సుబోధిన్యాం ప్రిథమాధ్యాయస్య
చతుర్థపాదః॥



# అథ ద్వితీయోధ్యాయః.

## ప్రథమః పాదః.

సూ॥ అయుఃపితృదినేశాభ్యామ్॥ ౧॥

వ్యా॥ అథాయుర్దాయోపాయం దర్శయతి లగ్నేశాష్టమేశాభ్యాం మాయుర్విచార్యమిత్యర్థః॥

టీ॥ పితృదినేశాభ్యాం = లగ్నాష్టమాధిపతులచే, ఆయుః = ఆయుర్దాయమువిచారింపదగియున్నది.

తా॥ ఆయుర్దాయమునుగుఱించి చెప్పుచున్నాడు- లగ్నాధిపతి చేతను అష్టమాధిపతిచేతను ఆయుర్దాయమునుగుఱించి విచారింపందగి యున్నది.

సూ॥ ప్రథమయోరుత్తరయోర్వాదీర్ఘం॥ ౨॥

వ్యా॥ లగ్నేశాష్టమేశ స్థితివశతో దీర్ఘాయుర్యోగ మాహ ॥ ప్రథమయోశ్చరయోరుత్తరయో స్థిరద్విస్వభావయోర్వాయది లగ్నేశాష్టమేశౌ భవత స్తర్హి దీర్ఘమాయుర్భవతి అయమర్థః యత్రక్వాపి చరరాశ్యోర్లగ్నేశాష్టమేశయోస్థిత్యా దీర్ఘాయుర్యోగః స్థిరద్విస్వభావయోః లగ్నేశాష్టమేశయోః స్థిత్యావా స్థిరే లగ్నేశె సతిద్వన్ద్వేఽష్టమేశః ద్వన్ద్వే లగ్నేశే సతి స్థిరేఽష్టమేశ ఇతి పర్యాయేణ భవతస్తదాపి దీర్ఘాయుర్యోగస్యాదితి అత్రైకస్మిన్నేవచరాదౌ తదుభయసత్వే ఏకస్యైవ తదుభయస్వామిత్వేవా నయోగహానిః॥

టీ॥ ప్రథమయోః=చరరాసులయొక్క-గాని, ఉత్తరయోర్వా= స్థిరద్విస్వభావరాసులయొక్క-గాని సంబంధమువలన, దీర్ఘం=దీర్ఘాయుర్దాయమును చెప్పవలయును.

తా॥ లగ్నాష్టమాధిపతుల స్థితివశము వలన దీర్ఘాయుర్యోగమును చెప్పుచున్నాడు. చరరాసులయందును స్థిరద్విస్వభావరాసులయందును లగ్నాధిపతియు అష్టమాధిపతియునున్నయెడల దీర్ఘాయువు కలవాడగును. అనఁగా ౧ లగ్నాధిపతియు నష్టమాధిపతియు నుభ

యులు చరరాసులయందుండినను 2 స్థిరరాశియందు లగ్నాధిపతియు ద్విస్వభావరాశియందు నష్టమాధిపతియునుండినను లేక 3 ద్విస్వభావ రాశియందు లగ్నాధిపతియు స్థిరరాశియందు నష్టమాధిపతియు పర్యాయముగానుండినను దీర్ఘాయుర్యోగము. మఱియు లగ్నాధిపాష్టమాధిపతులిరువురు నొక్కచరరాశియందుండినను లేక వేర్వేరుగా స్థిరద్విస్వభావరాసులలో నుండినప్పుడందొక గ్రహమునకు రెండువిధములైన రాసుల యాధిపత్యముకలిగినను దీర్ఘాయుర్యోగమునకు భంగములేదు.

సూ॥ ప్రథమద్వితీయయోరన్త్యయోర్వామధ్యమ్॥ 3॥

వ్యా॥ అథమధ్యాయుర్యోగందర్శయతి ప్రథమ ద్వితీయయోః చరస్థిరయోశ్చరే లగ్నేశః స్థిరేష్టమేశః చరేష్టమేశః స్థిరేలగ్నేశ ఇతి రీత్యాయది భవతః యది ద్విస్వభావయోర్ద్వావసి లగ్నేశాష్టమేశౌ యత్రిక్వాపి భవతస్తర్హి మధ్యాయుర్భవతీత్యర్థః॥

టీ॥ ప్రథమ ద్వితీయయోః = చర స్థిరరాసుల యందున్నను, అంత్యయోర్వా = ద్విస్వభావరాసులయందుండినను, మధ్యం=మధ్యమాయుర్యోగముకలుగును.

తా॥ చరరాశియందు లగ్నాధిపతియు స్థిరరాశియందు నష్టమాధిపతియు లేక చరరాశియందు నష్టమాధిపతియు స్థిరరాశియందు లగ్నాధిపతియునున్నను లేక లగ్నాధిపతియు నష్టమాధిపతియు నిరువురు ద్విస్వభావరాసులలోనున్నను మధ్యమాయుర్యోగముకలుగును.

సూ॥ మధ్యయోరాద్యన్తయోర్వాహీనమ్॥ ౪॥

వ్యా॥ అథాల్పాయుర్యోగమాహ॥ యది మధ్యమయోః స్థిరయోర్యత్రిక్వాపి లగ్నేశాష్టమేశౌస్థః యదివా ఆద్యంతయోశ్చర ద్విస్వభావయోర్లగ్నేశాష్టమేశౌ స్థః తర్హి హీన అల్పాయుర్భవతీత్యర్థః అథ యథా లగ్నేశాష్టమేశయోః రాశిస్థితి భేదేన దీర్ఘమధ్యాల్పాయుషిప్రోక్తాని తథైవ లగ్నచన్ద్రాభ్యామప్యుచ్యన్తే॥

టీ॥ మధ్యయోః = స్థిరరాసులయందుండినను, ఆద్యంతయోర్వా=చరద్విస్వభావరాసులయందుండినను, హీనం = అల్పాయుర్యోగము కలుగును.

తా॥ లగ్నాధిపతియు సప్తమాధిపతియు స్థిరరాసులయందుండిన లేక చరరాశిలో నొకరు ద్విస్వభావ రాశిలో నొకరుండినను అల్పాయుర్యోగము కలుగును. మఱియు లగ్నాష్టమాధిపతులు చరస్థిరద్విస్వభావరాసులయందుండునట్టి భేదముచే దీర్ఘ మధ్య అల్పాయుర్యోగములను నిర్ణయించినవిధముననే లగ్నచంద్ర యోగముబట్టియె చెప్పఁబడుచున్నది.

సూ॥ ఏవంమందచన్ద్రాభ్యామ్॥ ౫॥

వ్యా॥ మన్దచన్ద్రాభ్యాం లగ్నేన్దుభ్యా మేవం పూర్వోక్తప్రకారేణ దీర్ఘమధ్యాయురల్పాయూంషి విచార్యాణీత్యర్థః॥

టీ॥ ఏవం=ఈప్రకారముగ, మందచంద్రాభ్యాం = లగ్నచంద్రులవలన దెలిసికొనవలయును.

తా॥ ఈప్రకారముగ లగ్నమువలనను చంద్రునివలనను దీర్ఘమధ్యాల్పాయుర్యోగములను విచారింపవలయును.

సూ॥ పితృకాలతశ్చ॥ ౬॥

వ్యా॥ జన్మలగ్న హోరాలగ్నాభ్యాంచ పూర్వోక్తప్రకారేణ దీర్ఘమధ్యాల్పాయూంషి సమానేయాని తథాచ త్రివిధద్వన్ద్వేన దీర్ఘమధ్యాయూంషి త్రేధా సమానేయానీతి పర్యవసితోర్థః హోరాలగ్నానయనంతుపూర్వమేవో క్తం ఏతదుక్తంవృద్ధైః। శ్లో॥ లగ్నేశరంధ్రపత్యోశ్చ లగ్నేన్ద్వోర్లగ్న హోరయోః। సూత్రాణ్యేవంప్రయుంజీయాత్సంవాదాదాయుషాంత్రయె। చరేచరస్థిరద్వన్ద్వాః స్థిరేద్వన్ద్వచంస్థిరాః। ద్వన్ద్వేస్థిరోభయచరా దీర్ఘమధ్యాల్పకాయుషః॥ ప్రథమయో రిత్యాది సూత్రత్రయ సంగ్రాహకశ్చర ఇతి ప్రస్తారశ్లోకః ప్రస్తారశ్చ కోద్రష్టవ్యః॥

| | | |
|---|---|---|
| ౧ దీర్ఘ ౧ | ౧ మధ్య ౨ | ౧ అల్ప ౩ |
| ౨ దీర్ఘ ౩ | ౨ మధ్య ౧ | ౨ అల్ప ౨ |
| ౩ దీర్ఘ ౨ | ౩ మధ్య ౩ | ౩ అల్ప ౧ |

టీ॥ పితృకాలతశ్చ = జన్మహోరాలగ్నములవల్లను నిర్ణయింపవలయును.

తా॥ జన్మలగ్న హోరాలగ్నములచేత పూర్వము చెప్పఁబడిన విధముగా దీర్ఘమధ్యాల్పాయుర్దాయములను నిశ్చయింపవలయును. హోరాలగ్నానయనము ప్రథమపాదముననే జెప్పఁబడినది. ఇట్లు త్రివిధములైన ద్వంద్వములచేత దీర్ఘాది త్రివిధాయుర్దాయములను నిశ్చయింపవలయుననుటకు వృద్ధవాక్యప్రమాణము-

ప్రస్తారచక్రము.

| | | |
|---|---|---|
| ౧-ల దీర్ఘ ౧-అ | ౧-ల మధ్య ౨-అ | ౧-ల అల్ప ౩-అ |
| ౨-ల దీర్ఘ ౩-అ | ౨-ల మధ్య ౧-అ | ౨-ల అల్ప ౨-అ |
| ౩-ల దీర్ఘ ౨-అ | ౩-ల మధ్య ౩-అ | ౩-ల అల్ప ౧-అ |

శ్లో॥ లగ్నేశరంధ్రపత్యోశ్చ లగ్నేందోర్లగ్నహోరయోః । సూత్రేష్వేవం ప్రయుంజీయాత్సంవాదాదాయుషాంత్రయే । చరేచరస్థిరద్వంద్వాః స్థిరేద్వంద్వచరస్థిరాః। ద్వంద్వేస్థిరోభయచరా దీర్ఘమధ్యాల్పకాయుషః ॥ యిందు సూత్రాభిప్రాయముగానున్న శ్లోకమునకుఁ బ్రతిపదార్థము వ్రాయఁబడుచున్నది. చరే = లగ్నాధిపతి చరరాశి యందుండగా, చరస్థిరద్వంద్వాః దీర్ఘమధ్యాల్పకాయుషః = అష్టమాధిపతి చరరాశి యందున్నయెడల దీర్ఘాయువు, స్థిరరాశి యందున్నయెడల మధ్యాయువు, ద్విస్వభావరాశియందున్నయెడల నల్పాయువు, స్థిరేద్వంద్వచరస్థిరాః దీర్ఘమధ్యాల్పకాయుషః = స్థిర రాశియందు లగ్నాధిపతియుండగా నష్టమాధిపతి ద్విస్వభావరాశియందున్నయెడల దీర్ఘాయువు, చరరాశియందున్నయెడల మధ్యాయువు, స్థిరరాశియందున్నయెడల నల్పాయువు, ద్వంద్వేస్థిరోభయచరాః దీర్ఘమధ్యాల్పకాయుషః = ద్విస్వభావరాశియందు లగ్నాధిపతి యుండగా నష్టమాధిపతి స్థిరరాశియందున్నయెడల దీర్ఘాయువు, ద్విస్వభావ రాశియందున్నయెడల మధ్యాయువు, చరరాశియందున్నయెడలనల్పాయువు, ఇట్లుదీర్ఘమధ్యాల్పాయుర్యోగముల నిర్ణయింపవలయును. ఈ విధమున లగ్నాధిపాష్టమాధిపతులవల్లను, లగ్నచంద్రులవల్లను, జన్మలగ్నహోరాలగ్నములవల్లను, ఏకాభిప్రాయముగసూత్రములననుసరించి త్రివిధాయుర్దాయములను నిశ్చయింపవలయును. ఇందును

గుఱించి ప్రస్తారచక్రము లిఖింపబడినది- ఈచక్రమునందు పైమూడు గళ్లు చరరాసులుగాను మధ్య మూడుగళ్లు స్థిరరాసులుగాను చివర మూడుగళ్లు ద్విస్వభావరాసులుగాను తెలిసికొనవలయును, అందం కెలు ౧ అనఁగా చరరాశియనియు ౨ అనగా స్థిరరాశియనియు 3 అనఁగా ద్విస్వభావరాశియనియు తెలిసికొనవలయును. అంకెలకు సూటిగా వ్రాయఁబడిన అక్షరము ల-అనఁగా లగ్నాధిపతియనియు అ-అనఁగా అష్టమాధిపతియనియు తెలిసికొనవలయును. "చరేచరస్థిర ద్వంద్వాః" అను శ్లోకానుసారముగ పై మూడు చరరాసులలోను క్రమముగ చరస్థిర ద్విస్వభావములను మధ్యమూడు స్థిరరాసులలోను క్రమముగ ద్విస్వభావ చరస్థిరరాసులను చివర మూడు ద్విస్వభావ రాసులలోను క్రమముగ స్థిరద్విస్వభావచరరాసులను చెప్పినట్లుగ ప్రతిగదిలోను దిగువ వ్రాయఁబడిన అంకెలవలన దెలిసికొనవలయును. ఈచక్రములో గదులను ప్రతివరుసలోను యెడమనుండి కుడివ్రక్కకు చూచుకొనవలెను.

సూ॥ సంవాదాత్ప్రామాణ్యమ్॥ ౭॥

వ్యా॥ అథ త్రివిధేష్వాయుర్దాయనిర్ణయోపాయేషు త్రయాణా మేకాకారాయుఃప్రదత్వే నిర్వివాద మేవ ద్వయో రేకాకారాయుఃప్రదత్వే పరస్య భిన్నాయుఃప్రదత్వే నిర్ణయమాహ॥ ప్రకారద్వయేన తా దృశమాయురాయాతి తదేవగ్రాహ్యం న త్వేకేనాగతమితి॥

టీ॥ సంవాదాత్ = ఏకాభిప్రాయమువలన, ప్రామాణ్యం= ప్రమాణముగా గ్రహింపఁదగియున్నది.

తా॥ లగ్నాష్టమాధిపతులవల్లను లగ్నచంద్రులవల్లను, జన్మలగ్న హోరాలగ్నములవల్లను మూడు విధముల నాయుర్దాయ మును నిర్ణయింపవలయునని జెప్పబడినవి. ఈమూడు మార్గములవల్లను నిర్ణయమైన ఆయుర్దాయమొకేవిధముగానుండినవివాదమేమియు లేదు. మఱియు మూడుమార్గములలోనే రెండుమార్గములవలనైన నిర్ణయింప బడిన యోగమొక్కటియై మూడవమార్గమువలన నిర్ణయింపఁబడినది

వేరుగానుండినయెడల రెండుమార్గముల నొకటిగానున్న యోగమునే గ్రహింపవలెను.

సూ॥ విసంవాదేపితృకాలతః॥ ౮॥

వ్యా॥ అథత్రియాణాం పక్షాణాంవై రూప్యేగ్రాహ్యపక్షమాహ॥ త్రియాణామపి పక్షాణాం విసంవాదే వైరూప్యే సతి జన్మలగ్న హోరాలగ్నాభ్యామాగతమాయుర్గ్రాహ్యమిత్యర్థః॥

టీ॥ విసంవాదే = భేదముకలుగుచుండగ. పితృకాలతః=జన్మలగ్న హోరాలగ్నములవల్లను నిర్ణయమైనదానినిగ్రహింపవలయును.

తా॥ మూడుపక్షములవల్లను నిర్ణయింపఁబడిన యాయుర్దాయము మూడువిధములుగా నుండినయెడల జన్మలగ్నహోరాలగ్నముల వల్ల నిర్ణయింపబడిన యాయుర్దాయమునే గ్రహింపవలెను.

సూ॥ పితృలాభగేచందే్రచంద్రమన్దాభ్యామ్॥ ౯॥

వ్యా॥ సర్వత్రైవ విసంవాదే లగ్నహోరాభ్యామేవాయుఃప్రాప్తావపవాదమాహ॥ లగ్నేసప్తమేవా చంద్రేస్థితేసతి చంద్రలగ్నాభ్యామాగత మాయుర్గ్రాహ్యమిత్యర్థః అల్పాయుష్యాదికం వృద్ధైరుక్తం॥ శ్లో॥ ద్వాత్రింశాత్పూర్వమల్పాయుః మధ్యమాయుస్తతోభవేత్।చతుష్షష్ట్యాపురస్తాత్తు తతోదీర్ఘముదాహృతం ॥ ఇతి ద్వాత్రింశచ్చతుష్షష్టిషణ్ణవతి రూపేష్వాగతేష్వాయుర్దాయేషు స్పష్టీకరణం వృద్ధైరుక్తం॥ శ్లో॥ పూర్ణమాదావహానిరన్తే ఽనుపాతోమధ్యతోభవేత్ । రాశిద్వయస్యయోగార్థం వర్షాణాంస్పష్టముచ్యతే ॥ ఏవం ద్విశానాం సంచింత్య త్రియాణాం సూత్రవర్త్మనా ఇతి అయమర్థః ప్రథమయోరిత్యాది సూత్రజాలే నాయుర్యన్నిర్ణీతం తత్ర దీర్ఘాయుషి సమాగతే మధ్యమాయురవధిపర్యంతం నిర్విశకం సిద్ధమేవ తదుపరి తనే దీర్ఘాయుః ఖండే ద్వాత్రింశదబ్దరూపేకియద్గ్రాహ్య మితి సంశయనిరాకరణాయాయం శ్లోకః పితృదినేశౌద్వావపి యద్రాశౌ భవతస్తద్రాశే రారంభే కౌచేత్త్రర్హితతోచితః ఖండః పూర్ణ ఏవ తద్రాశ్యంతే యదితౌభవతస్తర్హితత్ఖండస్య వినాశ ఏవ మధ్యేత్వనుపాతేన ఖేటైకదేశోగ్రాహ్యః

అనుపాతస్త్వత్థం త్రింశదంశైశ్చే ద్ద్వాత్రింశద్వర్షాణి తర్హ్యానేనాంశేన కిమితి ౩౨×౩౦ ఇం భం ప్రాప్తమాయుః తత్ర లగ్నేశాష్టమేశయోః పృథక్స్పష్టం ఏవం విధరాశీన్దూరీకృత్యాంశాదే రేకఖండస్యత్రైరాశికేన యదాయాతి లగ్నేశ స్యాష్టమేశస్య చ తయో రాగతయో ర్వర్షాది పిండయోర్యోగం విధాయ తద్యోగార్థం స్పష్టం భవతి తచ్చ యది దీర్ఘాయుస్సంబన్ధి తర్హి చతుష్షష్టిమధ్యే యోజ్యం యదిమధ్యాయుస్సమ్బన్ధి తదాద్వాత్రింశన్మధ్యే యోజ్యం యద్యల్పాయుస్సమ్బన్ధి తథా ప్రథమఖండాభావాత్స్వయమేవ జన్మప్రభృతివర్తమానమాయుర్భవతి ఏవం మందచంద్రయోః పితృకాలయో రపి సమాగతాయుష్యాంతిమఖండస్పష్టీకరణం విజ్ఞేయం అన్యేతు ॥ శ్లో॥ హోరాలగ్నాదిమాంశేతు పూర్ణమంతేనకించన। స్పష్టీకరణమేతత్స్యా ద్దీర్ఘమధ్యాల్పకాయుషి॥ అనుపాతస్తు పూర్వవత్ అనేన హోరాలగ్నస్యాపి సావయవత్వం ప్రదర్శితం॥

టీ॥ చంద్రే=చంద్రుడు, పితృలాభగే=లగ్నమందుగాని సప్తమమందుగాని యుండగా, చంద్రమందాభ్యాం = లగ్నచంద్రులవల్ల నిర్ణయింపఁబడినయోగమును గ్రహింపవలయును.

తా॥ విసంవాదమున గ్రహింపఁదగిన జన్మలగ్న హోరాలగ్నములగుఱించి జెప్పుచున్నాడు. చంద్రుఁడు లగ్నమునందుగాని సప్తమమందుగాని యున్నయెడల లగ్నమువల్లను చంద్రునివల్లను నిర్ణయింపబడిన ఆయుర్దాయమునే గ్రహింపవలయును. ఆయుర్యోగకాలములో నంత ద్విభాగముగూర్చి వృద్ధకారిక - శ్లో॥ ద్వాత్రింశత్పూర్వమల్పాయుర్మధ్యమాయు స్తతో భవేత్। చతుష్షష్ట్యాః పురస్తాత్తు తతో దీర్ఘముదాహృతం॥ ముప్పదిరెండు సంవత్సరములకులోపుగ నల్పాయువనియు అంతకుపైన ౬౪ సంవత్సరములకు లోపుగ మధ్యాయువనియు ౬౪ సంవత్సరములకుపైన ౯౬ సం॥వరకును పూర్ణాయువనియు నాయువు 3 ఖండములుగ విభజింపఁబడెను. ఇందునుస్పష్టీకరణవిధానము- శ్లో॥ పూర్ణమాదౌహానిరంతే ఽనుపాతో మధ్యతో భవేత్। రాశిద్వయస్యయోగార్థం వర్షాణాంస్పష్టముచ్యతే। ఏవంద్వికానాం

సంచిత్య త్రియాణాంసూత్రవర్త్మనా ॥ "ప్రథమమోర్ద్వా" అను సూత్రమువలన నాయుర్దాయమును విచారింపగా దీర్ఘాయువు వచ్చినయెడల ౭౨ సంవత్సరములపర్యంతము సందేహము లేదు అటు పిమ్మట ౩౬ సంవత్సరముల పరిమితిగల ఖండములో నెంతవరకు జీవించుననెడి విషయములో జెప్పుచున్నాడు. లగ్నాధిపాష్టమాధిపతు లిరువురు నేరాశియందుండిరో ఆరాసులయందారంభమందు వారుండి రేని ఆఖండము ఆఖరువరకు జీవించును. ఆరాసులయొక్క అంత్యమందుండి రేని మూడవఖండములో జీవింపడు మధ్యలోనుండి రేనియను పాతమున నిర్ణయింపవలెను. ఎట్లనగా రాశికి ౩౦ అంశలు కాబట్టి ౩౬ సంవత్సరములను త్రైరాశికముచే విభజింపగా అంశలననుసరించి వచ్చు సంవత్సరములను దీర్ఘాయుర్యోగమునందు ౭౨ లో కలుపవలయును. మధ్యాయుర్యోగమునందు ౩౬ లో కలుపవలయును. అల్పాయుర్యోగమునందు జన్మసంవత్సరము మొదలని గ్రహింపవలయును- ఇట్లు లగ్నాధిపాష్టమాధిపతుల నిద్దఱనుగురించి వారి వారి రాశ్యంశలకు వచ్చిన సంవత్సరమునను గలిసి సగముచేసి అప్పుడు విచారింపబడు ఖండములలో గలుపవలయును. ఈ ప్రకారము లగ్న చంద్రులయొక్కయుజన్మలగ్న హోరాలగ్నములయొక్కయు ఆయుర్దాయముల చివరఖండములను తెలిసికొనవలయును. ఇచ్చట గొందరిట్లు చెప్పుచున్నారు. శ్లో॥ హోరాలగ్నాదిమాంశేతు పూర్ణమంశేనకించన। స్పష్టీకరణమేతత్స్యా ద్దీర్ఘమధ్యాల్పకాయుషి॥ హోరాలగ్నముయొక్క మొదటియంశలోనుండిన పూర్ణాయువనియు చివర అంశములో నుండిన నాయుర్యోగము లేదనియు చెప్పిరి. దీనివిషయము దీర్ఘ మధ్యాల్పాయుర్దాయములనుగురించి చెప్పునప్పుడు వివరింపబడును. ఖండములో మధ్యవచ్చినప్పుడు వెనుక చెప్పినప్రకారముగా నంశలవలన ననుపాతమున గ్రహింపవలయును. దీనివలన హోరాలగ్నమునకును సావయవత్వము స్పష్టమగుచున్నది. అనగా హోరా లగ్నమును రాశ్యంశకలలలో సాధింపవలసియున్నది.

సూ॥ శనౌయోగహేతౌకక్ష్యాహ్రాసః॥ ౧౦॥

వ్యా॥ అథ దీర్ఘమధ్యాల్పాయుర్యోగేషు కంచనా విశేషం దర్శయతి యద్యత్రి శనిర్యోగకర్తాస్యాత్తదాకక్ష్యాహ్రాసోభవతి దీర్ఘం చేన్మధ్యం, మధ్యంచేదల్ప మల్పంచేన్నకించనతిఇతి।

టీ। శనౌ=శని, యోగహేతౌ = యోగకారకుఁడగుచుండగ, కక్ష్యాహ్రాసః=ఆయుర్దాయయోగముతగ్గును.

తా॥ ఆయుర్దాయవిషయములో కొంచెము విశేషము జెప్పుచున్నాఁడు- శని యోగకారకుఁడగుచుండగ ఆయుర్దాయములో తగ్గుననిరి. దీర్ఘాయుర్యోగము కలిగినప్పుడు మధ్యాయువుగాను, మధ్యాయుర్యోగము కలిగిన నల్పాయువుగాను, నల్పాయుర్యోగముపట్టినప్పుడేమియు లేనట్లుగాను సిద్ధించుననిరి.

సూ॥ విపరీతమిత్యన్యే॥ ౧౧॥

వ్యా॥ మతాంతర మాహ॥ శనౌ యోగకర్తరి విపరీతహ్రాసో భవతి కింతు యథాస్థిత ఏవేత్యన్యే ఆచార్యావదన్తి॥

టీ॥ అన్యే=ఇతరులు, విపరీతం=దీనినవిపరీతమనిరి.

తా॥ శని యోగకారకుఁడైనప్పుడు విపరీతహ్రాసము కలుగును. అనఁగా యథాప్రకారముగానే యుండునని యితరులమతము,

సూ॥ సూత్రాభ్యాంనస్వర్క్షతుంగగేసౌరౌ॥ ౧౨॥

సూ॥ కేవలపాపదృగ్యోగినిచ॥ ౧౩॥

వ్యా॥ పరపక్షం నిర్దిశ్య స్వపక్షమాహ ॥ స్వరాశి స్వోచ్చగే శనౌ తథా శుభదృగ్యోగరహిత కేవలపాపదృష్టియోగవిశిష్టే శనౌచ నకక్ష్యాహ్రాసః అన్యథాతుహ్రాసోభవత్యేవ॥

టీ। శనౌ=శని, స్వర్క్షతుంగగే = స్వక్షేత్రఉచ్చస్థానముల యందునుండగ, కేవలపాపదృగ్యోగినిచ = కేవలపాపదృష్టికలవాఁడైనను, సూత్రాభ్యాం = రెండుసూత్రములచేఁ జెప్పఁబడినప్రకారము, న=కాదు.

తా॥ స్వపక్షమును జెప్పుచున్నాఁడు- శని స్వక్షేత్రమందును ఉచ్చస్థానమందు నున్నయెడల శుభగ్రహదృష్టిలేక కేవల పాపగ్రహ దృష్టికలవాఁడైనను పైనచెప్పఁబడిన రెండుసూత్రములప్రకారమాయు

దార్ఘాయము తగ్గిపోవుట తటస్థింపదని నీలకంఠీయాభిప్రాయము కాని వృద్ధపారాశర్యమతానుసారము ౧౦, ౧౧, ౧౨, ౧౩ సూత్రముల నిందువివరించుచున్నాను.

సూ॥ శనౌయోగహేతౌకక్ష్యాహ్రసః॥ ౧౦॥
విపరీతమిత్యన్యే॥ ౧౧॥
సూత్రాభ్యాంనస్వర్క్షతుంగగేసౌరే॥ ౧౨॥
కేవలపాపదృగ్యోగినిచ॥ ౧౩॥

టీ॥ శనౌ=శని, యోగహేతౌ= సంబంధయోగముకలవాడగుచుండగా, కక్ష్యాహ్రాసః=ఆయుర్యోగకక్ష్యతగ్గుటసంభవించును॥ ౧౦॥ విపరీతమితి=దీనికివిపరీతముగా కక్ష్యావృద్ధి కలుగునని, అన్యే=కొందఱనుచున్నారు॥ ౧౧॥ సూత్రాభ్యాం = పైన ౧౦, ౧౧ సూత్రముల ప్రకారము, సౌరే=శని, స్వర్క్షతుంగగే=స్వక్షేత్రోచ్చములందుండగా న=కక్ష్యాహ్రసము కలుగదు॥ ౧౨॥ కేవలపాపదృగ్యోగినిచ=శని కేవలము పాపగ్రహదృష్టియోగములుకలవాడయియుండగా, న=కక్ష్యావృద్ధియును కలుగదు॥ ౧౩॥

తా॥ "శనౌయోగహేతౌ" అను పదములకు "శని లగ్నాధిప హోరాలగ్నాధిపతులతో గలిసియున్నయెడల" నని యర్థము గ్రహింపఁదగియున్నది. అట్లులగ్నాధిపతితోగాని హోరాధిపతితోగాని సంబంధయోగము కలిగియున్నపుడు శని యొకప్పుడు కక్ష్యాహ్రాసమును నొకప్పుడు కక్ష్యావృద్ధినిజేయును. ఇట్లు ౧౦, ౧౧ సూత్రముల రెంటికిని నపవాదములఁదెల్పుచు ౧౨, ౧౩ సూత్రములందు కక్ష్యాహ్రస వృద్ధుల వివరించుచున్నారు. శని లగ్నాధిప హోరాధిపతులతోగలిసినప్పుడు స్వర్క్షతుంగాది గుణములుకలవాడైనయెడల కక్ష్యాహ్రాసము కలుగదు కాని శత్రునీచాదిదోషములు కలిగినపుడే కక్ష్యాహ్రసము కలుగును. ఇట్లే శని కేవలపాపదృగ్యోగముకలిగినయెడల కక్ష్యావృద్ధిని జేయఁడు. స్వర్క్షతుంగాదిగుణములుకలవాడై యుండి పాపదృగ్యోగాదికము లేక శుభదృగ్యోగాదికము కలిగినయెడల కక్ష్యావృద్ధినిజేయునని తాత్పర్యము. ఇట్లు ౧౦, ౧౧ సూత్రములకపవాదము దెలుపు ౧౨,

౧౩ సూత్రములే ౧౦, ౧౧ సూత్రములందు కష్ట్యాహ్రాసవృద్ధు లెప్పుడు కలుగునదియు వివరించుచున్నవి. కష్ట్యాహ్రాసవృద్ధుల వివరముఁదెల్పు వృద్ధపారాశర్యవాక్యములు.

శ్లో॥ అథునానంప్రవక్ష్యామి ఆయుస్సాధనహేతవే। కష్ట్యాహ్రాసంతథావృద్ధిం శనియోగేనవైద్విజ ॥ ౧ ॥ లగ్నాధీశశ్శనియుతో హోరాధీశోయథాద్విజ । కష్ట్యాహ్రాసోభవేత్తత్ర యత్రసౌరిశ్శనిర్బలః॥ ౨॥ తతఃఫలవిశేషార్థం గుణదోషావదామ్యహం గుణైఃప్రపూరితస్సౌరిః కష్ట్యావృద్ధింకరోతిచ॥ ౩ ॥ దోషయుక్తోభవేద్ధాని స్తాభ్యాం నిర్ణయఉచ్యతే। స్వర్క్షతుంగాది గుణిభిర్యుక్తో మార్తాండవంశజః॥ ౪॥ కష్ట్యావృద్ధికరోవిప్ర విభాగేనాయుర్వృద్ధికృత్ । ఏవంనీచారిగస్సౌరిః పాపదృష్టిసమన్వితః ॥ ౫ ॥ కష్ట్యాహ్రాసకరోవిప్ర విభాగేనాయుర్హాని కృత్ । లగ్నేశేవాపిహోరేశే కేవలేశనిసంయుతే॥ ౬ ॥ పాపక్షేత్రేపాపయుక్తేవా పాపదృష్టిసమన్వితే। కష్ట్యాహ్రాసంకుర్వీత వినానీచారిగే ద్విజ॥౭॥ ఏవంతుంగాదిరహితః కష్ట్యావృద్ధింనకారయేత్। శుభక్షేత్రేశుభసంయుక్తే శుభదృష్టేచతుంగగే॥ ౮ ॥ పాపయోగేనరహితే కష్ట్యావృద్ధికరశ్శనిః। ఏవంనీచాదిదోషేణ కష్ట్యాహ్రాసఃప్రజాయతే॥ ౯॥

తా॥ శనియొక్క యోగసంబంధముచేత కష్ట్యాహ్రాసము, కష్ట్యావృద్ధి చెప్పఁబడుచున్నవి. లగ్నాధిపతిగాని హోరాలగ్నాధిపతిగాని బలహీనుఁడగు శనితోఁగూడియున్నయెడల కష్ట్యాహ్రాసముకలుగును. అట్లుగాక లగ్నాధిపతిగాని హోరాలగ్నాధిపతిగాని గుణయుతుండగు శనితోఁగూడియున్నయెడల కష్ట్యావృద్ధిచేయును. ఇచ్చట విపులముగా శనియొక్క గుణదోషములు వివరింపఁబడుచున్నవి. స్వక్షేత్రఉచ్చాదులఁగూడినపుడే శని కష్ట్యావృద్ధిజేయును. ఇట్లే నీచశత్రుక్షేత్రాది దోషములఁగూడి పాపదృష్టి సంబంధములు కలిగినపుడే కష్ట్యాహ్రాసముఁజేయునుగాని నీచశత్రుక్షేత్రాదిస్థితిలేక కేవల పాపగ్రహదృగ్యోగాది సంబంధము కలిగినంతమాత్రమున నే కష్ట్యాహ్రాసముఁజేయదు ఇట్లే పాపగ్రహసంబంధములేక కేవల శుభగ్రహదృగ్యోగాది సంబంధముకలిగి తుంగస్వక్షాదిస్థితియందున్నపుడే శనికష్ట్యా

వృద్ధిఁజేయునుగాని పాపగ్రహదృగ్యోగము కలిగినయెడల స్వక్షతుంగా దులందుండినను కక్ష్యావృద్ధిఁజేయజాలదు ఇదియే ౧౨, ౧౩ సూత్రముల యభిప్రాయమునైయున్నది. కక్ష్యాహ్రాసమనగా దీర్ఘాయువు మధ్యాయువుగను, మధ్యాయువు స్వల్పాయువుగను, నల్పాయువు బాల్యమరణముకలుగునత్యల్పాయువుగనగును. కక్ష్యావృద్ధియనఁగా నత్యల్పాయువల్పాయువుగను, నల్పాయువుమధ్యాయువుగను, మధ్యాయువు పూర్ణాయువుగను, పూర్ణాయువు నూరుకంటెనధికమగు నుత్తమాయువుగనునగును.

సూ॥ పితృలాభగేగురౌ కేవలశుభదృగ్యోగినిచకక్ష్యావృద్ధిః॥౧౪॥

వ్యా॥ అత్రిన్యాచార్యమతమేవానుభవసిద్ధమితి సర్వమతసిద్ధాంతకక్ష్యావృద్ధిం యోగాన్తరేణోపదిశతి లగ్నసప్తమయోర్గురౌ సతి తథాపాపదృష్టి పాపయోగరహిత శుభదృష్టి శుభయోగసహితే గురౌచ కక్ష్యా వృద్ధిరిత్యర్థః తథాచానాయుషోల్పాయుర్వృద్ధిః అల్పాయుషో మధ్యాయుర్వృద్ధిః మధ్యాయుషోదీర్ఘాయుర్వృద్ధిః దీర్ఘాయుషః షణ్ణవత్యూర్ధ్వమాయుర్భవతీత్యర్థః॥

టీ॥ గురౌ=బృహస్పతి, పితృలాభగే = లగ్నసప్తమస్థానముల యందుండగ, కేవలశుభదృగ్యోగినిచ=కేవలము శుభగ్రహదృష్ట్యాది యోగములుకలవాడగుచుండగాను, కక్ష్యావృద్ధిః=ఆయుర్దాయము నందు వృద్ధికలుగును.

తా॥ ఇట్లు తనమతమును చెప్పినప్పటికిని యితరయోగములచే అన్యపండితులచే చెప్పబడిన వృద్ధినే సిద్ధాంతముగ చెప్పుచున్నాడు. బృహస్పతిలగ్నమందుగాని సప్తమమందుగానియుండి పాపగ్రహసంబంధము దృష్టిలేనివాడై కేవలము శుభగ్రహసంబంధము శుభగ్రహ దృష్టికలవాడగునేని ఆయుర్వృద్ధికలుగును. అనఁగాఆయువులేనివానికి నల్పాయువును, అల్పాయువుకలవానికి మధ్యాయువును, మధ్యాయువు కలవానికి దీర్ఘాయువును, దీర్ఘాయువుకలవానికి ౯౬ సంవత్సరములకుపైగా పూర్ణాయువును కలుగును. ఇందులకు వృద్ధకారిక—

శ్లో॥ లగ్నేవాన ష్టమేవాపి తుంగాదిగుణసంయుతే। శుభక్షేత్రేశుభదృగ్యుక్తే కష్ట్యావృద్ధికరోగురుః॥

సూ॥ మలినే ద్వారబాహ్యేనవాంశే నిధనం ద్వారద్వారేశయోశ్చమాలిన్యే॥ ౧౫॥

వ్యా॥ ఆయుషి ప్రమాణసిద్ధే పూర్ణమరణ మన్తరా మరణం భవతీత్యాకాంక్షాయామాహ॥ ద్వారం బాహ్యంచేతి సమాహారద్వంద్వః దశాశ్రయో ద్వారం తతస్తావతిథం బాహ్య మిత్యగ్రే వక్ష్యతి తస్మిన్పాకభోగాపరపర్యాయె ద్వారబాహ్యే మలినే స్వయం పాపి పాపయుక్తే పాపదృష్టేచ సతి ద్వారబాహ్యయో ర్నవాంశేనవాంశ దశాయాం నిధనంభవతి అత్రనవాంశపదేన ప్రతిరాశి నవాంశమితా నవాభాగాగ్రాహ్యాః విషమె తదాది ర్నవాంశ ఇత్యాదినా వక్ష్యమాణా నవాంశదశేతి జన్మకాలే ఆద్యదశాశ్రయరాశే ర్యావత్సంఖ్యాకోధర రాశిస్తస్మాత్తావత్సంఖ్యాకో రాశిర్బాహ్యముచ్యతే ద్వారబాహ్యయో ర్ద్వయోరపి మలినత్వ ఏవ నిధనం నత్వన్యతరస్య ఏవం ద్వార రాశే ర్ద్వారేశస్యచ మాలిన్యే సతి ద్వార తదీశాశ్రయరాశి నవాంశదశాయాం నిధనం భవతీత్యర్థః॥

టీ॥ ద్వారబాహ్యే=ద్వారబాహ్యరాసులు, మలినే = మలినమైనవియగుచుండగ, నవాంశే=నవాంశయందు, నిధనం = మరణము కలుగును, ద్వారద్వారేశయోశ్చ=ద్వారద్వారాధిపతులును, మాలిన్యే=మలినత్వము కలిగియుండగాను మరణము కలుగును.

తా॥ ప్రమాణమువలన ఆయుర్దాయమునకు పూర్ణత్వము సంభవించినను ఒకానొకప్పుడు మధ్యలోనే మృతినొందుటసంభవించుచున్నది. అదియెందువల్లననఁగా దశాప్రారంభరాశి ద్వారరాశియని చెప్పఁబడును. మేషాదిలెక్కింపగా ద్వారరాశిపర్యంతము ఎంతసంఖ్య వచ్చునో ఆసంఖ్యాప్రకారము ద్వారరాశి మొదలుకొని లెక్కపెట్టగా నేరాశియగునో యది ద్వారరాశికి బాహ్యరాశియగును. మఱియు ద్వారరాశిని పాకమనియు బాహ్యరాశిని భోగమనియు నామాంతరములుకలవు. ఇట్లు చెప్పఁబడిన ద్వారబాహ్యరాసులు స్వతస్సిద్ధముగ

పాపస్వభావముకలవైనను పాపగ్రహములతోఁగూడినను పాపగ్రహ దృష్టికలిగినను దుష్టత్వముసంభవించునుకాఁబట్టి ద్వారబాహ్యరాసుల యొక్క నవాంశదశలందు మరణము కలుగును. బాహ్యరాశిని నిర్ణయించువిషయమై చరస్థిరద్వంద రాసుల భేదముననుసరించియు ఓజ యుగ్మలముననుసరించి జెప్పఁబడెను ఆ విషయమితరగ్రంథములవలన దెలిసికొనదగియున్నది. "విషమేశదాదిర్నవాంశః" అను ముందు జెప్పబోవు సూత్రానుసారముగ నిచ్చటచెప్పఁబడిన నవాంశపదముచే ప్రతిరాశిలోను నవాంశప్రమాణముగల ౯ సంవత్సరములను గ్రహింపవలయును. ద్వారరాశికిని ద్వారరాశ్యధిపతికిని దుష్టత్వము సంభవించినప్పుడే ద్వారద్వారాధిపతులనవాంశదశలందు మరణము సంభవించును గాని రెండింటిలోనొకదానికి దుష్టత్వము సంభవించినయెడల మరణము కలుగదని యభిప్రాయము.

సూ॥ శుభదృగ్యోగాన్న॥ ౧౬॥

వ్యా॥ నిధనయోగాపవాద మాహ॥ ద్వారబాహ్యద్వారేశానాం శుభదృష్టి శుభయోగ సత్వే ద్వారబాహ్య ద్వారేశాశ్రియ నవాంశదశాయాం నిధనంనేత్యర్థః॥

టీ॥ శుభదృగ్యోగాత్ =శుభగ్రహదృష్టివలన, నస్యాత్ =మరణముకలుగదు.

తా॥ ద్వారరాశికిని బాహ్యరాశికిని ద్వారాధిపతికిని శుభగ్రహసంబంధముగాని శుభగ్రహదృష్టిగాని సంభవించినయెడల ద్వారబాహ్యద్వారేశుల నవాంశదశలంపు మరణముసంభవింపదనిభావము

సూ॥ రోగేశేతుంగేనవాంశవృద్ధిః॥ ౧౭॥

వ్యా॥ అథ శుభదృగ్యోగాభావేపి నవాంశకాల నిధనాపవాద మాహ॥ జన్మలగ్నాదష్టమేశే ఉచ్చగతే సత్యుక్తనిధనయోగే సత్యపి దశాయాంమరణముక్తం తదుత్తరం నవాంశవృద్ధిఃనవాబ్దవృద్ధిరిత్యర్థః॥

టీ॥ రోగేశే = అష్టమాధిపతి, తుంగే = ఉచ్చయందుండగ, నవాంశవృద్ధిః=నవాంశవృద్ధియగును.

తా॥ శుభగ్రహదృష్ట్యాదులు లేకపోయినప్పటికిని నవాంశ కాలమరణమునకపవాదము చెప్పుచున్నాఁడు— జన్మలగ్నమునకష్టమ స్థానాధిపతి యుచ్చస్థానమందుండఁగ పూర్వము చెప్పఁబడిన మరణ యోగము తటస్థించినను ఆదశలో మరణము సంభవించునుగాని నవాంశవృద్ధిచే ననంతరము ౯ సంవత్సరములు జరిగినపిమ్మట కలుగును.

సూ॥ తత్రాపిపదేశదశాంతే పదనవాంశదశాయాం పితృదినేశ త్రికోణేవా॥ ౧౮॥

వ్యా॥ నను రాశివృద్ధౌ సత్యాం కుత్ర రాశౌ నిధనమితి శం కాయామాహ॥ తత్రాపి వృద్ధిపక్షేపిపదస్య లగ్నారూఢస్య ఈశః స్వామీ తదాశ్రయీ భూతరాశేర్దశాయా మన్తే నిధనం స్యాత్ అథవా జన్మలగ్నారూఢనవాంశదశాయాం నిధనంస్యాత్ కింవాలగ్నేశాష్టమే శాభ్యాం త్రికోణే లగ్నపంచమనవమాన్యతమరాశి దశాయా మన్తర్ద శాయాంవానిధనం భవతీత్యర్థః॥

టీ॥ తత్రాపి=ఆవృద్ధిపక్షమందును, పదేశదశాంతే=లగ్నారూ ఢాధిపతియొక్క దశాంతమందుగాని, పదనవాంశదశాయాం = లగ్నా రూఢనవాంశదశయందుగాని లగ్నాధిపాష్టమాధిపతులకు త్రికోణముల దశలయందుగాని మరణముకలుగును.

తా॥ రాశివృద్ధి కలిగినప్పటికిని ఏరాశియందు మరణము కలు గునో చెప్పుచున్నాఁడు. వృద్ధికలిగినను లగ్నారూఢాధిపతి యేరాశి యందుండునో ఆరాశియొక్క దశయందుగాని జన్మలగ్నారూఢనవాంశ దశయందుగాని లేక లగ్నాధిపాష్టమాధిపతులకుఁ త్రికోణస్థానములగు లగ్నపంచమనవమరాసులలో నేరాశిదశయందైనను మరణముసంభ వించునని చెప్పవలయును.

సూ॥ పితృలాభరోగేశే ప్రాణిని కం=కాదిస్థే స్వత శ్చైవం త్రిధా॥ ౧౯॥

వ్యా॥ అథ ప్రకారాన్తరేణ దీర్ఘాద్యాయుర్యోగత్రయ మాహ॥ లగ్నాత్సప్తమాచ్చయావష్టమేశౌ తయోర్యః ప్రాణీ బలీతస్మిన్కంట కాదిస్థే లగ్నాదికేంద్రపణఫరాపోక్లిమస్థేత్రిధా యోగోభవతి లగ్నాది

కేంద్రగే తస్మిన్ దీర్ఘాయుర్యోగః పణఫరస్థే మధ్యాయుః ఆపోక్లిమ
స్థేత్వల్పాయురిత్యర్థః ఏవం స్వతశ్చ కారకాదపి యోగత్రయ మిహ
బోధ్యం తథాచ కారకా త్తత్సప్తమాచ్చ యావష్టమేశౌ తయోర్యో
బలీతస్మిన్ కార కేంద్రాదిస్థే దీర్ఘమధ్యాల్పాయుర్యోగాభవన్తీత్యర్థః॥

టీ॥ పితృలాభరోగేశే=లగ్నసప్తమాధిపతులకు నష్టమస్థానాధిపతులలో, ప్రాణిని=బలముకలవాడు, కంటకాదిస్థే=కేంద్రము మొదలగు స్థానములయందు నున్నయెడల, త్రిధా = మూడువిధములుగా యోగములు కలుగును, స్వతశ్చ=స్వతస్సిద్ధముగాను, ఏవం=ఈప్రకారము మూడుయోగములు.

తా॥ మఱియొకవిధముగ దీర్ఘ మధ్య అల్పాయుర్యోగములను జెప్పుచున్నాడు. లగ్నమునుండిగానిసప్తమమునుండిగాని అష్టమస్థానాధిపతులలో నెవడైనను బలముకలవాడు లగ్నాదికేంద్రస్థానములయందైనను 2 పణభరములందైనను 3 ఆపోక్లిమములందైన నున్నయెడల మూడువిధములగు యోగములు కలుగును. అనగా కేంద్రస్థానమందుండిన దీర్ఘాయువు, పణపరస్థానమందుండిన మధ్యాయువును, ఆపోక్లిమస్థానమందుండిన నల్పాయువును కలుగునని మూడువిధములగు యోగములు ఈప్రకారముకానే కారకస్థానమునుండిగాని సప్తమస్థానమునుండిగాని అష్టమస్థానాధిపతులలో నెవడైనను బలము కలవాడు కారకాదిస్థానములకు పూర్వము చెప్పబడిన కేంద్రపణఫర ఆపోక్లిమస్థానములయందుండిన క్రమముగ దీర్ఘమధ్యాల్పాయుర్యోగములు కలుగునని చెప్పవలెను.

సూ॥ యోగాత్సమేస్వస్మిన్విపరీతం॥ ౨౦॥

వ్యా॥ అథైతద్యోగానా మపవాదమాహ ॥ యోగాత్ జన్మలగ్నసప్తమా త్సప్తమె నవమె స్వస్మిన్కారకె సతి విపరీతం పితృలాభేత్యాది సూత్రోపదిష్టయోగానస్యుః కింతు దీర్ఘంచేన్మధ్యం మధ్యంచేదల్పమల్పంచేన్నకించిదిత్యర్థః వైపరీత్యన్తు దీర్ఘంచేదల్పమల్పంచేద్దీర్ఘం మధ్యంచేన్మధ్యమేవేతితు సంప్రదాయవిదః ఆయుర్దాయవిషయే విశేషమాహుర్వృద్ధాః ॥ శ్లో॥ ఏకోష్టమేశస్స్వోచ్చస్థం పర్యాయార్థం

ప్రయచ్ఛతి। నీచస్థోనాశయేత్పర్యా యార్ధమాయుషినిశ్చితే।నీచరన్ధ్రేశ సంయుక్తాః పర్యాయార్థంపృథక్పృథక్। గ్రహావినాశయంత్యేవంనిర్ణితే పరమాయుషి । ఉచ్చరన్ధ్రేశసంయుక్త గ్రహైఃపత్యేకమున్నయేత్। ఏకైకమర్ధపర్యాయం పరమాయుషినిశ్చితే॥ అయమర్థః అయుః పితృదిశేశాభ్యామిత్యనేనాష్టమేశ ఉచ్చస్థశ్చేత్స్వపర్యాయార్థం స్వదశార్థమధికందదాతి నాథాన్తా ఇతి రీత్యాయావదాయురాయాతి తస్మిన్నపరపి తదర్థ మధికం యోజనీయ మితి యావత్ అష్టమేశో నీచరాశిగశ్చేదాయుష్యర్థం నాశయేత్ ఏవమేవనీచాష్టమేశయుక్తాగ్రహా అపి స్వదీయమానాయుష్యర్థమర్థం నాశయేయుః ఏవ ముచ్చాష్టమేశసంయుక్తాగ్రహాః స్వదీయమానాయుషి స్వదశార్ధమధికందద్యుః ఏవమేవ లగ్నేశాదయోపిగ్రహాః ఉచ్చనీచగుణతో వృద్ధిహ్రాసౌ కుర్యు రితి సమ్ప్రదాయః॥ ౨౦॥

టీ॥ యోగాత్ = యోగములస్థానములనుండి, సమే=నవమస్థానమందు, స్వస్మిన్=కారకుడుండగ,విపరీతం=వ్యతిరేకముకలుగును.

తా॥ ఇదివఱకు చెప్పబడినయోగములకు నపవాదమును జెప్పుచున్నాడు. జన్మలగ్నమునుండి సప్తమస్థానమందుగాని నవమస్థానమందుగాని కారకుడుండినయెడల "పితృలాభరోగేశే"అనునట్టి సూత్రము మొదలగువాటిచే జెప్పఁబడినయోగములుసంభవింపవు. ఇఁకనేమనగా దీర్ఘాయుర్యోగమునకు మధ్యాయువు యోగమును మధ్యాయుర్యోగమునకు నల్పాయుర్యోగమును నల్పాయుర్యోగమునకు ఏమియు లేకపోవుటయును మారినట్లుగ భావింపవలయును. మఱియు నీవైపరీత్యమనఁగా దీర్ఘాయువల్పాయువుగాను నల్పాయువు దీర్ఘాయువుగాను మధ్యాయువు మధ్యాయువుగాను మారుటయని కొందరుసాంప్రదాయవేత్తలు చెప్పుచున్నారు. ఆయుర్దాయవిషయములో వృద్ధులమతమేమనఁగా శ్లో॥ ఏకోష్టమేశస్స్వోచ్చస్థః పర్యాయార్థంప్రయచ్ఛతి।నీచస్థోనాశయేత్పర్యా యార్ధమాయుషినిశ్చితే । నీచరంధ్రేశసంయుక్తాః పర్యాయార్థంపృథక్పృథక్ । గ్రహావినాశయంత్యేవం నిర్ణితేపరమాయుషి। ఉచ్చరంధ్రేశసంయుక్త గ్రహైఃపత్యేకమున్నయేత్। ఏకైక

మర్థంపర్యాయం పరమాయుషినిశ్చితే ॥ అనఁగా "ఆయుఃపితృదినేశాభ్యాం" అను సూత్రప్రకారమష్టమస్థానాధిపతి యుచ్చరాశియందుండెనేని తన దశాసంవత్సరములలో సగము సంవత్సరములధికముగా నిచ్చును. "నాథాంతాః" అను సూత్రిప్రికారము జాతకునకు వచ్చునాయుర్దాయములో నధికముగ నీయఁబడిన యాయువును గలుపవలయును. అష్టమస్థానాధిపతి నీచరాశియందుండెనేని యతని దశాసంవత్సరములలో సగము సంవత్సరములు జాతకుని యాయుర్దాయ సంవత్సరములలో తగ్గింపవలయును ఈవిధముగా నష్టమాధిపతి నీచస్థానమందుండగా నతనితోఁకూడియున్నగ్రహములయొక్క దశలలో సగము సంవత్సరములు తగ్గింపవలయును. అష్టమాధిపతి యుచ్చస్థానమందుండగా నతనితోఁగూడియున్నగ్రిహములయొక్క దశలలో సగము సంవత్సరములను నధికముగ గలుపవలయును. ఈప్రకారముగానే లగ్నాధిపతి మొదలగు గ్రిహములుచ్చస్థానమందుండిన ఆయుర్వృద్ధిని నీచస్థానమందుండిన ఆయుఃక్షీణమును చేయునని సాంప్రిదాయవేత్తలు చెప్పిరి.

సూ॥ రాశితఃప్రిణః॥ ౨౧॥

వ్యా॥ అస్మిన్ ప్రకరణే కిం బలం గ్రాహ్య మిత్యాశంకాయామాహ॥ అత్రి రాశితో బలం గ్రిహ్యాం కారకయోగః ప్రిథమోభానామిత్యాదికం వక్ష్యమాణబలంగ్రాహ్యం అత్రాంశాధిక్యబలంనగ్రాహ్యమిత్యర్థః॥

టీ॥ రాశితః = రాశివలన, ప్రిణః = బలమునిశ్చయింపఁదగియున్నది.

తా॥ ఏబలమునననుసరించి నిశ్చయింపవలయుననఁగా "కారకయోగఃప్రిథమోభానాం" అని చెప్పఁబోవుసూత్రిప్రకారము రాశిబలము ముఖ్యముఁగ గ్రిహింపవలయును. అంశాధికబలము గ్రహింపనక్కరలేదు.

సూ॥ రోగేశయోస్స్వత ఐక్యేయోగేవామధ్యమ్॥ ౨౨॥

వ్యా॥ అథ ప్రకారాన్తరేణ మధ్యాయుర్యోగమాహ॥ లగ్నాత్సప్తమాచ్చ రోగేశయో రష్టమేశయో స్స్వతః కారకేణైక్యే సతి యోగేవా సతి పితృలాభేత్యాది సూత్రేణ ప్రాప్తదీర్ఘాయుషామపి మధ్యాయురేవ భవతీత్యర్థః జాతకశాస్త్రాన్తరే లగ్నస్యాస్మిన్గ్రన్థే కారకస్య ప్రాధాన్యా దష్టమేశయోగే నాయుషో హ్రాస ఏవేతి విభావనీయమ్॥

టీ॥ రోగేశయోః=అష్టమాధిపతులకు, స్వతః=కారకునితోటి, ఐక్యే=కూడుట కలుగుచుండగాను, యోగేవా = మరియొకవిధమగు సంబంధము కలుగుచుండగా, మధ్యం=మధ్యాయుర్యోగముకలుగును.

తా॥ లగ్నమునుండిగాని సప్తమమునుండిగానిఅష్టమస్థానముల కధిపతులుకారకునితోగూడినను చూడబడినను "పితృలాభే" ఇత్యాది సూత్రప్రకారము దీర్ఘాయుర్యోగము పట్టినను మధ్యాయుర్యోగము సంభవించును. ఇతర జాతకశాస్త్రగ్రంధములయందు లగ్నమునకును ఈగ్రంధమునందు కారకమునకును ప్రాధాన్యముగ చెప్పుటవలన లగ్నసప్తమములకు నష్టమాధిపతులయొక్క సంబంధముచే నాయుర్దాయమునకు హ్రాసము సంభవించును.

సూ॥ పితృలాభయోః పాపమధ్యత్వే కోణపాపయోగే వా కక్ష్యాహ్రాసః॥ ౨౩॥

వ్యా॥ అథ దీర్ఘాదియోగేషు కక్ష్యాహ్రాసమాహ॥ పితృలాభయోర్లగ్నసప్తమయోర్ద్వయో రపి పాపగ్రహస్య మధ్యవర్తిత్వేకక్ష్యా హ్రాసోభవతి లగ్నకుండల్యా ద్విద్వాదశయో ష్షష్ఠాష్టమయోశ్చపాపయోగే సతి పాపమధ్యవర్తిత్వంభవతి ఏవంల్లగ్నసప్తమయోః కోణపాపయోగేవా కోణేషు త్రికోణేషు లగ్నపంచమ నవమేషు సర్వత్ర పాపయోగేవా కక్ష్యాహ్రాసోభవతి॥

టీ॥ పితృలాభయోః=లగ్నసప్తమస్థానములకు, పాపమధ్యత్వే= పాపగ్రహములమధ్యయుండుట కలిగియుండగాను, కోణపాపయోగే వా = త్రికోణస్థానములకు పాపగ్రహసంబంధము కలిగియుండగాను, కక్ష్యాహ్రాసః=దీర్ఘాదియోగములకు హ్రాసముకలుగును.

తా॥ దీర్ఘాద్యాయుర్దాయములలో కగ్గుబాటు కలుగుటకు కారణమును జెప్పుచున్నాడు. లగ్నసప్తమస్థానములు రెండును పాప గ్రహముల మధ్యనున్నను లగ్నపంచమ నవమస్థానములయందు పాప గ్రహములున్నను దీర్ఘమధ్యాల్పాయుర్యోగములలో నంశలనుబట్టి కొంతకొంత ఆయుర్యోగంతగ్గును.

సూ॥ స్వస్మిన్నప్యేవం॥ ౨౮॥

వ్యా॥ స్వస్మిన్ కారకేప్యేవం లగ్నకుండలీవద్భవతి అయమర్థః కారకరాశే స్తత్సప్తమరాశేశ్చ పాపమధ్యత్వే ఏకోయోగః కారకత త్సప్తమయో స్త్రికోణె సర్వత్రపాపయోగే సతి ద్వితీయో యోగః॥

టీ॥ స్వస్మిన్నపి=కారకమందుండినను, ఏవం = ఈప్రకారము గానేయగును.

తా॥ కారకరాశియు దానికి సప్తమరాశియు పాపగ్రహముల నడుమ నున్నయెడల నొకయోగము. కారకరాశికిని దానికి సప్తమ రాశికిని త్రికోణస్థానములయందు పాపగ్రహములున్న రెండవ యోగము ఈయోగములాయుర్దాయమును తగ్గించును.

సూ॥ తస్మిన్పాపేనీచేతుంగేశుభసంయుక్తేచ॥ ౨౯॥

వ్యా॥ కక్ష్యాహ్రాసాయ తస్మిన్కారకే పాపె నీచేసతి కక్ష్యా హ్రాసః కారకేపాపె తుంగే నుచ్చరాశౌ అశుభసంయుక్తే చ సతి కక్ష్యాహ్రాసోభవతీతి తృతీయోయోగః॥

టీ॥ తస్మిన్=కారకుఁడు, పాపే=పాపుడైనను, నీచే=నీచయం దున్నను, అతుంగే=ఉచ్చరాశియందుండకపోయినను, అశుభసంయు క్తేచ=పాపగ్రహములతోకూడినను, కక్ష్యాహ్రాసః=ఆయుర్దాయతర గతులలో తగ్గుటసంభవించును.

తా॥ కారకుడు పాపుడైనను నీచరాశియందున్నను ఉచ్చరాశి యందుండకపోయినను పాపగ్రహములతో కూడినను కక్ష్యమునకు లోపముకలుగును.

సూ॥ అన్యదన్యథా॥ ౩౦॥

వ్యా॥ అథ కర్త్యాప్రాప్తసయోగే ఉపవాదమాహ। అన్యథా లగ్నసప్తమయోః కారకసప్తమయోర్వా శుభగ్రిహ మధ్యగతత్వే లగ్నకారకాభ్యాం కోణేషు శుభయోగోవా కారకే శుభేఽనీచే వా కారకే శుభే తుంగే శుభసంయుక్తే చ వా అన్యత్కృత్యావృద్ధిరిత్యర్థః తథాచ సర్వత్రయోగే పాపాత్మకే కర్త్యాహానిః శుభాత్మకే కర్త్యా వృద్ధిః శుభపాపరహితేన వృద్ధిర్నహానిః ఇతియోజ్యమ్॥

టీ॥ అన్యథా=మరియొకవిధముగనుండిన, అన్యత్=ఈచెప్పిన దానికి వ్యతిరేకముకలుగును.

తా॥ పైన చెప్పఁబడిన కర్త్యాహానియోగమునకు నపవాద మును జెప్పుచున్నారు. లగ్నసప్తమస్థానములుగాని కారకసప్తమ స్థానములుగాని శుభగ్రహముల మధ్యనున్నను లగ్నకారకస్థానములకు త్రికోణస్థానములయందు శుభగ్రహములున్నను కారకుడు శుభుడైనను కారకరాశి నీచరాశికాకపోయినను శుభుఁడుచ్చరాశియందుండినను శుభగ్రహములతోఁగూడినను కర్త్యమునకు వృద్ధికలుగును. అనఁగా పూర్వము శాస్త్రముచే నిర్ణయింపఁబడినదానికంటె వృద్ధియగును. ఇట్లు చెప్పుటవలన నంతటను పాపసంబంధముకలుగుటచే కర్త్యమునకు హానియు నంతటను శుభసంబంధముకలుగుటచే కర్త్యమునకు వృద్ధియు పాపసంబంధము శుభసంబంధము రెండును లేకపోయినను వృద్ధియు హానియు రెండును లేకుండుటయునగునని తెలిసికొనవలెను..

సూ॥ గురౌచ॥ ౨౭॥

వ్యా॥ అథ హానివృద్ధిప్రకారాన్గురావపి దర్శయతి పీవమిత్యర్థః గురోర్ద్విద్వాదశషష్ఠాష్టమ త్రికోణేషు పాపయోగే సతి కర్త్యాహానిః గురౌనీచేఽతుంగే ఽశుభసంయుక్తేచ కర్త్యాహానిః అన్యథా చేదన్యథేతి ప్రాగ్వద్యోజనా॥

టీ॥ గురౌచ=బృహస్పతియందును ఈవిధముగానే,

తా॥ బృహస్పతి ద్వితీయ ద్వాదశస్థానముల మధ్యనున్నను షష్ఠాష్టమములమధ్యనున్నను త్రికోణస్థానములయందు పాపగ్రహము లున్నను కర్త్యమునకు హానికలుగును. మరియు నీచయందుండినను

ఉచ్చరాశియందుండకపోయినను పాపగ్రహములతోఁగూడినను కక్ష్యమునకు హ్రాసముకలుగును. ఈచెప్పబడినయోగములకువ్యతిరేకముగునేని అనఁగా నన్నివిషయములయందును శుభసంబంధము కలిగిన యెడల కక్ష్యమునకు వృద్ధికలుగును.

సూ॥ పూర్ణేందుశుక్రయోరేకరాశివృద్ధిః॥ ౨౮॥

వ్యా॥ తత్రాపవాదం దర్శయతి ఉక్తస్థానేషు శుభగ్రహయోగప్రకరణే పూర్ణేందుశుక్రయోర్యోగే సతి నకక్ష్యావృద్ధిః కిన్త్వేకరాశివృద్ధిరేవేత్యర్థః॥

టీ॥ పూర్ణేందుశుక్రయోః = పూర్ణచంద్రశుక్రులయొక్క సంబంధము కలిగెనేని, ఏకరాశివృద్ధిః=ఏకరాశివృద్ధికలుగును.

తా॥ పైనచెప్పఁబడిన యోగమునకు అపవాదమును జెప్పుచున్నాడు. శుభగ్రహప్రకరణముగల పైనజెప్పఁబడిన స్థానములయందు పూర్ణచంద్రుడు శుక్రుడునున్నయెడల కక్ష్యమునకు వృద్ధిలేదుగాని యేకరాశి వృద్ధికలుగును.

సూ॥ శనావిపరీతమ్॥ ౨౯॥

వ్యా॥ పాపయోగేనయః కక్ష్యాహ్రాస ఉక్తస్తత్రాపవాదం దర్శయతి శనావుక్తస్థానగే సతి నకక్ష్యాహ్రాసః కింత్వేకరాశిహ్రాస ఏవేత్యర్థః అత్ర చన్ద్రశుక్రశనీనాం ప్రాధాన్యేనయోగకర్తృత్వేన గ్రహాన్తరేషు యోగకర్తేష్వపి ఏకరాశే ర్వృద్ధిహ్రాసోవా స్యాన్నతు కక్ష్యాయా ఇత్యర్థః॥

టీ॥ శనౌ=శనియుండగ, విపరీతం = వ్యతిరేకముగాజరుగును.

తా॥ పాపయోగముచేకలిగిన కక్ష్యముయొక్క హ్రాసమునకు అపవాదముఁ జెప్పుచున్నాడు. శని పైనచెప్పబడిన స్థానములయందుండినయెడల కక్ష్యమునకు హ్రాసము లేదుగాని యేకరాశి హ్రాసము కలుగును. ఇట్లు చెప్పుటచే చంద్రశుక్రశనిగ్రహములకు కర్తృత్వము ప్రధానమగుటచే నితరగ్రహములకు యోగకర్తృత్వముకలిగియున్నను నేకరాశికి వృద్ధిహ్రాసములేగాని కక్ష్యమునకుహ్రాసము వృద్ధియులేదు.

సూ॥ స్థిరదశాయాం యథాఖండం నిధనమ్॥ ౩౦॥

వ్యా॥ అథ సకలాయుర్యోగాపవాదత్వేన నిధనయోగం స్థిర దశాయామాలమ్బ్యాహ॥ ఖండమనతిక్రమ్య యథాఖండం స్థిరదశా యాం శశినన్దపావకా ఇతి వక్ష్యమాణాయాం దీర్ఘమధ్యాల్పాయుర్భే దేన పూర్ణాయుష స్త్రేధా ఖండకరణాద్యాః ఖండ స్సమాగతా స్తస్మి న్నేవ ఖండే నిధనం భవతీత్యర్థః ఏవం చ వక్ష్యమాణప్రకారేణ నిధ నాశ్రయఖండాత్పూర్వఖండె నిధనలక్షణాక్రాంతరాశేర్దశాయామాగ తాయామపిన నిధనం స్యాత్ కింతు క్లేశస్స్యాత్॥

టీ॥ స్థిరదశాయాం=స్థిరదశయందు, యథాఖండం = ఖండము ననుసరించిన, నిధనం=మరణముకలుగును.

తా॥ ఇప్పుడు సకలాయుర్యోగమునకు నపవాదముగ జెప్పఁ బడిన మరణయోగమును స్థిరదశననుసరించి చెప్పుచున్నాడు. "శశినం దపావకాః" అని చెప్పబోవు సూత్రానుసారముగ దీర్ఘమధ్యాల్పా యుర్యోగ భేదములచే బూర్ణాయువునకుఁ జెప్పబడిన మూడుఖండము లలో గ్రహస్థితివశముచే వచ్చు ఖండమునందే మరణము కలుగును. ఇందువలన ముందు చెప్పఁబోవువిధమునకనుసరించిన మరణయోగము కంటె పూర్వమే యన్యగ్రంథములననుసరించి చెప్పబడిన రాశిదశలోను మరణయోగమున్నట్లు తోచినను మరణముకలుగదు కాని మరణము తో సమానమగు కష్టముకలుగును.

సూ॥ తత్రర్క్షవిశేషః॥ ౩౧॥

వ్యా॥ అథ దీర్ఘమధ్యాల్పాయుర్భేదేన మరణఖన్డే నిర్ణీతేన విశేషతో మరణకాలజ్ఞాన మితస్సమ్భవతీత్యత్రాహ తత్రనిధనె ఋక్ష విశేషః రాశివిశేషో స్తీత్యర్థః॥

టీ॥ తత్ర = ఆమరణఖండమునందు, ఋక్షవిశేషః = రాశి విశేషము.

తా॥ ఆ మరణఖండములో ఏసమయమందు జరుగుననఁగా మరణయోగమును కలుగచేయు రాశిదశయందు మరణము కలుగునని చెప్పవలయును.

సూ॥ పాపమధ్యే పాపకోణేరిపురోగయోఃపాపేవా॥ 32॥

వ్యా॥ నరాశివిశేషః క ఇత్యపేక్షాయామాహ ॥ పాపద్వయమధ్యగతరాశిదశాయాం ప్రథమదశాప్రదరాశే స్త్రికోణే ద్వాదశాష్టమయోర్వా పాపయోగే సతి తద్రాశిదశాయాం నిధనంభవతి ఏతదుక్తం వృద్ధైః శుభమధ్యే మృతి ర్నైవ పాపమధ్యే మృతిర్భవేత్ ఇతి లగ్నాత్కారకా ద్వాపాపాక్రాంతత్రికోణదశాయాం పాపాక్రాంత ద్వాదశాష్టమరాశిదశాయాంవా నిధనంభవతీత్యర్థః॥

టీ॥ పాపమధ్యే = పాపగ్రహములనడుమనున్న రాశిదశయందును, పాపకోణే = పాపగ్రహములున్న త్రికోణరాశియందును, రిపురోగయోః=ద్వాదశాష్టమస్థానములయందు, పాపేవా=పాపగ్రహములున్నను కలుగును.

తా॥ అట్టి మరణకాలమును చెప్పుచున్నాడు. రెండు పాపగ్రహములమధ్యనున్న రాశిదశయందును మొదటగా దశనిచ్చినట్టి రాశి మొదలు త్రికోణస్థానములయందుగాని ద్వాదశాష్టమస్థానములయందుగాని పాపగ్రహములున్నను ఆరాశిదశలయందు మరణము కలుగును దీనినిగురించి వృద్ధులవాక్యము- శ్లో॥ శుభమధ్యేమృతిర్నైవ పాపమధ్యేమృతిర్భవేత్ ॥ శుభగ్రహముల మధ్యనున్న రాశిదశలో మరణము కలుగదనియు పాపగ్రహముల మధ్యనున్న రాశిదశలో మరణము కలుగుననియు చెప్పిరి. మరియు లగ్నమునుండిగాని కారకరాశినుండిగాని పాపగ్రహములచే నధిష్ఠింపబడిన త్రికోణరాసులదశయందైనను ద్వాదశాష్టమస్థానములరాసులదశయందైనను మరణము కలుగునని యితరులు చెప్పిరి.

సూ॥ తదీశయోః కేవలక్షీణేందుశుక్రదృష్టౌవా॥ 33॥

వ్యా॥ పునరపి నిధనే రాశివిశేషమాహ॥ తదీశయోర్ద్వాదశాష్టమేశయో ర్గ్రహాన్తరదృష్టిరహిత కేవల క్షీణేన్దు శుక్రయో ర్దృష్టౌ సత్యాం ద్వాదశాష్టమరా శిదశయో ర్నిధనం భవతీత్యర్థః బహువర్ష వ్యాపిన్యాం దశాయాం కదా మరణ మిత్యాశంకాయామాహ॥

టీ॥ తదీశయోః=ద్వాదశాష్టమస్థాన రాసులయొక్క అధిపతు లకు, కేవలక్షీణేందు శుక్రదృష్టౌవా = ముఖ్యముగ క్షీణచంద్రుని శుక్రులయొక్క దృష్టికలుగుచుండగ మరణముకలుగును.

తా॥ మఱియొక మరణయోగమును జెప్పుచున్నాడు. ద్వాదశాష్టమస్థానాధిపతులకితర శుభపాపగ్రహములయొక్క దృష్టి లేక కేవలము క్షీణచంద్రశుక్రులయొక్క దృష్టియున్నయెడల ద్వాదశాష్టమస్థాన రాసులదశలలో మరణముకలుగును.

సూ॥ తత్రాప్యాద్యర్క్షారినాథదృశ్యనవభాగాద్వా॥ ౩౮॥

వ్యా॥ తత్రాపి నిధనస్థానత్వేనాదిష్టాసు పాపమధ్య రాశ్యాది దశాస్వాద్యర్క్షారినాథౌ ప్రథమదశాప్రదరాశి తత్షష్ఠరాశినాథౌ తాభ్యాం దృశ్యోయోనవమభాగో నవాంశకుండల్యాం రాశిస్తస్యాంతర్దశాయాంవా నిధనం భవతీత్యర్థః నన్వాద్యశబ్దేన దశమరాశిః అరిశబ్దేన షష్ఠరాశి రితికైశ్చిద్వ్యాఖ్యాతం తత్ర వైషమ్యే బీజాభావా దరిశబ్దేనాష్టమరాశిః కుతోఽసగృహ్యేత ఇతి ఏవంచేన్మునే స్తాత్పర్యం తర్హి తత్రాపి రిఃఫతన్తునాథదృశ్యనవభాగాద్వేతి కుతోనోక్తమిత్యలం॥

టీ॥ తత్రాపి=ఆరాశిదశలలోను, ఆద్యర్క్షారినాథదృశ్యనవభాగాద్వా=మొదటి దశనిచ్చునట్టి రాశియొక్కయు దానికి షష్ఠరాశియొక్కయు నధిపతులచే జూడఁబడిన నవాంశమువల్లనైనను మరణము కలుగును.

తా॥ మరణయోగమును కలిగించునట్లుగా జెప్పఁబడినవియు పాపగ్రహమధ్యనున్నట్టియు రాసులు మొదలగువాటియొక్కదశలలో మొదటగా దశనిచ్చునట్టి రాశీశ్వరునిచేతను ఆరాశికినారవరాశీశ్వరుని చేత జూడఁబడిన నవాంశచక్రమునందుగల రాశియొక్క అంతర్దశయందు మరణము కలుగును. ఇచ్చట 'ఆద్య'శబ్దమువలన దశమరాశి యనియు 'అరి'శబ్దముచే అష్టమరాశియనియు జెప్పుటకు కారణమేమన అరిశబ్దముచే నష్టమరాశిని చెప్పుటయే మునీశ్వరుని యభిప్రాయము అట్లు కానియెడల "తత్రాపిరిష్ఫతంతునాథదృశ్యనవభాగద్వా" అని

సూత్రము చెప్పవలసియుండెడిది అట్లు చెప్పలేదు కావున 'అరి' శబ్దముచే సప్తమరాశియను నర్థమునే గ్రహింపవలయును.

సూ॥ పితృలాభభావేశప్రాణీరుద్రః॥ 37॥

వ్యా॥ అథ నిర్యాణదశావిశేషం ప్రకారాన్తరేణదర్శయితుం రుద్రగ్రహం లక్షయతి లగ్నసప్తమాభ్యాం యావష్టమేశౌ తయోర్యః ప్రాణీ బలవాన్ స రుద్రసంజ్ఞోగ్రహో భవతీత్యర్థః॥

టీ॥ పితృలాభభావేశప్రాణీ= లగ్నసప్తమస్థానములనుండి అష్టమాధిపతిలలో బలముకలవాడు, రుద్రః=రుద్రగ్రహమని చెప్పఁబడును.

తా॥ లగ్నసప్తమస్థానరాసులకే అష్టమరాసులు కలవో ఆ యష్టమరాసులకధిపతులలో బలముకల గ్రహము రుద్రగ్రహమని చెప్పఁబడును.

సూ॥ అప్రాణ్యపిపాపదృష్టః॥ 38॥

వ్యా॥ ద్వితీయరుద్రమాహ॥ లగ్నాసప్తమాభ్యాం యోష్టమాధీశో దుర్బలః సోపిపాపదృష్టశ్చేద్రుద్రస్యాత్ తథాచద్వౌరుద్రౌభవతః ప్రాణీ అప్రాణీచేతి॥

టీ॥ అప్రాణ్యపి=బలములేనివాడైనను, పాపదృష్టః=పాపగ్రహముచే జూడఁబడినవాడును.

తా॥ రెండవరుద్రగ్రహమును చెప్పుచున్నాడు. లగ్నసప్తమరాసులనుండి అష్టమస్థానాధిపతులలో నెవడైనను బలములేనివాడైనను అందు పాపగ్రహములచే జూడఁబడిన గ్రహము రుద్రగ్రహమని చెప్పఁబడును. ఇట్లు చెప్పుటచే బలముకలదియనియు బలము లేనిదియనియు రెండువిధములుగా రుద్రగ్రహములు చెప్పఁబడెను.

సూ॥ ప్రాణిని శుభదృష్టే రుద్రశూలాన్తమాయుః॥ 39॥

వ్యా॥ ప్రాణిరుద్రస్యఫలమాహ ॥ బలవతి రుద్రే శుభదృష్టే సతి రుద్రశూలాన్తం రుద్రాత్ప్రథమపంచమనవమదశాన్తమాయుర్భవతి అల్పమధ్య దీర్ఘాయుర్యోగభేదాత్ప్రథమ ద్వితీయ తృతీయ త్రికోణాంతేవాఽయుః సమాప్తం భవతీత్యర్థః॥

టీ॥ ప్రాణి=బలముకల రుద్రగ్రహము, శుభదృష్టే=శుభగ్రి హముచే జూడఁబడుచుండగా, రుద్రిశూలాంతం=రుద్రగ్రిహమునుండి ప్రిథమ పంచమ నవమ దశలయొక్క అంతమువరకు, ఆయుః=ఆయు ర్దాయముండును.

తా॥ బలముగల రుద్రగ్రిహము శుభ గ్రహముచే జూడఁబడిన యెడల ఆరుద్రిగ్రిహమునుండి ప్రిథమ పంచమ నవమ దశలయందు నిర్యాణము కలుగును. అనఁగా నల్పాయుర్యోగమునకు మొదటిది యనియు మధ్యాయుర్యోగమునకు పంచమమనియు దీర్ఘాయుర్యోగ మునకు నవమమనియు నిట్లు మూడు కోణస్థానదశలయందు నల్పమధ్య దీర్ఘాయుర్యోగములకు మరణము నిశ్చయింపవలెను.

సూ॥ తత్రాపిశుభయోగే॥ ౩౮॥

వ్యా॥ అప్రాణిరుద్రే విశేషమాహ॥ తత్రద్వితీయె రుద్రేపిశుభ యోగే సతి రుద్రిశూలాన్తమాయుర్భవతి నతు శుభదృష్ట్యేతిభావః॥

టీ॥ తత్రాపి = ఆరెండవరుద్రిగ్రిహము, శుభయోగే=శుభ గ్రిహసంబంధము కలిగియుండగ.

తా॥ దుర్బల రుద్రగ్రిహమునకు విశేషమును జెప్పుచున్నాడు. ఆరెండవ రుద్రగ్రిహమునకు శుభగ్రహసంబంధమున్నప్పటికిని రుద్ర శూలాంతమువరకు నాయువుండును.

సూ॥ వ్యర్కపాపయోగేవా॥ ౩౯॥

వ్యా॥ ఉక్తయోగేఽపవాదమాహ॥ రవిం విహాయేతరపాప యోగె సతీదంఫలం నభవతి రవియోగేతు నాస్యఫలస్యభంగఇతి॥

టీ॥ వ్యర్కపాపయోగే=సూర్యుడుకాక మిగిలిన పాపగ్రిహ ముల సంబంధముకలిగినయెడల, న=కాదు.

తా॥ పైనచెప్పినయోగమునకు అపవాదమును జెప్పుచున్నాడు. సూర్యుడు తప్ప యితర పాపగ్రిహములసంబంధముకలిగిన పైనజెప్పఁ బడిన ఫలము కలుగదు. సూర్యసంబంధమున్నయెడలమాత్రి మాఫల మునకు భంగముకలుగదు.

సూ॥ మందారేందుదృష్టేశుభయోగాభావే పాపయోగేపివా
శుభదృష్టౌవాపరతః॥ ౪౦॥

వ్యా॥ అథ రుద్రద్వయస్య గుణవిశేషేణ ఫలం దర్శయతి ప్రాణిన్యప్రాణినివా రుద్రే మన్దారేన్దుదృష్టే శుభయోగాభావ ఏకో యోగః మన్దారేన్దు దృష్టే రుద్రద్వయె పాపయోగేపివా ద్వితీయో యోగః మన్దారేన్దుదృష్టే రుద్రద్వయె శుభదృష్టౌవా సత్యాం తృతీయోయోగః ప్రథమయోగె శుభయోగాభావే ఇత్యనేన పాపయోగే ద్వితీయయోగే వక్తవ్యే శుభపాపరహితే రుద్రేఽయమర్థ స్సమ్పన్నః యోగత్రయె సమ్పూర్ణే సతి రుద్రశూలాన్తా త్పరతోఽగ్రే ఆయుః సమాప్తిర్భవతీత్యర్థః వాకారద్వయ మనాస్థాయామిత్యుక్త్వా యోగద్వయ పరమితి పంథై రుక్తం తన్నవాకారద్వయ స్యానాస్థాకల్పనాయాం ప్రమాణాభావా ద్యోగత్రయ పర మేవ వా కారద్వయేన లభ్యేత ఇతి అస్మిన్ప్రకరణె శుభపాపా వృద్ధై రుక్తాః॥ శ్లో॥ అర్కార మన్దఫణినః క్రమాత్క్రూరాయథాశ్రయం। చన్ద్రోపిక్రూర ఏవాత్ర క్వచిదంగారకాశ్రయె। గురుధ్వజకవిజ్ఞాస్యు ర్యథాపూర్వంశుభగ్రహాః ఇతి॥ అయమర్థః అత్రార్కాద్యా ఉత్తరోత్తరం యథాశ్రయంక్రూర రాశిగతాః క్రూరాభవన్తి శుభరాశిగతాస్తునపాపాః కింతు శుభాఏవ గుర్వాదయస్తు శుభాః యథాపూర్వం బుధాత్కవిః కవేః కేతుః కేతోర్గురురితిక్రమేణోత్తరోత్తరం శుభాః క్రూరగ్రహాణాం యథాక్రూరాశ్రయె క్రూరత్వం శుభాశ్రయె శుభత్వం యథాగుర్వాదీనామపిశుభాశ్రయె ఏవశుభతానక్రూరాశ్రయె శుభతా ఏవమేవవృద్ధై రప్యుక్తం॥ శ్లో॥ ప్రత్యేకంశుభరాశిస్థ ఉచ్చస్థోవాబుధశ్శుభః। గురుశుక్రౌచసామ్యస్థౌ తతోన్యత్రాశుభాస్స్మృతాః॥ ఇతి యదిశూలే మృతిస్తర్హి కస్మిన్ శూలేస్యాదిత్యత్ర వృద్ధై ర్విశేషో నిరుక్తః॥ శ్లో॥ పాపమాత్రస్యశూలత్వే ప్రథమస్థెమృతిర్భవేత్। మిశ్రేమధ్యమశూలస్థె శుభమాత్రేన్త్యభెమృతిః॥ ఇతి అస్యార్థః ద్వారుద్రౌయది పాపౌ తర్హి ప్రథమశూలే మృతిస్స్యాత్ యద్యేకోరుద్రఃశుభోఽపరః పాప స్తర్హి మధ్యశూలెమృతిః॥

టీ॥ మందారేందుదృష్టే = శన్యంగారక చంద్రులచే జూడఁబడుచుండగను, శుభయోగాభావే = శుభగ్రహయోగము లేకపోవుచుండగను, పాపయోగేపివా = పాపగ్రహయోగముకలుగుచుండగను, శుభదృష్టౌవా = శుభగ్రహదృష్టి కలుగుచుండగను, పరతః = రుద్రశూలముకంటె తర్వాత నిధనముకలుగును.

తా॥ రెండు రుద్రగ్రహములయొక్క గుణభేదముచే ఫలము నిరూపించుచున్నాడు. రుద్రగ్రహము బలముకలదైనను బలము లేకపోయినను శన్యంగారకచంద్రులచేజూడఁబడుచు శుభగ్రహసంబంధము లేకపోవుట యొక యోగము. శన్యంగారకచంద్రులచే రుద్రగ్రహములు రెండును చూడఁబడుచు పాపగ్రహయోగము కలిగియుండుట యొకయోగము రుద్రగ్రహములు రెండును శన్యంగారకచంద్రులచే జూడఁబడుచు శుభగ్రహదృష్టి సంబంధము కలిగియుండుట యొక యోగము ఇట్లు మూడుయోగములు చెప్పఁబడెను వానిలో ప్రథమ యోగమున శుభయోగాభావమని చెప్పుటచేతను రెండవయోగమున పాపగ్రహసంబంధము కలదని చెప్పుటచేతను శుభపాపగ్రహ రహిత మగురుద్రగ్రహవిషయమై తెలియునంశమేమనఁగా మూడుయోగములు సంపూర్ణమైనపిమ్మట రుద్రశూలానంతరమందాయుర్దాయము సమాప్త మగును. ఇచ్చట (వా) అను నక్షరము రెండుపర్యాయములు అనాస్థ యందు చెప్పబడెనని ప్రేమనిధిపండితులు చెప్పిరికాని యది సరికాదు. అట్లు అనాస్థయందని అర్థము కల్పించుటకు ప్రమాణము కాన్పించదు కావున (వా) అని రెండుసారులు చెప్పుట ఇదివఱకుచెప్పబడిన మూడు యోగములపరముగానే గ్రహింపవలయును ఈప్రకరణమందు శుభ పాపులవిషయమై వృద్ధులచే జెప్పఁబడిన వాక్యములు- శ్లో॥ అర్కార మందఫణినః క్రమాత్క్రూరాయథాశ్రయం। చంద్రోపిక్రూరఏవాత్ర క్వచిదంగారకాశ్రయే । గురుధ్వజకవిజ్ఞాస్స్యుర్యథాపూర్వంశుభగ్రహాః॥ అనఁగా సూర్యుడు, అంగారకుడు, శని, రాహువు ఈ నాలుగు గ్రహములును తామాశ్రయించియున్న రాశిక్రూరత్వమునుబట్టి క్రమముగ ఒకరికంటె నొకరుక్రూరత్వములో నధికులగుదురు. ఈనాలుగు

గ్రహములును శుభరాశి నాశ్రయించియున్నయెడల నావిధముగానే శుభులునగుదురు బృహస్పతి కేతువు శుక్రుడు బుధుడు ఈ నాలుగు గ్రహములు ఒకరికంటె నొకరుశుభత్వమున నధికులగుదురు. అనఁగా బుధునికంటె శుక్రుడు, శుక్రునికంటె కేతువు, కేతువుకంటె బృహస్పతి శుభత్వములో నధికులనియు చంద్రుడు శుభుడేగాని యొకానొకప్పుడంగారకునిసంబంధముకలిగినప్పుడు క్రూరుఁడనియు చెప్పఁబడినది. మరియు క్రూరగ్రహములకు క్రూరరాశి నాశ్రయించినప్పుడు క్రూరత్వము, శుభరాశి నాశ్రయించినప్పుడు శుభత్వమేవిధముగా జెప్పఁబడెనో ఆవిధముగానే బృహస్పతి మొదలగు శుభగ్రహములకు శుభరాశినాశ్రయించియున్నప్పుడే శుభత్వము కలదు. క్రూరరాశి నాశ్రయించియున్నప్పుడు శుభత్వములేదు ఇందునుగురించి వృద్ధవాక్యము-

శ్లో॥ ప్రత్యేకంశుభరాశిస్థః ఉచ్చస్థోవాబుధశ్శుభః । గురుశుక్రౌచసామ్యస్థౌ తతోన్యథాత్రిశుభాస్మృతాః ॥ అనఁగా బుధుడు ప్రత్యేకముగ శుభరాశియందుండినను ఉచ్చరాశియందుండినను శుభుడు. బృహస్పతి శుక్రుడును శుభరాసులయందుండిన శుభులు. ఈబుధ గురు శుక్రులు పైనచెప్పఁబడిన స్థానములకంటె భిన్నముగనుండిన నశుభులగుదురు. ఏ శూలదశయందు మృత్యువు కలుగుననుటకు వృద్ధవాక్యము—

శ్లో॥ పాపమాత్రస్యశూలత్వే ప్రథమత్క్షేమృతిర్భవేత్ । మిశ్రేమధ్యమశూలత్క్షే శుభమాత్రేంత్యభేమృతిః ॥ అనఁగా రుద్రగ్రహములు రెండును పాపులైనయెడల మొదటి శూలదశయందు మృతికలుగును. ఒక రుద్రగ్రహము శుభుడై రెండవ రుద్రగ్రహము పాపుడైనయెడల మధ్యమశూలమందు మృతికలుగును. రెండు రుద్రగ్రహములు శుభులైనయెడల శూలాంతమందు మృతికలుగునని చెప్పఁబడినది.

సూ॥ రుద్రాశ్రయేపిప్రాయేణ॥ ౮౧॥

వ్యా॥ ద్వావపి రుద్రౌ యది శుభౌ తర్హ్యన్త్యశూలే మృతిః స్యాదితి రుద్రాశ్రితరాశావపి కదాచిన్మరణయోగమాహ॥ రుద్రాశ్రయరాశావప్యాయుస్సమాప్తిర్భవతీత్యర్థః ప్రాయశ్శబ్దాద్రుద్రాశ్రయాత్పూర్వం పరతోవాఽయుస్సమాప్తిర్భవతి ఇతి ధ్వనితం॥

టీ॥ రుద్రాశ్రయేపి=రుద్రగ్రహాశ్రితరాశియందును, ప్రాయే ణ=తరుచుగాకలుగును.

తా॥ రెండురుద్రగ్రహములును శుభులైనయెడల అంత్యశూల దశయందు మృతికలుగును. రుద్రాశ్రితరాశియందును నొకప్పుడాయు స్సమాప్తియగును. "ప్రాయేణ' అని చెప్పుటచేత రుద్రాశ్రయరాశి దశకంటె పూర్వమందుగాని పరమందుగాని ఆయుస్సమాప్తియగునని సూచనచేయఁబడుచున్నది.

సూ॥ క్రియేపితరివిశేషేణ॥ ౪౨॥

వ్యా॥ అత్రవిశేషమాహ॥ మేషే జన్మలగ్నే సతి విశేషేణ రుద్రాశ్రయె ఆయుః సమాప్తిర్భవతి॥

టీ॥ క్రియే=మేషము, పితరి = జన్మలగ్నమగుచుండగ, విశే షేణ=విశేషముగ సమాప్తియగును.

తా॥ ఇచ్చట విశేషమును చెప్పుచున్నాడు. మేషరాశి జన్మ లగ్నమయినయెడల విశేషముగ రుద్రాశ్రితదశయందుమృతికలుగును.

సూ॥ ప్రథమమధ్యమోత్తమేషు వా తత్తదాయుషామ్॥ ౪౩॥

వ్యా॥ యోగభేదేన నిధనస్థానందర్శయతి తత్తదాయుషామల్ప మధ్యదీర్ఘాయుర్యోగవతాం ప్రథమమధ్యమోత్తమేషు ప్రథమద్వితీయ తృతీయ రుద్రశూలేషువా క్రమేణాయుః సమాప్తిర్భవతి రుద్రశూల రాశిమహాదశాయాం నిధనే సిద్ధెకస్యామన్తర్దశాయాం నిధన మిత్యత ఆహ అత్రశూలేచేదిత్యుక్త్వా రుద్రశూలే నిర్యాణయోగే సత్యపిబల వత్తరయోగాన్తరవశత్తో రుద్రశూలనిర్యాణబాధోపి భవతీతిధ్వనితం॥

టీ॥ తత్తదాయుషాం = ఆయా ఆయుర్దాయములకు, ప్రథమ మధ్యమోత్తమేషువా = మొదటిది రెండవది మూడవదియగు రుద్ర శూలలయందైనను ఆయుస్సమాప్తియగును.

తా॥ యోగముల భేదముచే మరణస్థానమును నిరూపించు చున్నాడు. అల్ప మధ్యమ దీర్ఘాయువులుగలవారలకు క్రమముగ మొదటిది రెండవది మూడవదియగు రుద్రశూలయోగములయందు ఆయుస్సమాప్తియగును. రుద్రశూలరాశిమహాదశయందు మరణము

సిద్ధించినను యెవనియంతర్దశయందనగా బలవత్తరమగు మరియొక యోగవశముచే రుద్రశూల నిర్యాణ బాధయు కలుగును.

సూ॥ స్వభావేశోమహేశ్వరః॥ ౪౪॥

వ్యా॥ అథ ఫలవిశేష కథనాయ మహేశ్వరగ్రహం లక్షయతి స్వాదాత్మకారకాద్భావేశోష్టమరాశీశో మహేశ్వరగ్రహ ఇత్యర్థః॥

టీ॥ స్వభావేశః=అష్టమరాశ్యధిపతి, మహేశ్వరః=మహేశ్వరగ్రహమనఁబడును.

తా॥ ఫలవిశేషమును జెప్పుటకు మహేశ్వరగ్రహమును నిరూపించుచున్నాఁడు. ఆత్మకారకస్థానమునుండి యెనిమిదవ రాశీశ్వరుఁడు మహేశ్వరగ్రహమని చెప్పఁబడును.

సూ॥ స్వోచ్చేస్వగృహేరిపుభావేశఃప్రాణీ॥ ౪౫॥

వ్యా॥ యది కారకాదష్టమేశః స్వోచ్చే స్వగృహే వా స్వాత్తదా కారకా ద్ద్వాదశాష్టమేశయోర్మధ్యే యో బలీ సఏవ మహేశ్వరః స్యాన్నతుస్వభావేశ ఇత్యర్థః ద్వావపి తుల్యబలౌ చేద్ద్వౌ మహేశ్వరౌ భవత ఏవ స్వోచ్చె సగ్రహ ఇతి పాఠే తు కారకోచ్చరాశౌ గ్రహయుక్తే సతి కారకా దష్టమద్వాదశేశయో ర్మధ్యే యో బలీ సమహేశ్వరః అస్మిన్ పక్షే ప్రకారాన్తరేణాయ మపి మహేశ్వర ఇత్యర్థః॥

టీ॥ రిపుభావేశః=అష్టమాధిపతి, స్వోచ్చే=తనయుచ్చరాశియందుండినను, స్వగృహే=స్వక్షేత్రమందుండినను, ప్రాణీ=బలవంతుఁడని చెప్పఁబడును.

తా॥ కారకస్థానమునుండియైన నష్టమాధిపతి యుచ్చరాశియందుగాని స్వక్షేత్రమందుగాని యున్నయెడల బలము కలవాఁడగును. మరియు కారకమునుండియైన ద్వాదశాష్టమరాశ్యధిపతులలో నెవఁడు బలముకలవాఁడో వాఁడే మహేశ్వరగ్రహముకాని యష్టమాధిపతియని యేయని చెప్పుటకు వీలులేదు. ఇద్దరును సమాన బలముకలవారైన యెడల నిద్దరును మహేశ్వరగ్రహములని చెప్పఁబడుదురు. "స్వోచ్చే సగ్రహే" అను పాఠముకూడ కలదు. కారకునకుచ్చరాశి ఇతరగ్రహములతోకూడియుండఁగ కారకస్థానమునుండి అష్టమద్వాదశాధిపతులలో

నెవడు బలవంతుడో వాడే మహేశ్వర గ్రహమని చెప్పఁబడును. ఈపక్షమునందు మఱియొకవిధముగ నీగ్రహముకూడమహేశ్వరగ్రహమని చెప్పఁబడును.

సూ॥ పాతాభ్యాంయోగేస్వస్యతయోర్వారోగేతతః॥ ౪౮॥

వ్యా॥ ప్రకారాన్తరేణ మహేశ్వర మాహ॥ స్వస్యకారకస్య పాతాభ్యాం రాహుకేత్వో రన్యతరేణ యోగె త్రయాకారకా ద్రోగోఽష్టమె తయో రాహుకేత్వోర్వోగేవాసతి కారకా ద్ద్వ్యాదిప్రసిద్ధగణనయా తతః షష్ఠో గ్రహో మహేశ్వరో భవతి ద్విత్రాణాం మహేశ్వరాణాం సంభవేయో బలీ సఏవ మహేశ్వరస్స్యాదితి॥

టీ॥ స్వస్య=కారకునకు, పాతాభ్యాం = రాహుకేతువులతో, యోగే = సంబంధము కలుగుచుండగ, రోగే = అష్టమస్థానమందు, తయోర్వా=రాహుకేతువుల సంబంధముకలిగియుండగ, తతః=ఆఆవ గ్రహము మహేశ్వరగ్రహమని చెప్పఁబడును.

తా॥ మఱియొకవిధముగ మహేశ్వరగ్రహమును జెప్పుచున్నాడు. కారకునకు రాహు కేతువులలో నెవరితోనైనను సంబంధముండిన మహేశ్వరగ్రహమగును లేక కారకునకు నష్టమస్థానమందు రాహు కేతువులలో నెవరైనయుండినను ఆఆవగ్రహము మహేశ్వరగ్రహమగును. అనఁగా సూర్యుఁడుమొదలగు వరుసగజెప్పఁబడిన తొమ్మిది గ్రహములలో నేది కారకగ్రహమగునో యది మొదలుగ నారవ గ్రహము మహేశ్వరగ్రహమని చెప్పఁబడుచున్నది. రెండు మూడు గ్రహములకు మహేశ్వరగ్రహలక్షణములు కలిగినయెడల వారిలో నధికబలముకలవాడే మహేశ్వరగ్రహమని చెప్పఁబడును.

సూ॥ ప్రభుభావవైరిశప్రాణే పిత్రులాభప్రాణ్యానచరోవిషమస్థో బ్రహ్మా॥ ౪౭॥

వ్యా॥ అథ బ్రహ్మగ్రహ మాహ॥ పిత్రులాభప్రాణేతి సూత్ర మధ్యేస్థితత్వా ద్దేహలీ దీపకన్యాయేన లగ్నసప్తమయో ర్యో బలవదాత్రి స్తస్మాత్ షష్ఠాష్టమ ద్వాదశరాశిస్వామినాం మధ్యే యో బలవాన్భవే ద్విలగ్నతత్సప్తమరాశ్యోర్మధ్యేయో బలవదాత్రి స్తత్పుష్ఠగ

శ్చ సమేషమిథునాది విషమరాశిగతస్స్యాత్ సఏవగ్రహో బ్రహ్మా భవతీతి లగ్నస్య పృష్ఠరాశయ స్సప్తమాదిద్వాదశాన్తాః సప్తమస్య పృష్ఠరాశయో లగ్నాదిషష్ఠాన్తాబోధ్యాః॥

టీ॥ ప్రభుభావవైరీశపాణీ = షష్టాష్టమ ద్వాదశాధిపతులలో బలముకలవాడుగాని, పితృలాభపాణీ=లగ్నసప్తమస్థానాధిపతులలో బలముకలవాడుగాని, అనచరః=పృష్ఠరాశియందును, విషమస్థః=విషమరాశియందు నున్నవాడును, బ్రహ్మ = బ్రహ్మగ్రహమని చెప్పఁబడును.

తా॥ ఇప్పుడు బ్రహ్మ గ్రహము గుఱించి చెప్పుచున్నాడు. "పితృలాభపాణీ" అని సూత్రములో నడుమను జెప్పుటచే దేహలీదీపకన్యాయముగ రెండువిధములుగాను అన్వయించుచున్నది. కాఁబట్టి లగ్నసప్తమస్థానములలో బలముగలరాశి యేదియో దానికిషష్టాష్టమ ద్వాదశస్థానరాసులకు నధిపతులగు వారిలో బలవంతుడైనవాడును లగ్నసప్తమరాసులలో నేది బలముగలరాశియగునో దానికి పృష్ఠరాశియైన (మేషము మిథునము మొదలగు) విషమరాశియందున్నవాడును బ్రహ్మగ్రహమని చెప్పఁబడును. ఏడవరాశి మొదలు పండ్రెండవ రాశిపర్యంతము లగ్నమునకు పృష్ఠరాసులనియును లగ్నము మొదలాఱవరాశిపర్యంతము సప్తమమునకు పృష్ఠరాసులనియు తెలిసికొనఁదగియున్నది.

సూ॥ బ్రహ్మణిశనౌపాతయోర్వాతతః॥ ౮౮॥

వ్యా॥ ప్రకారాన్తరేణ బ్రహ్మాణమాహ॥ శనౌ బ్రహ్మణి బ్రహ్మలక్షణాక్రాన్తే సతి పాతయో రాహుకేత్వోర్వా బ్రహ్మణోఽనతో స్తస్మాచ్ఛనేరాహోః కేతోర్వా తతష్షష్ఠోగ్రహో బ్రహ్మభవతీత్యర్థః నతు బ్రహ్మలక్షణాక్రాన్తతయా ప్రసక్తః శన్యాదిర్బ్రహ్మస్యాత్॥

టీ॥ శనౌ=శని, బ్రహ్మణి=బ్రహ్మలక్షణములుకలవాడై యుండగాను, పాతయోర్వా = రాహుకేతువులకును అట్టిలక్షణములుకలిగియుండగాను, తతః=ఆఱవగ్రహము బ్రహ్మగ్రహము.

తా॥ మఱియొకవిధముగ బ్రహ్మలక్షణమును జెప్పుచున్నాడు. శనికిగాని రాహుకేతువులకుగాని బ్రహ్మలక్షణములు కలుగుచుండగా నాశనిరాహుకేతువులలో నెవరికైన నాఅవస్థానమందున్న గ్రహము బ్రహ్మగ్రహమని చెప్పఁబడును. సూత్రములో చెప్పఁబడిన పదార్థ ప్రకారము శనిరాహుకేతువులకే బ్రహ్మత్వము చెప్పినట్లున్నదిగాని ఆవిధముకాదు. బ్రహ్మత్వలక్షణము వారికికలిగినయెడల వారికి నారవ గ్రహమునకు బ్రహ్మత్వగ్రహసిద్ధికలుగునని సూత్రకారుల యభిప్రాయముగ దెలిసికొనవలయును.

సూ॥ బహునాంయోగే స్వజాతీయః॥ ౪౯॥

వ్యా॥ బహూనాం బ్రహ్మలక్షణాక్రాన్తత్వే కతమో బ్రహ్మ స్యాదిత్యాశంకాయామాహ॥ బహూనాం గ్రహాణాం బ్రహ్మయోగె సతి స్వజాతీయః కారకజాతీయోధికాంశకో బ్రహ్మస్యాదిత్యర్థః॥

టీ॥ బహూనాం=అనేకగ్రహములకు, యోగే=బ్రహ్మత్వము కలుగుచుండగ, స్వజాతీయః=కారకజాతీయమైనగ్రహమునకు బ్రహ్మత్వము చెప్పవలెను.

తా॥ అనేకగ్రహములకు బ్రహ్మత్వసిద్ధికలుగుచుండగ కారకజాతీయగ్రహము అధికాంశకలది కాఁబట్టి దానినే బ్రహ్మత్వముగల గ్రహమని చెప్పవలయును.

సూ॥ రాహుయోగేవిపరీతమ్॥ ౫౦॥

వ్యా॥ అత్రైవ విశేషమాహ॥ రాహోర్బ్రహ్మణా సహ సంయోగె సతి విపరీతం బహూనాం బ్రహ్మణాం మధ్యేయో న్యూనాం శకస్సఏవ బ్రహ్మస్యాత్ శని రాహు కేతూనాం తతఇత్యుక్త్యా బ్రహ్మత్వాభావాత్ బ్రహ్మత్వే సతి తు రాహోర్బ్రహ్మత్వయోగే రాహుర్న్యూనాంశశ్చేద్బ్రహ్మస్యాదిత్యర్థస్స్యాదితి॥

టీ॥ రాహుయోగే=రాహువుతోసంయోగముకలిగినయెడల, విపరీతం=వ్యతిరేకమగును.

తా॥ దీనిలో విశేషమును జెప్పుచున్నాడు. బ్రహ్మగ్రహమునకు రాహువుతో సంబంధమున్నయెడల విపరీతమగును. అనఁగాననేక

గ్రహములకు బ్రహ్మత్వము సంభవించియున్నప్పుడు వారితోకూడ రాహువు కలిసియున్నయెడల విలోమగతికల రాహువుమాత్రిము తక్కువ అంశలు కలిగినచో బ్రహ్మగ్రహమగును. తదితరగ్రహముల విషయమై యధికాంశమునే విచారింపఁదగియున్నది.

సూ॥ బ్రహ్మస్వభావేశోభావస్థః॥ ౫౦॥

వ్యా॥ పునః ప్రకారాన్తరేణ బ్రిహ్మాణ మాహ॥ కారకాదష్టమేశః కారకదష్టమస్థశ్చగ్రిహో బ్రిహ్మాస్యాత్ యత్తు అష్టమేశత్వే సత్యష్టమరాశిగతత్వ మేవ బ్రిహ్మత్వే ప్రియోజకత్వ మితి మతం తన్నతయా సతి వివాదప్రసక్త్యభావే నైతత్సూత్ర మనన్వితం స్యాత్ నహ్యేతత్పూర్వాన్వితం వ్యవహితత్వాత్ గ్రింథాస్వారస్య ప్రిసక్తేః బహూనా మితిసూత్రేణైవ శంకాయాః ఉపక్షీణత్వా చ్చేతి అష్టమేశాష్టమస్థయో రేకత్వే నిర్వివాదం బ్రహ్మత్వం॥

టీ॥ స్వభావేశః=అష్టమస్థానాధిపతి, భావస్థః=అష్టమమందుండినయెడల, బ్రిహ్మ=బ్రిహ్మగ్రిహమగును.

తా॥ బ్రిహ్మగ్రహమును తిరిగి మరియొక విధముగ జెప్పుచున్నాడు. కారకస్థానమునకష్టమస్థానాధిపతియు కారకమునకష్టమస్థానమందున్న గ్రిహమును బ్రహ్మగ్రిహమని చెప్పబడును. మరియు అష్టమాధిపతి అష్టమస్థానమందు నున్నయెడల బ్రహ్మత్వముకలుగునని కొందరు చెప్పిరిగాని యదిసరియైనదికాదు. అట్లు చెప్పినయెడల వివాదాంశమేమియులేదు కావున నీసూత్రము జెప్పనక్కఱలేదు. వెనుకటి సూత్రములతో సంబంధముండునని చెప్పినయెడల నీ సూత్రిమునకు సంబంధముగల సూత్రిములకును వ్యవధికలదు అందుచేగ్రంథమునకు స్వారస్యముకూడ సంభవింపదు. అట్లుకాక యితర సంశయ నివారణ కొరకు చెప్పబడినదనినయెడల "బహూనాం" అనెడు సూత్రమువల్లనే యితర సందేహములు నివృత్తియగును. ఒకనినిగురించియే అష్టమ రాశ్యధిపతియని అష్టమస్థానమందునున్నవాడనియు చెప్పిన యీ సూత్రిమనవసరము కావున నిది వివాదాంశ సంశయముకొరకు చెప్పఁబడినది.

సూ॥ వివాదేబలీ॥ ౫౨॥

వ్యా॥ తయోర్ద్వయోర్బ్రహ్మత్వేతు కతమో భవేదిత్యత్రాహ॥ వివాదే ద్వయోర్బ్రహ్మత్వేసతి యోబలీ సఏవ బ్రహ్మాస్యాత్ అథవా సర్వేషు బ్రహ్మాసు సమానాంశవత్సుయో గ్రహోత్సగ్రహ ఇత్యాదినా బలీ స బ్రహ్మాభవతీత్యర్థః॥

టీ॥ వివాదే=సంశయమందు, బలీ=బలముగలగ్రహము బ్రహ్మా గ్రహమని చెప్పఁబడును.

తా॥ రెండుగ్రహములకును బ్రహ్మత్వముకలిగినప్పుడు బలము గల గ్రహమునకు బ్రహ్మత్వము చెప్పవలయును. లేక అనేక గ్రహములకు సమానమగు బ్రహ్మత్వాశసంభవించియుండగ "యోగ్రహోత్సగ్రహః" యీమొదలగు ప్రమాణములచే బలముకలవానినే బ్రహ్మగ్రహముగ నిర్ధారణచేయువలయును.

సూ॥ బ్రహ్మణో యావన్మహేశ్వరర్క్షదశాంతమాయుః॥ ౫౩॥

వ్యా॥ అథ బ్రహ్మమహేశ్వరయోఫలమాహ॥ స్థిరదశాయాం బ్రహ్మగ్రహాశ్రితరాశిమారభ్య మహేశ్వరరాశిదశాపర్యన్తమాయుర్భవతీత్యర్థః॥

టీ॥ బ్రహ్మణఃయావత్=బ్రహ్మరాశిదశమొదలు, మహేశ్వరర్క్షదశాంతంయావత్=మహేశ్వరరాశి దశాపర్యంత మెంతకాలమగునో అంతకాలము, ఆయుః=ఆయుర్దాయమును్ందును.

తా॥ బ్రహ్మమహేశ్వరులయొక్క ఫలమును జెప్పుచున్నాడు. స్థిరరాశిదశను విచారించినప్పుడు బ్రహ్మగ్రహమే రాశియందుండునో ఆరాశిమొదలు మహేశ్వరగ్రహమాశ్రయించియున్న రాశిదశాపర్యంతమాయుర్దాయము కలుగునని చెప్పవలయును.

సూ॥ తత్రాపిమహేశ్వరభావేశత్రికోణాబ్దే॥ ౫౪॥

వ్యా॥ మహాదశాయాం నిధనాశ్రయీభూతా మన్తర్దశామాహ॥ తత్రాపి మహేశ్వరరాశ్రితరాశి మహాదశాయామపి మహేశ్వరాశ్రితరాశితోఽష్టమరాశినాథస్యాయ త్రిరకోణరాశిః ప్రథమపంచమనవమాత్మకో రాశిస్తస్యైకద్వ్యాత్మకోయో న్తర్దశాకాలం తత్రమృత్యు

స్యాత్ అబ్ద ఇతి ద్వాదశవర్షై స్తత్తద్రాశిదశేత్యభిప్రాయేణ న్యూనసంఖ్యాయా దశా సత్త్వేత్యబ్దతో న్యూన మన్తర్దశా సత్త్వేత్యబ్దతో న్యూనమన్తర్దశాస్వప్యేనేయమేవ॥

టీ॥ తత్రాపి = ఆమహాదశలోను, మహేశ్వరభావేశ త్రికోణాబ్దే=మహేశ్వరరాశికష్టమస్థానాధిపతియొక్క త్రికోణరాసులయంతర్దశాసంవత్సరములయందు మరణముకలుగును.

తా॥ మహాదశలో నేయంతర్దశయందు మరణము కలుగునది యు జెప్పుచున్నాడు. మహేశ్వరగ్రహ మాశ్రయించియున్న రాశి మహాదశలోను మహేశ్వరగ్రహమున్న రాశికి యేఅష్టమరాశికలదో ఆరాశ్యపతికి త్రికోణస్థానరాసులగు ప్రథమ పంచమ నవమ రాసుల యంతర్దశాకాలములోమరణముకలుగును. "ద్వాదశవర్షైస్తత్తద్రాశి దశా" అని చెప్పఁబడిన ప్రకారమే రాశికెంత మహాదశ చెప్పబడినదో ఆయామహాదశలలో నొక్కొక్క మహాదశతో నన్నిరాసుల యంతర్దశలు జరుగును కాఁబట్టి యంతర్దశాసంవత్సరములను నిర్ధారణచేసిచెప్పవలయును.

సూ॥ స్వకర్మచిత్తరిపురోగనాథప్రాణీమారకః॥ ౫౨॥

వ్యా॥ అథ సూత్రద్వయేన మారకగ్రహం లక్షయతి చిత్తనాథః ప్రాయేణ స్వస్మాదాత్మకారకా త్తృతీయ షష్ఠద్వాదశాష్టమేశానాం మధ్యే యో బలవాన్ సమారకగ్రహ ఇత్యర్థః సర్వేషాం సమబలత్వే సర్వేపిమారకాస్స్యుః బహూనాం మారకత్వే కస్యాం దశాయాం నిధనమిత్యాశంకాయా మల్ప మధ్య దీర్ఘాయుషాంయత్ర యత్రయస్య సమ్భవ స్త ద్రాశిదశాయాం నిధన మిత్యర్థః షష్ఠేశస్తు ప్రాయేణ ముఖ్యతయా మారక ఇత్యర్థః అత్ర వృద్ధై రప్యుక్తం॥

శ్లో॥ షష్ఠాష్టమేశౌభవతో మారకావష్టమేశ్వరః। ప్రాయేణమారకో రాశి దశాస్వత్రావిశేషతః। షష్ఠమెపాపభూయిష్ఠే షష్ఠేశోముఖ్యమారకః। షష్ఠాత్త్రికోణగోవాపి ముఖ్యమారకఇష్యతే। మధ్యాయుషి మృతిష్షష్ఠ దశాయామష్టమస్యవా। షష్ఠత్రికోణస్యపునః దీర్ఘాదల్పవిషమెథవేత్। షష్ఠేబలయుతేతస్య త్రికోణేమృతిమాదిశేత్। షష్ఠే

శ్చేద్బలాఢ్యస్యాస్య త్రికోణేమృతింవదేత్॥ ఇతి శ్లో॥ వ్యవస్థేయం సమస్తాపి కారకాదిదశాస్వపి। బలినఃశుక్రశశినో గ్రాహ్యాంపష్టాష్టమాదికం॥ శ్లోకాః స్పష్టార్థాః॥

టీ॥ స్వకర్మచిత్తరిపురోగనాథప్రాణీ = కారకస్థానమునకు తృతీయషష్ఠద్వాదశాష్టమస్థానములకధిపతులలో బలముకలవాఁడు, మారకః=మారకగ్రహమగును.

తా॥ ఇప్పుడు రెండుసూత్రములచే మారకగ్రహమును జెప్పుచున్నాఁడు. ఆత్మకారకస్థానమునకు తృతీయషష్ఠద్వాదశాష్టమ రాసులేవికలవో ఆరాసులకు నధిపతులగు వారిలో బలముగల గ్రహము మారకగ్రహమగును. అందరికిని సమానబలమేయున్న యెడల అందరును మారకగ్రహములేయగుదురు. అందరును మారకులైనప్పుడు అల్పమధ్యదీర్ఘాయుర్దాయములలో నెక్కడెక్కడ నెవనికి సంబంధము కలదో అక్కడ వానిదశలో మరణము కలుగునని యర్థము. ముఖ్యముగ షష్ఠాధిపతి తరుచుగ మారకుఁడగును ఇందునుగురించి వృద్ధుల వచనము- శ్లో॥ షష్ఠాష్టమేశౌభవతో మారకావష్టమేశ్వరః ప్రాయేణ మారకోరాశి దశాస్వతాత్రివిశేషతః। షష్ఠమేపాపభూయిష్ఠే.షష్ఠేశో ముఖ్యమారకః। షష్ఠాత్రికోణగోవాపి ముఖ్యమారకఇష్యతే। మధ్యాయుషిమృతిష్షష్ట దశాయాంమష్టమస్యవా। షష్ఠత్రికోణస్యపునర్దీర్ఘాల్పవిషయేథవేత్ । షష్ఠేబలయుతేతస్య త్రికోణేమృతిమాదిశేత్ । షష్ఠేశశ్చేద్బలాఢ్యస్యాస్య త్రత్రికోణేమృతింవదేత్ ॥ అనఁగా షష్ఠాధిపతియు సప్తమాధిపతియుమారకులు. తరుచుగ సప్తమాధిపతి మారకుఁడగును కాబట్టివారివారిదశలలోమారకమునుకలుగజేయుదురు. ఆరవరాశి విశేషపాపగ్రహములతోఁగూడియుండినయెడల నారాశికి నధిపతియగుగ్రహముముఖ్యమారకుఁడగును ఆరవస్థానమునకుద్రికోణములగు రాసులయందునున్నవాఁడును ముఖ్యమారకుఁడు. మరియు షష్ఠాధిపతి దశయందుగాని అష్టమాధిపతిదశయందుగాని మధ్యాయువుగలవాని యొక్క మరణమును జెప్పవలయును. షష్ఠాధిపతియొక్కయు త్రికోణస్థానాధిపతులయొక్కయు దశలయందు దీర్ఘాయువుగలవారియొక్క

యు నల్పాయువుగల వారియొక్కయు మరణమును జెప్పవలయును. షష్ఠస్థానము బలముకలదియగునేని దానికి త్రికోణరాసులదశలయందు మరణమును జెప్పవలయును. షష్ఠాధిపతియు బలముకలవాడగునేని ఆరాశికి త్రికోణరాసుల అధిపతిమారకుడగును కాఁబట్టి వాని దశలో మరణమును జెప్పవలయును- శ్లో॥ వ్యవస్థేయంసమస్తాపికారకాదిదశాస్వపి। బలినశ్శుక్రశశినో గ్రాహ్యాంషష్ఠాష్టమాదికం ॥ ఇట్లు మారక విషయమై కారకత్వమందుగాని దశలయందుగాని అందరికిని సమానముగానే నున్నప్పుడు షష్ఠాష్టమాదిస్థితి కలిగియున్న శుక్రుడును చంద్రుడును మారకత్వమున బలవంతులే కావున వారినిగూర్చియు విచారింపవలయునని వృద్ధులుచెప్పిరి.

సూ॥ తదృక్షదశాయాంనిధనమ్॥ ౨౬॥

వ్యా॥ మారకస్యఫలమాహ॥ మారకగ్రహాశ్రితస్య మారకస్వామికస్య వా మహాదశాయాం చరస్థిరాది రూపాయాం నిధనంస్యాదిత్యర్థః॥

టీ॥ తదృక్షదశాయాం=ఆరాశిదశయందు, నిధనం=మరణము కలుగును.

తా॥ మారకగ్రహముయొక్క దశయందుగాని ఆ మారక గ్రహముండిన రాశిదశయందుగాని చరస్థిరద్విస్వభావ రాసుల నను సరించి మరణము కలుగును గావున మరణమునుగురించి రాసులస్వభావమును గ్రహింపవలయుననిరి.

సూ॥ తత్రాపికాలాదిపురోగచిత్తనాథాపహారే॥ ౨౭॥

వ్యా॥ మారకమహాదశాయాం నిధనాశ్రయీభూతా మన్తర్దశామాహ॥ తత్రాపి మారకగ్రహదశాయా మపి కాలా త్కారక సప్తమా ద్వాదశాష్టమషష్ఠేశానా మన్తర్దశాయాంనిధనంస్యాదిత్యర్థః ఏషాం మధ్యే బలవ తేన్తర్దశాయాం నిధన మితి వివేచనీయం అత్ర విశేషోవృద్ధై రుక్తః ॥ శ్లో॥ చరేచరస్థిరద్వన్ద్వా ఇతియోరాశిరాగతః। సఏవమారకోరాశి ర్భవతీతివినిర్ణయః । బహురాశిసమావేశే బలవాన్మారకస్స్మృతః ॥ ఇతి అయమర్థః పిత్రాదినేశాది ద్వికానామాశ్రయా

భూతో యో రాశిస్సమారకస్తే రాశయో యది బహావస్తర్హి అగ్నిహోత్రగ్రహా ఇత్యాదిబలేన యో రాశిర్బలవాన్సమారకస్తద్రాశిదశాయాం తదీశాశ్రియరాశిదశాయాం వా మృతి రితి అపరేతు॥ శ్లో॥ చరఇత్యాదినాయుర్య స్తత్సమానస్వాజితోభవేత్। యోరాశిస్స తువిజ్ఞేయో మారకస్సూత్రసమ్మతః॥ ఇతి చర ఇత్యాదిశ్లోకేన యద్దీర్ఘాద్యాయుః సమాగతం పూర్వమిత్యాదినా స్పష్టీకృతం తదాయుర్యద్రాశౌ సమాప్తం తద్రాశిరేవ మారక ఇత్యర్థః॥

టీ॥ తత్రాపి=మారకగ్రహదశయందును, కాలాత్=కారకుని సప్తమస్థానమునుండి, రిపురోగచిత్తనాథావహారే=ద్వాదశాష్టమషష్ఠస్థానాధిపతులయొక్క అంతర్దశలోను మారకముకలుగును.

తా॥ మారకగ్రహ మహాదశలో నెవనియంతర్దశయందు మరణము కలుగునదియు జెప్పుచున్నాఁడు. కారకునకు సప్తమస్థానము నుండి ద్వాదశాష్టమ షష్ఠరాసులకు నధిపతులగువారి యంతర్దశలో మరణము జరుగును. ద్వాదశాష్టమషష్ఠాధిపతులలో బలముకలవాని యొక్క యంతర్దశలో మారకము కలుగునని తెలిసికొనవలయును. ఈవిషయములో వృద్ధులు చెప్పిన విశేషమేమనఁగా- శ్లో॥ చరేచరస్థిర ద్వంద్వా ఇతియోరాశిరాగతః। సఏవమారకోరాశి ర్భవతీతివినిర్ణయః। బహురాశిసమావేశే బలవాన్మారకస్మృతః॥ అనఁగా "చరేచరస్థిర ద్వంద్వాః" అనునట్టి ప్రమాణానుసారముగ వెనుక దెల్పఁబడిన ప్రస్తారచక్రమునననుసరించి యేరాశియగునో అదియే మారకరాశిగ నిర్ణయింపఁదగినది. ఇట్లనేక రాసులు వచ్చినయెడల వానిలో బలముగల రాశియని చెప్పఁదగినది కాఁబట్టి లగ్నాష్టమములు మొదలగు రెండేసి రాసులకు నాశ్రియభూతమైన రాశియే మారకరాశియగును. అట్టి రాసులు బహురాసులైనయెడల "అగ్నిహోత్రగ్రహః" అను ప్రమాణప్రకారము గ్రహములు లేని రాశికంటె గ్రహములున్న రాశి బలముకలది కాఁబట్టి అట్టిబలముగలరాశియేమారకరాశియగును అందువలన నారాశిదశయందుగాని ఆరాశీశ్వరుఁడున్న రాశిదశయందు

గాని మరణము కలుగుననిచెప్పినందుకు మఱికొందరు చెప్పినదేమనగా..
శ్లో॥ చరఇత్యాదినాయుర్యత్ర త్సమాప్యుచితోభవేత్। యేరాశిస్సతు విజ్ఞేయో మారకసూత్రసంమతః ॥ అనఁగా "చరేచరస్థిరద్వంద్వాః" అను శ్లోకానుసారముగ చెప్పఁబడిన దీర్ఘమధ్యాల్పాయుర్దాయమే రాశియందు సమాప్తమగునో అదియే మారకరాశియని మఱికొందరు జ్యోతిశాస్త్రవేత్తలు నిర్ణయించిరి.

ఇతి శ్రీ నీలకంఠ జ్యోతిర్విద్విరచితాయాం
జైమినీ సూత్రవ్యాఖ్యాయాం
సుబోధిన్యాం ద్వితీయాధ్యాయస్య
ప్రథమపాదః॥



# అథ ద్వితీయోధ్యాయః.

## ద్వితీయః పాదః.

సూ॥ రవిశుక్రయోఃప్రాణీజనకః॥ ౧॥

వ్యా॥ పిత్రాదీనాం నిధనకాలం బోధయితుం పిత్రాదికారక ముపదిశతి ॥ సూర్యభార్గవయో ర్మధ్యే యో బలవాన్ సపితృకారక స్స్యాత్ ॥

టీ॥ రవిశుక్రయోః=సూర్యశుక్రులలో, ప్రాణీ = బలముకల వాఁడు, జనకః=పితృకారకుఁడగును.

తా॥ తండ్రి మొదలగు వారియొక్కయు మరణకాలమును దెలియపరచుటకు పితృకారకాది గ్రహములనుగుఱించి చెప్పుచున్నాడు సూర్యశుక్రులలో బలముకలవాడు పితృకారకుఁడగును.

సూ॥ చంద్రారయోర్జననీ॥ ౨॥

వ్యా॥ చన్ద్రభౌమయోర్మధ్యేబలీ సమాతృకారకః॥

తా॥ చంద్రాంగారకులలో బలముకలవాడు మాతృకారకుడగును.

సూ॥ అప్రాణ్యపిపాపదృష్టః॥ ౩॥

వ్యా॥ రవిశుక్రయో శ్చంద్రారయోశ్చ మధ్యేయో నిర్బలః సోపి పాపగ్రహదృష్టశ్చే ద్యథాక్రమం పితృమాతృకారకతాంలభతే॥

టీ॥ అప్రాణ్యపి=బలములేనివాడైనను, పాపదృష్టః=పాపగ్రహముచే జూడఁబడినవాడు కారకుడగును.

తా॥ పితృకారకులగు రవిశుక్రులలోను మాతృకారకులగు చంద్రాంగారకులలోను దుర్బలగ్రహము పాపగ్రహములచే జూడఁబడినయెడల రవిశుక్రులైతే పితృమారకమును చంద్రాంగారకులైతే మాతృమారకమును జేయుదురని యభిప్రాయము.

సూ॥ ప్రాణినిశుభదృష్టేతచ్ఛూలేనిధనం మాతాపిత్రోః॥ ౪॥

వ్యా॥ అథ ప్రాణిపిత్రాదికారకస్య ఫలమాహ ॥ పితృకారకే మాతృకారకేవా ప్రాణిని శుభదృష్టే సతి పితృమాతృకారకాశ్రితరాశి త్రికోణదశాయాం పితుర్మాతుశ్చ మరణం జ్ఞేయం॥

టీ॥ ప్రాణిని=బలముగలగ్రహము, శుభదృష్టే = శుభగ్రహముచే జూడఁబడుచుండగ, తచ్ఛూలే = ఆకారకగ్రహముయొక్క శూలదశయందు, మాతాపిత్రోః = తల్లిదండ్రులయొక్క, నిధనం= మరణముసంభవించును.

తా॥ పితృకారకుఁడుగానిమాతృకారకుఁడుగానిబలముకలవాఁడై శుభగ్రహముచే జూడఁబడినయెడల ఆ పితృమాతృకారకులున్న రాశికి త్రికోణరాసులదశయందు తండ్రియొక్కయు తల్లియొక్కయు మరణము సంభవించును॥

సూ॥ తద్భావేశేస్పష్టబలే॥ ౫॥

వ్యా॥ ద్వివిధకారకస్య ఫలమాహ స్పష్టం॥

సూ॥ తచ్ఛూలఇత్యన్యే॥ ౬॥

వ్యా॥ తస్యాం ప్రాణ్యప్రాణి కారకాభ్యాం భావే శేష్టమేశే పితృమాతృకారకాస్పష్టఫలేఽధికబలే సత్యష్టమేశాశ్రితరాశిత్రికోణరాశిదశాయాం నిధనం భవతీత్యనేప్రాహుః అధికబల ఇతివక్తవ్యే స్పష్టబల ఇత్యుక్త్యాంశాధిక్య బలమత్రగ్రాహ్యం॥

టీ॥ తద్భావేశే=ఆకారకులకు నష్టమాధిపతి, స్పష్టబలే=అధిక బలముకలవాడగుచుండగాను, తచ్ఛూలే = ఆయష్టమాధిపతియున్న రాశికి త్రికోణరాసులయందు నిధనమని, అన్యే=ఇతరులుచెప్పిరి.

తా॥ బలముకలవానికిగాని బలములేనివానికిగాని కారకగ్రహమునకు అష్టమాధిపతిబలము విశేషముగా కలవాడగునేని వానిదశయందు మరణము కలుగును. ఆయష్టమాధిపతియు బలములేనివాఁడైన యెడల నతడున్నరాశికి త్రికోణరాసులదశలయందునిధనముకలుగునని తెలియవలయును.

సూ॥ ఆయుషిచాన్యత్ ॥ ౭॥

వ్యా॥ పిత్రాదీనామాయుషి విచారణీయేఽన్యచ్చతత్తత్కార కం పరికారాన్తరోక్త నిర్యాణశూలదశాదికం విచార్యమిత్యర్థః॥

టీ॥ ఆయుషి=ఆయువునందు, అన్యత్ =ఇతరవిధము,

తా॥ తండ్రి మొదలగువారి ఆయుర్దాయ విచారణయందు ఆయాకారకములను మఱియొకవిధముగ జెప్పఁబడిన శూలదశాదులను విచారించి చెప్పవలయును.

సూ॥ అర్కజ్ఞయోగే తదాశ్రయె లగ్నమేషదశాయాం పితు రిత్యేకే॥ ౮॥

వ్యా॥ పితృనిధనే విశేషమాహ॥ క్రియె లగ్నాత్ ద్వాదశరాశౌ తదాశ్రయే ర్క బుధాశ్రయె సింహ మిథున కన్యాన్యతరరాశి సత్వేఽర్కజ్ఞయోగె సూర్యబుధయో ర్యోగే సతి లగ్నమేష దశాయాం పితు ర్నిధనం స్యా దిత్యేకే వదన్తి లగ్నె ఇతి పాఠె తు క్రియె మేషరాశౌ రవిజ్ఞయోగాశ్రయె లగ్నె సతి మేషస్య దశాయాం పితు ర్నిధనమిత్యర్థః॥

టీ॥ అర్కజ్ఞయోగే=సూర్యబుధులయొక్క కూడికకలిగియుండగా, తదాశ్రియే = ఆసూర్యబుధులయొక్క స్థితి కలిగియుండగాను, లగ్నమేషదశాయాం=లగ్నమునకు అయిదవరాశియొక్క దశయందు, పితుః=తండ్రికి, నిధనమితి=మరణమని. ఏకే=కొందరనిరి.

తా॥ తండ్రియొక్క మరణమునందు విశేషమును జెప్పుచున్నాడు. మేషము లగ్నమునకు పండ్రెండవరాశియైయుండి సూర్యుడును బుధుడును సింహ కన్యా మిథున రాసులలో దేనియందైన నిద్దరు కూడి యుండగా లగ్నమునకు అయిదవరాశిదశలో తండ్రికి మరణము కలుగునని కొందరుచెప్పిరి "లగ్నే" అను పాఠమునందు సూర్యబుధులతో మేషరాశి కూడినదై లగ్నమైయుండినయెడల ఆ మేషరాశిదశయందే మరణమని తెలిసికొనవలయును.

సూ॥ వ్యర్కపాపమాత్రి దృష్టయోః పిత్రోః పాద్ద్వాదశాబ్దాత్ ॥ ౯॥

వ్యా॥ అథ బాల్య ఏవ మాతా పిత్రోర్మరణయోగ మాహ॥ పిత్రోః మాతాపితృకారకయోః పాపినో రపాపినోర్వా రవిరహిత పాపమాత్రేణ దృష్టయోః సతోర్ద్వాదశాబ్దా త్పూర్వ మేవ మాతా పిత్రోర్వ్యధాక్రమం నిధనంభవతి రవిశుభదృష్టౌనాయంయోగ ఇతి॥

టీ॥ పిత్రోః=మాతాపితృకారకగ్రహములు, వ్యర్క-పాపమాత్రదృష్టయోః=సూర్యుఁడుగాక యితర పాపగ్రహములచే జూడఁబడుచుండగ, ద్వాదశాబ్దాత్=పండ్రెండుసంవత్సరములకంటె, ప్రాక్=పూర్వము మరణముకలుగును.

తా॥ మాతాపితృకారకులు బలముకలవాడైనను బలములేనివాడైనను సూర్యుఁడుగాక యితరపాపగ్రహములచేజూడఁబడినయెడల పండ్రెండు సంవత్సరములకు పూర్వమేగ్రహయోగప్రకారము తల్లిదండ్రులకు మరణముకలుగును. అయితే సూర్యుడుగాని శుభగ్రహములుగాని చూచినయెడల ఆయోగము కలుగదు.

సూ॥ గురుశూలేకళత్రస్య॥ ౧౦॥

వ్యా॥ స్త్రీనిధన మాహ॥ గుర్వాశ్రితరాశి త్రికోణదశాయాం పత్నీనిధనంస్యాత్॥

టీ॥ గురుశూలే=గురుశూలదశయందు, కళత్రస్య = భార్యకు మరణము.

తా॥ బృహస్పతియున్నరాశికి త్రికోణరాశిదశయందుభార్యకు మరణముకలుగును.

సూ॥ తత్తచ్ఛూలేతేషామ్॥ ౧౧॥

వ్యా॥ ఏవ మన్యేషా మపి నిధన మాహ ॥ పుత్రమాతులాది కారకరాశే స్త్రికోణదశాయాం పుత్రమాతులాదే ర్నిధనమిత్యర్థః॥

టీ॥ తత్తచ్ఛూలే=ఆయాశూలదశయందు, తేషాం=వారలకు మరణము.

తా॥ ఈప్రకారముగానే కుమారుఁడు మేనమామ మొదలగు వారికిని వారివారి కారకస్థానములనుబట్టి వారివారినిధనములను తెలిసికొనవలయును.

సూ॥ కర్మణి పాపయుతదృష్టే దుష్టంమరణమ్॥ ౧౨॥

వ్యా॥ మరణె శుభాశుభభేదం దర్శయతిసూత్రే) లగ్నాత్కా రకాద్వా తృతీయె పాపేనయుతె దృష్టేవా దుష్టం మరణం భవతి॥

టీ॥ కర్మణి=తృతీయస్థానము, పాపయుతదృష్టే = పాపగ్రిహములతో కూడినను చూడబడినను, దుష్టంమరణం=దుర్మ్మరణమగును.

తా॥ లగ్నమునకుగాని కారకమునకుగాని తృతీయ స్థానము పాపగ్రిహముతో కూడినను చూడఁబడినను జలముసర్పము మొదలగు వానివలన దుర్మ్మరణముకలుగును.

సూ॥ శుభంశుభదృష్టియుతే॥ ౧౩॥

వ్యా॥ లగ్నాత్కారకాత్తృతీయె శుభేన యుక్తె దృష్టేవా శుభం మరణంస్యాత్ అగ్నిజలపాత బన్ధనాదిప్రయోజ్యం దుష్టమరణం జ్వరాదిరోగప్రయోజ్యం శుభముచ్యతె॥

టీ॥ శుభదృష్టియుతే=శుభగ్రిహములదృష్టిగాని స్థితిగానియుండినయెడల, శుభం=మంచిమరణము.

తా॥ లగ్నమునకుగాని కారకస్థానమునకుగాని తృతీయస్థానమునందు శుభగ్రహమున్నను లేకశుభునిచేజూడఁబడినను మంచిమరణము కలుగును. అనఁగా జ్వరము మొదలగు స్వభావసిద్ధమగు రోగములచే మృతినొందుట మంచిమరణమనియు అగ్నిజలసర్పాదులచే మృతినొందుట దుర్మ్మరణమనియు తెలిసికొనఁదగియున్నది.

సూ॥ మిశ్రేమిశ్రమ్॥ ౧౪॥

వ్యా॥ శుభపాపయోర్ద్వయోరపి దృష్టౌ యోగే వా శుభాశుభాత్మకం మరణమిత్యర్థః॥

టీ॥ మిశ్రే = శుభాశుభులు కలిసినయెడల, మిశ్రం = మిశ్రిమరణముకలుగును.

తా॥ ఆతృతీయస్థానము శుభులతోటి పాపులతోటి కూడియున్నను చూడఁబడినను మిశ్రమమరణము కలుగును,

సూ॥ ఆదిత్యేన రాజమూలాత్॥ ౧౫॥

వ్యా॥ మరణనిమిత్తాని దర్శయతి తృతీయె రవియోగె దృష్టౌ వా సత్యాం రాజహేతోర్మ్మరణమ్॥

టీ॥ ఆదిత్యేన=సూర్యునిచేత, రాజమూలాత్ = రాజులవల్ల కలుగును.

తా॥ తృతీయస్థానమందు సూర్యుడున్నను చూడఁబడినను ప్రభుమూలకముగ మృతినొందును.

సూ॥ చంద్రేణయక్ష్మణః॥ ౧౬॥

వ్యా॥ తృతీయె చంద్రేణయుతె దృష్టే వా యక్ష్మతః క్షయ రోగోన్మరణం॥

తా॥ తృతీయస్థానమందు చంద్రుడుండిన క్షయరోగమువలన మరణముకలుగును.

సూ॥ కుజేనవ్రణశస్త్రాగ్నిదాహాద్యైః॥ ౧౭॥

వ్యా॥ తృతీయె కుజేనయుతే దృష్టేవా వ్రణాదితో నిధనమ్॥

టీ॥ కుజేన=అంగారకునిచేత, వ్రణశస్త్రాగ్నిదాహాద్యైః=రణములు శస్త్రములు అగ్ని దహనము మొదలగువానివలన మరణము.

తా॥ తృతీయస్థానమునందు అంగారకుఁడున్నను చూచినను కురుపులు శస్త్రములు అగ్నిబాధ మొదలగువానివలన మరణము.

సూ॥ శనివాతరోగాత్॥ ౧౮॥

వ్యా॥ తృతీయె శనినాయుతె దృష్టేవా వాతరోగతోనిధనమ్॥

తా॥ తృతీయస్థానమందు శనియుండుటచే వాతరోగమువలన మరణముకలుగును.

సూ॥ మందమాందిభ్యాంవిషసర్పజలోద్బంధనాదిభిః॥ ౧౯॥

వ్యా॥ తృతీయె శని గులికాభ్యాం యుతే దృష్టే వా విషాదిభిర్మ్మరణం గులికస్య స్పష్టీకరణ మన్యత్రానుసంధేయం॥

టీ॥ మందమాందిభ్యాం=తృతీయస్థానమందు శనిగులిక గ్రహములుండినను చూచినను, విషసర్పజలోద్బంధనాదిభిః = విషము, సర్పము, జలము, ఉరి, మొదలగువానిచే మరణముకలుగును.

సూ॥ కేతునా విషూచీ జలరోగాద్యైః॥ ౨౦॥

వ్యా॥ తృతీయె కేతునా యుతె దృష్టే వా విషూచ్యాదితో మరణమ్॥

టీ॥ కేతునా=తృతీయస్థానమునందుండు కేతువుచేత, విషూచీ జలరోగాద్యైః=మశూచికము జలరోగము మొదలగువానిచే మరణము కలుగును.

సూ॥ చంద్రమాందిభ్యాం పూగ మదాన్న కబళాదిభిః క్షణి కమ్॥ ౨౧॥

వ్యా॥ తృతీయె చన్ద్రగులికాభ్యాం యుతె దృష్టేవా క్రముక మదాదినా సత్వరం మరణం॥

టీ॥ చంద్రమాందిభ్యాం=చంద్రుఁడు గుళికుఁడుయున్నయెడల, పూగమదాన్నకబలాదిభిః=పోకలరసము అన్నకబళము మొదలగువాని వలన, క్షణికం=క్షణములోనే మృతినొందును.

తా॥ తృతీయస్థానమునందు చంద్రుఁడు గుళికయు నుండినను చూచినను అన్నము భుజించునప్పుడు కబళము గొంతులో నడ్డపడుట వల్లనుగాని తాంబూలము వేసికొనినప్పుడు పోకచెక్కలయొక్క దుర్గుణముచేతనుగాని వెంటనే మృతినొందును.

సూ॥ గురుణాశోఫాఽరుచివమనాద్యైః॥ ౨౨॥

వ్యా॥ తృతీయె గురుణా యుతె దృష్టేవా శోఫాదిభిర్నిధనమ్॥

టీ॥ గురుణా = బృహస్పతిచేత, శోఫాఽరుచివమనాద్యైః= వాపు, అజీర్తి, వమనము, మొదలగువానిచేత మరణము.

తా॥ తృతీయస్థానమందు బృహస్పతియున్నను చూచినను వాపు అజీర్తి డోకు మొదలగు రోగములచే మృతినొందును.

సూ॥ శుక్రేణమేహాత్॥ ౨౩॥

వ్యా॥ తృతీయె శుక్రేణ యుతె దృష్టే వా ప్రమేహారోగా న్నిధనం॥

టీ॥ శుక్రేణ = తృతీయస్థానమునందు శుక్రుఁడుండుటచేతను చూచుటచేతను, మేహాత్ =మేహారోగమువలన మృతినొందును.

సూ॥ మిశ్రేమిశ్రాత్॥ ౨౮॥

వ్యా॥ తత్తద్రోగాణాం బహూనాం తృతీయె యోగ దర్శనే వాఽనేకరోగాన్నిధనమ్॥

టీ॥ మిశ్రే = గ్రహములు కలిసియుండిన, మిశ్రాత్ = అనేక మిశ్రరోగములవలన మరణము.

తా॥ తృతీయస్థానమునందు అనేక గ్రహములున్నను తృతీయ స్థానమును జూచినను అనేక విధములగు రోగములవలన మరణము కలుగును.

సూ॥ చంద్రదృగ్యోగాన్నిశ్చయేన॥ ౨౯॥

వ్యా॥ తృతీయె తత్తద్గ్రహయోగదర్శనసత్త్వే తత్రైవ చంద్రదృష్టియోగసత్త్వే తత్తద్రోగాన్నిశ్చయేన మరణం వక్తవ్య మిత్యర్థః॥ ఏతేన చంద్రదృగ్యోగాభావె తృతీయస్థానగే నాపి తత్తద్గ్రహేణ తత్తద్రోగమరణే సందేహ ఇతి ధ్వనితం॥

టీ॥ చంద్రదృగ్యోగాత్ = చంద్రదృష్టియోగమువలన, నిశ్చయేన = నిశ్చయముగ మరణముకలుగును.

తా॥ తృతీయస్థానమునందు ఆయాగ్రహములుండినపుడుగాని దృష్టికలిగినపుడుగాని ఆతృతీయస్థానమునకు చంద్రుఁడుచూచుచుండిన పైనచెప్పఁబడిన యోగములవలన మరణము రూఢికలుగునని తెలిసికొనవలెను.

సూ॥ శుభైశ్శుభేదేశే॥ ౩౦॥

వ్యా॥ అథ నిధనే దేశభేదం దర్శయతి సూత్రాభ్యాం స్పష్టం అత్రిబహుత్వ మవివక్షితం తృతీయె శుభదృగ్యోగ సత్త్వే శుభె దేశె పుణ్యభూమౌమరణమ్॥

టీ॥ శుభైః = శుభగ్రహములచే, శుభేదేశే = మంచిప్రదేశమునందు మృతికలుగును.

తా॥ తృతీయ స్థానమునకు శుభగ్రహ స్థితిగాని దృష్టిగాని యున్నయెడల కాశీరామేశ్వరాది పుణ్యభూములయందు మరణము కలుగును.

సూ॥ పాపైః కీకటె॥ ౨౭॥

వ్యా॥ పాపైస్తు కీకటె మగధాది పాపదేశే మరణ మిత్యర్థః శుభపాపోభయయోగే తు న కాశ్యాది శుభేన మగధాది పాపె దేశ ఇత్యర్థః॥

టీ॥ పాపైః=పాపగ్రిహములచే, కీకటె = అయోగ్యప్రదేశము నందు మరణముకలుగును.

తా॥ తృతీయస్థానమునకు పాపవీక్షణముగాని స్థితిగాని కలిగిన యెడల మగధదేశము మొదలగు కష్టప్రిదేశములయందు మరణము కలుగును. శుభులయొక్క పాపులయొక్క స్థితి దృష్టులసంబంధము కలిగినయెడల కాశి మొదలగు పుణ్యభూములయందుగాని మగధ మొదలగు కష్టప్రిదేశములయందుగాని మరణము కలుగదు. సమాన సుకృతదుష్కృతములుకలతావుననే మృతినొందును.

సూ॥ గురుశుక్రాభ్యాంజ్ఞానపూర్వమ్॥ ౨౮॥

వ్యా॥ తృతీయె జ్ఞానాజ్ఞానపూర్వకత్వమాహ॥ స్పష్టమ్॥

టీ॥ గురుశుక్రాభ్యాం=తృతీయస్థానమందు గురుశుక్రులుండుట చేతను జూచుటచేతను, జ్ఞానపూర్వం=జ్ఞానముకలిగి మృతినొందును.

సూ॥ అన్యైరన్యథా॥ ౨౯॥

వ్యా॥ లగ్నా త్కారకా త్తృతీయె గురుశుక్రాభ్యాం యుతె దృష్టేవా జ్ఞానపూర్వం మరణమ్ గురుశుక్రాతిరి క్తయోగదర్శనాభ్యా మజ్ఞానపూర్వంమరణం॥

టీ॥ అన్యైః = ఇతరులచేత, అన్యథా = దీనికివిపరీతవిధముగ జరుగును.

తా॥ లగ్నమునకుగాని కారకమునకుగాని తృతీయస్థానము నందు గురుశుక్రులున్నను తృతీయస్థానమును గురుశుక్రులుచూచినను జ్ఞానపూర్వకమగు మరణముకలుగునని నొకసూత్రిములో చెప్పఁబడి నది. ఇప్పుడు వారియుభయులకంటె నితరగ్రిహముల దృష్టిగాని స్థితి గాని కలిగిన అజ్ఞానపూర్వకమగు మరణము కలుగును.

సూ॥ లేపన జనకయో ర్మధ్యే శనిరాహుకేతుభిః పిత్రో ర్న సంస్కర్తా॥ ౩౦॥

వ్యా॥ ఫలాన్తరమాహ॥ లగ్నద్వాదశయోర్మధ్యేశనిరాహ్వోశ్శనికేత్వోర్వా స్థిత్యా మాతాపిత్రోః సంస్కర్తానస్యాత్॥

టీ॥ లేపనజనకయోర్మధ్యే = లగ్నద్వాదశములయందు, శనిరాహుకేతుభిః=శనిరాహువు కేతువుండుటచేత, పిత్రోః=తల్లిదండ్రులకు, నసంస్కర్తా=సంస్కారముచేయువాడుకాడు.

తా॥ లగ్నమందుగాని ద్వాదశమందుగానిశనియుండి వానితో రాహువైనను కేతువైనను కలిసియున్నయెడల తల్లిదండ్రులకు సంస్కారముచేయువాడుకాడు. అనఁగా వారికంటె ముందుగా మృతినొందుట గాని మరణసమయమునందు దూరదేశమునందుండుటగాని వర్ణసాంకర్యముగాని కారణములగును.

సూ॥ లేపాదిపూర్వార్ధేజనకాద్యపరార్ధే॥ ౩౧॥

వ్యా॥ లగ్నాద్వాదశమధ్యం ప్రకటయతి లగ్నాది పూర్వార్ధే లగ్నాదిప్రథమషట్కే ద్వాదశాద్యపరార్ధే ద్వాదశా ద్యుత్తరషట్కే శనిరాహు శనికేతుసత్వే మాతృపిత్రోః క్రిమాత్సంస్కర్తాన తథాచ లగ్నాదిషట్కే శనిరాహు శనికేతుసత్వే మాతు స్సంస్కర్తాన సప్తమాదిషట్కే శనిరాహు శనికేతు సత్వే పితుస్సంస్కర్తా నే తి ఫలితోర్థః శన్యాదిత్రికసత్వే ఇతి కుతోనోక్త మితి చేద్రాహుకేత్వోరేకస్థానస్థితేర్బాధత్వాన్నోక్తమితి॥

టీ॥ లేపాదిపూర్వార్ధే=లగ్నము మొదలు పూర్వార్ధమందును, జనకాద్యపరార్ధే=ద్వాదశములో నుత్తరభాగమందును.

తా॥ లగ్నద్వాదశములమధ్యను అని పూర్వము చెప్పఁబడినది. మధ్య అనఁగా యేమి అభిప్రాయమో వివరించుచున్నాఁడు. రాశిని పూర్వభాగమనియు నుత్తరభాగమనియు భాగమునకు ఆఱుయంశము లనియు విభాగించి లగ్నములో ప్రథమాంశము మొదలాఱుభాగముల పర్యంతము పూర్వార్ధమనియు ద్వాదశరాశిలో సప్తమాంశము

మొదలు ఆఖరువఱకు నుత్తరార్థమనియు చెప్పఁబడినది. దీనినే మొదటి యాఱుభాగములను పూర్వషట్కమనియు తర్వాత ఆఱు భాగములు నుత్తరషట్కమనియు చెప్పిరి. కాఁబట్టి లగ్నాదిపూర్వ భాగమునందు ద్వాదశరాశియొక్క యుత్తరభాగమునందును శని యుండి వానితో రాహువుగాని కేతువుగాని కలిసియున్నయెడల మాతాపితృలకు సంస్కర్తకాడు. అనఁగా లగ్నములోపూర్వభాగము నందు శనియుండగ వానితో రాహు కేతువులలో నెవరైన కలిసి యున్నయెడల తల్లికి సంస్కర్తకాడు. ద్వాదశరాశిలో నుత్తరభాగ మునందు శనియుండగ వానితో రాహుకేతువులలో నెవరైనను కలిసి యున్నయెడల తండ్రికి సంస్కర్తకాడని యభిప్రాయము. రాహు కేతువులు ఒకరాశియందు నెప్పుడునుండరు కాఁబట్టి వారిలో నొకరి తోటియే శనికి సంబంధము చెప్పఁబడినదని గ్రహింపవలయును.

సూ॥ శుభదృగ్యోగాన్న॥ 3౨॥

వ్యా॥ అపవాదమాహ॥ తత్ర లగ్నాదిద్వాదశాదిమధ్యే శుభ దృగ్యోగసత్వే పూర్వోక్తయోగో నస్యాత్కింతు పిత్రోస్సంస్కర్తా స్యాత్॥

టీ॥ శుభదృగ్యోగాత్ = శుభగ్రహ దృష్టి యోగము వలన, న=కాదు.

తా॥ అపవాదమును చెప్పుచున్నాఁడు. లగ్నాది పూర్వభాగ మందుగాని ద్వాదశరాశిలో నుత్తరభాగమందుగాని శనియుండి వానితో రాహుకేతువులలో నెవరైనను కలిసియుండినను ఆశనికి శుభగ్రహదృష్టి యుండినయెడల తల్లిదండ్రులకు సంస్కారము చేయు వాడగును.

ఇతి శ్రీ నీలకంఠ జ్యోతిర్విద్విరచితాయాం
జైమినీ సూత్రవ్యాఖ్యాయాం
సుబోధిన్యాం ద్వితీయాధ్యాయస్య
ద్వితీయపాదః॥

జైమినీయసూత్రములు.

# ద్వితీయాధ్యాయస్య

# తృతీయః పాదః.

---

సూ॥ విషమేతదాదిర్నవాంశః॥ ౧॥

వ్యా॥ అథ దశాభేదబలభేదాదీనాహ తత్రాదౌ నవాంశదశామాహ విషమే లగ్నే సతి తదాది ర్లగ్నాదిః నవాంశ దశాస్స్యాత్ అన్యథా సప్తమరాశౌ లగ్నే సత్యాదర్శాదిః సప్తమరాశ్యాదిర్నవాంశస్స్యాత్ ఆదర్శస్సమ్ముఖో భవతి సమ్ముఖరాశిః సప్తమ ఏవ భవతి ఏతద్దశాయాం ప్రతిరాశి నవనవాబ్దా భవన్తీతి నవాంశదశేతి నామధేయం జ్ఞేయం యత్తు॥ శ్లో॥ స్థిరరాశేష్షష్ఠరాశి శ్చరస్యాష్టమ ఏవసః। ద్విస్వభావస్యరాశిస్తు సప్తమస్సంముఖోమతః॥ ఇతి శ్లోకం కృత్వా సమ్ముఖత్వం పణ్డై రుక్తం తద్దృష్టిపర మేవనత్వన్యపరమ్॥

సూ॥ అన్యథాఽదర్శాదిః॥ ౨॥

వ్యా॥ అథ స్థిరదశామాహ స్పష్టమ్॥

టీ॥ విషమే=బేసిరాశియందు, తదాదిః = లగ్నము మొదలు, నవాంశః=నవాంశమగును, అన్యథా=సమరాశియందు, ఆదర్శాదిః= సప్తమరాశి మొదలు నవాంశయగును.

తా॥ ఇప్పుడు దశాభేదమును బలభేదమును చెప్పుచున్నవాడై ముందుగ నవాంశదశను నిరూపించుచున్నాడు. విషమరాశి లగ్నమగునేని లగ్నము మొదలుకొనియే నవాంశదశయగును. సమరాశి యగునేని సప్తమరాశి మొదలునవాంశదశాప్రారంభమగును. ఆదర్శ రాశియనఁగా సప్తమరాశి దానినే సంముఖరాశియనియు చెప్పుదురు. ఈదశావిషయములో ప్రతిరాశిలోను తొమ్మిది తొమ్మిది సంవత్సరములుకలవు కాఁబట్టి దానినే నవాంశదశయని చెప్పుదురు. శ్లో॥ స్థిరరాశేష్షష్ఠరాశి శ్చరస్యాష్టమ ఏవసః। ద్విస్వభావస్యరాశిస్తు సప్తమస్సంముఖోమతః॥ అనఁగా స్థిరరాశికి ఆఱవరాశియు చరరాశికి ఎనిమిదవ

రాశియు ద్విస్వభావరాశికి సప్తమరాశియు సంముఖరాసులనియు నర్థమిచ్చునట్టి యొకశ్లోకమును శ్రీమనిధిపండితులు కల్పించి చెప్పిరిగాని యదికాదు. వారుచెప్పినది ప్రథమాధ్యాయములో చెప్పిన దృష్టికి సంబంధమగునుగాని ప్రకృతాంశమునకు సంబంధించునదికాదు.

సూ॥ శశినందపావకాఃక్రమాదబ్దాఃస్థిరదశాయాం॥ 3॥

వ్యా॥ చరస్థిర ద్విస్వభావరాశీనాం క్రమేణ సప్తాష్టనవాబ్దా నియతాః స్థిరదశాయాం భవన్తీత్యర్థః తథాచ మేషే సప్తవృషేష్టౌ మిథునేనవ పునఃకర్కే సప్తేత్యాదిక్రమేణ ద్వాదశరాశిపర్యన్తమబ్దా జ్ఞాతవ్యాః॥

టీ॥ స్థిరదశాయాం = స్థిరరాశిదశయందు, శశినందపావకాః= 7, 8, 9 అని, అబ్దాః=సంవత్సరములు, క్రమాత్=వరుసగానగును.

తా॥ మేషమునకు 7 సంవత్సరములు వృషభమునకు 8 సంవత్సరములు మిథునమునకు 9 సంవత్సరములనియు చరస్థిరద్విస్వభావములకు జెప్పఁబడినది ఈవిధముగానే కర్కటము మొదలు మూడురాసులకును తులమొదలు మూడురాసులకును మకరముమొదలు మూడు రాసులకును దశాసంవత్సరములగును ఇట్లు స్థిరదశయందు నియతమైనవి.

సూ॥ బ్రహ్మాదిరేషా॥ 4॥

వ్యా॥ ఏతద్దశారమ్భస్థానమాహ ॥ ఏషాదశా బ్రహ్మగ్రహాది ర్బ్రహ్మగ్రహాశ్రితరాశి మారభ్య ప్రవర్తనీయేత్యర్థః॥

టీ॥ ఏషా=ఈదశ, బ్రహ్మాదిః = బ్రహ్మగ్రహముండిన రాశి మొదలుగాగలది.

తా॥ బ్రహ్మగ్రహమున్న రాశిమొదలుకొని దశలు ప్రారంభమగును.

సూ॥ అథ ప్రాణః॥ 5॥

వ్యా॥ అథ బలమధికరోతి అథానన్తరం ప్రాణోబలముచ్యతే॥

టీ॥ అథ=అనంతరము, ప్రాణః=బలము, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

సూ॥ కారకయోగః ప్రథమోభానాం॥ ౬॥

వ్యా॥ రాశీనామాద్యం బలం కారకయోగో భవతి॥

టీ॥ భానాం=రాసులకు, కారకయోగః = కారకయోగము, ప్రథమః=మొదటిది.

తా॥ రాసులయొక్క దశను విచారించు విషయమున కారకయోగము ముఖ్యముగ చూడవలెను.

సూ॥ సామ్యేభూయసా॥ ౭॥

వ్యా॥ గ్రహయోగసామ్యే ఉభయత్ర గ్రహసత్వే సతి భూయసా గ్రహయోగేన బలం భవతి గ్రహయోగభూయస్త్వాదిభి రపి సామ్యే నిర్ణాయకమాహ॥

టీ॥ సామ్యే=సమానమగుచుండగ, భూయసా=అధికబలమును విచారింపవలయును.

తా॥ రెండుపక్షములయందును గ్రహయోగము సమానముగ నున్నయెడల అధికబలమును విచారింపవలయును.

సూ॥ తతస్తుంగాదిః॥ ౮॥

వ్యా॥ తతో భూయస్త్వానన్తరం తుంగాదిర్బలంస్యాత్ రాశేస్తుంగస్వగృహస్థ మిత్రగృహస్థ గ్రహయోగః ప్రాణ ఇత్యర్థః॥

టీ॥ తతః=అనంతరము, తుంగాదిః=ఉచ్చరాశిస్థితి మొదలగు బలమును విచారింపవలెను.

సూ॥ నిసర్గస్తతః॥ ౯॥

వ్యా॥ అథరాశీనాం నిసర్గబలమాహ॥ తతస్తుంగాదిబలానన్తరం నిసర్గబలం గ్రాహ్యం చరాత్ స్థిరః స్థిరా ద్విస్వభావో బలీ త్యర్థః తదుక్తం బుధైః॥ శ్లో॥ అగ్రహాత్సగ్రహోజ్యాయాన్ సగ్రహేష్వధిక గ్రహః। సామ్యేచరస్థిరద్వంద్వాః క్రమాత్స్యుర్బ్బలశాలినః ఇతి॥

టీ॥ తతః=అనంతరము, నిసర్గః=స్వభావబలము.

తా॥ ఉచ్చస్థానాది బలమును విచారించినపిమ్మట స్వభావసిద్ధమగు బలమును విచారింపవలెను అదియెట్లనగా- శ్లో॥ అగ్రహాత్సగ్ర

హోర్జ్యాయోః సగ్రహేష్వధికగ్రహః। సామ్యేచరస్థిరద్వంద్వాః క్రమాత్పూర్వబలశాలినః ॥ గ్రహములులేని రాశికంటె గ్రహములున్నరాశి బలముకలది. గ్రహములున్నరాసులలో నధికగ్రహములుకలది అధికమైనది. రెండును బలము సమానముగ కలిగియున్నప్పుడు చరరాశికంటె స్థిరరాశియు స్థిరరాశికంటె ద్విస్వభావరాశియు క్రమముగ నొకదానికంటె నొకటి బలముకలదియని వృద్ధులు చెప్పినప్రకారముగ స్వభావసిద్ధమగు బలమును విచారింపవలయును.

సూ॥ తదభావేస్వామినఇత్థంభావః॥ ౧౦॥

వ్యా॥ రాశౌ తదభావే కారకయోగాద్యభావె స్వామినోరాశ్యధిపతే రిత్థంభావః కారకయోగాదిర్బలం యద్రాశినాథో బలవాన్సర్బలీతిభావః॥

టీ॥ తదభావే = కారకయోగాది బలములేని సమయమందు, స్వామినః = అధిపతియొక్క, ఇత్థంభావః = ఈచెప్పఁబడినబలమును విచారింపవలెను.

తా॥ రాశికి కారకయోగాది బలములేనప్పుడు తద్రాశ్యధిపతియొక్క బలమును విచారింపవలెను.

సూ॥ ఆగ్రియతోత్రవిశేషాత్॥ ౧౧॥

వ్యా॥ ఏకరాశౌ బహుగ్రహేషు సత్సు తేషాం రాశిద్వారక బలసామ్యేపి అత్రాస్మిన్గ్రంథే ఆగ్రాయతోగ్రహో విశేషాద్బలీభవతి అగ్రిమాయతః గతః అగ్రియతః అగ్రాయత ఏవ అగ్రాయతః అధికాంశక ఇతియావత్ తథాచ బహుగ్రహేష్వేకరాశిస్థేష్వధికాంశకో బలవానితి॥

టీ॥ అత = ఈగ్రంథమునందు, అగ్రియతః = అధికగమనము పొందినవాడు, విశేషాత్ = విశేషమువలన,

తా॥ ఒక్కరాశియందు బహుగ్రహములుండి వారందఱును సమానబలమే కలిగియుండినయెడల వారిలో నధికాంశకలవాడు బలవంతుడని యీగ్రంథమునందు చెప్పఁబడినది.

సూ॥ ప్రాతివేశికఃపురుషే॥ ౧౨॥

వ్యా॥ పురుషే ఓజరాశౌ ప్రాతివేశికః పార్శ్వరాశివర్తీ ద్వి ద్వాదశగతోపి గ్రహః స్వస్యబలకర్తాస్యాత్॥

టీ॥ పురుషే=బేసిరాశియందు, ప్రాతివేశికః = ప్రక్కనుండు గ్రహమును తీసికొనవలెను.

తా॥ అప్పుడును సమానబలమే కలిగియున్నప్పుడు ఆగ్రహము నకు ప్రక్కరాసులగు ద్వితీయ ద్వాదశస్థానములయందున్న గ్రహము బలకరమైనదగును.

సూ॥ ఇతిప్రథమః॥ ౧౩॥

వ్యా॥ ఇతిప్రోక్తప్రకారేణ ప్రథమః ప్రాణఉక్తఇత్యర్థః॥

టీ॥ ఇతి=ఈప్రకారము చెప్పఁబడినది, ప్రథమః=మొదటివిధ మైనబలము.

సూ॥ స్వామిగురుజ్ఞదృగ్యోగోద్వితీయః॥ ౧౪॥

వ్యా॥ స్వామియోగో గురుయోగో బుధయోగశ్చైకైకశో రాశీనాం బలం భవతి స్వామిదృష్టి ర్గురుదృష్టిః బుధదృష్టిశ్చైకైకశో ద్వాదశరాశీనాం బలంస్యాత్ ఏవం షడ్బలాని ద్వితీయః ప్రాణఇత్యభి ధీయతే ద్వితీయం భావబలమిత్యగ్రిమసూత్రే ద్వితీయం బలంగ్రాహ్య మితిస్పష్టీకృతం॥

టీ॥ స్వామిగురుజ్ఞదృగ్యోగః=రాశ్యధిపతి బృహస్పతి బుధుల యొక్క వీక్షణయోగము, ద్వితీయః=రెండవది.

తా॥ రాశినాథునియొక్కయు బృహస్పతియొక్కయు బుధుని యొక్కయు వీక్షణబలము రెండవది. ఈముగ్గురియొక్క వీక్షణము ద్వాదశరాసులకును ప్రత్యేకము బలమునిచ్చును. ఇట్లు షడ్బలమును విచారించుట రెండవది. రెండవది భావబలమని ముందుసూత్రములో చెప్పినప్రకారము రెండవబలమునుకూడ విచారింపవలయునని స్పష్ట పడుచున్నది.

సూ॥ స్వామినస్తృతీయః॥ ౧౫॥

వ్యా॥ స్వామినో రాశ్యధిపతేః వక్ష్యమాణః ప్రాణస్తృతీయః ప్రాణఇత్యర్థః॥

టీ॥ స్వామినః = రాశ్యధిపతియొక్క వీక్షణము, తృతీయః= మూడవబలము.

సూ॥ స్వాత్స్వామినఃకంటకాదిష్వపారదౌర్బల్యం॥ ౧౬॥

వ్యా॥ అథ స్వామి బలాబలే దర్శయతి స్వాదాత్మకారకాత్కంటకాదిషు కేన్ద్రపణఫరాపోక్లిమేషు స్వామినో పారదౌర్బల్యం భవతి కేన్ద్రేశూన్యం పణఫరే ఏకం ఆపోక్లిమె ద్విగుణం దౌర్బల్యం భవతి॥

టీ॥ స్వాత్ =ఆత్మకారకమునుండి, కంటకాదిషు = కంటకాది స్థానములయందు, అపారదౌర్బల్యం=అధికము దుర్బలముకలుగును.

తా॥ ఆత్మకారకస్థానమునుండియే కేంద్రస్థానములు కలవో వానియందు రాశినాథునకు అధికమగు దూర్బలము కలుగును. కేంద్రస్థానమందు బలమేమియు దౌర్బల్యముండదు దానికంటెపణఫరమందు ఒకభాగము దౌర్బల్యమెక్కువ ఆపోక్లిమమునందు దీనికంటె ద్విగుణ దౌర్బల్యము.

సూ॥ చతుర్థతఃపురుషే॥ ౧౭॥

వ్యా॥ చతుర్థతః పాపదృగ్యోగ ఇత్యాదినావక్ష్యమాణచతుర్థ బలాదపి పురుషే విషమరాశౌ బలం భవతీ త్యర్థః యత్తు చతుర్థతః ప్రథమాన్తాత్తసిరిత్యుక్త్వా పురుషే చతుర్థః ప్రాణ ఇతి కైశ్చిదుక్తం తదయుక్తం ఏవం చే న్మనే స్తాత్పర్యం తర్హి చతుర్థః పురుషే ఇత్యేవ బ్రూయాత్ చతుర్థం బలంకిమితి శంకానిరాసా యేతి చత్వార ఇత్య గ్రేవక్ష్యతి వను తద్బలమప్యత్రైవ కుతోనోక్త మితి చే ద్బలస్య సాంప్రతమనుపయోగా దుపయోగిబలముక్త్వా కాశ్చనదశాః ప్రదర్శ్య వక్ష్యతీతి॥

టీ॥ చతుర్థతః=నాల్గవబలమువల్లను, పురుషే = బేసిరాశియందు బలముండును.

తా॥ పాపగ్రహముయొక్క దృష్టియోగమున్నయెడల నాల్గవ విధమగు బలమని ముందు చెప్పఁబడును. దానివల్లనైనను బేసిరాశి బలముకలదియేయగును. "ప్రథమాంతాత్తసిః" అనెడు వ్యాకరణ

సూత్రమువలన పురుషరాశియందు నాల్గవబలము అని కొందఱు చెప్పిరి అదియుక్తమైనదికాదు. మునీశ్వరుని యభిప్రాయమదియేయైన యెడల "చతుర్థః పురుషే" అని సూత్రముండవలసియున్నది. నాల్గవ బలము అను శంకలేకుండుటకొఱకు "ఇతిచత్వారః" ఇట్లు నాల్గుబల ములు అని ముందుచెప్పబోవు సూత్రముకలదు ఆబలమునుగుఱించి చెప్పుట యిక్కడ ననుపయోగము కాఁబట్టి యిక్కడ నుపయోగకర మగు బలమునుచెప్పి కొన్నిదశలను చెప్పుచున్నాడు.

సూ॥ పితృలాభ ప్రథమప్రాణ్యాది శూలదశానిర్యాణే॥ ౧౮॥

వ్యా॥ అథ నిర్యాణశూలదశామాహ లగ్నసప్తమయోర్యః ప్రథమబలవాంస్తదాది గణనయా ప్రవృత్తదశా పాపదా లగ్నసప్త మాన్యతర త్రికోణ ౧-౫-౯ రాశిదశా తదా నిర్యాణం భవతీత్యర్థః అత్ర నవనవాబ్దా గ్రాహ్యాః పురుషే సమాః సామాన్య ఇతి సూత్ర స్యావక్తవ్యత్వాత్॥

టీ॥ నిర్యాణే=మరణమందు, పితృలాభప్రథమప్రాణ్యాదిశూల దశా=లగ్నసప్తమరాసులలో బలముకలరాశికి త్రికోణదశయని యో గమునుగుఱించి చెప్పవలయును.

తా॥ లగ్నసప్తమరాసులలో నేదిబలముకలదియో దానినుండి లెక్కపెట్టగ లగ్నపంచమ నవమ రాసులగు త్రికోణస్థానములలోనేది పాపదశయగునో దానియందు మరణమనిచెప్పవలయును. దశాగణన విషయములో తొమ్మిదితొమ్మిదిసంవత్సరములని తెలిసికొనవలయును.

సూ॥ పితృలాభపుత్రః ప్రాణ్యాదిః పితుః॥ ౧౯॥

వ్యా॥ పితుర్నిర్యాణదశామాహ లగ్నసప్తమయోర్యా పుత్ర రాశి నవమరాశీ తయోర్మధ్యే యో బలవాన్ తమారభ్య క్రమేణ ప్రవర్తితయా దశాయాప్రోక్తరీత్యా శూలదశాయాం పితుర్నిర్యాణం భవతి॥

టీ॥ పితృలాభపుత్రః=లగ్నసప్తమస్థానములకు పంచమనవమ రాసులుకలవో, ప్రాణ్యాదిః = వానిలోబలముకలది, పితుః=తండ్రికి మారకమైనది.

తా॥ లగ్నసప్తమస్థానములకు నేపంచమనవమరాసులుకలవ్వో వానిలో నేది బలముకలదియో ఆరాశినుండి లెక్కపెట్టగ దానికి త్రికోణరాసులలో పాపస్వభావముగల రాశిదశయందు తండ్రికి మరణముకలుగును.

సూ॥ ఆదర్శాదిర్మాతుః॥ ౨౦॥

వ్యా॥ మాతుర్నిర్యాణదశామాహ లగ్నాత్సప్తమాద్వా బలినశ్చతుర్థరాశేశ్శూలైః ౧-౫-౯ దశాయాం మాతుర్నిర్యాణంస్యాత్॥

టీ॥ మాతుః=తల్లియొక్కనిర్యాణము, ఆదర్శాదిః = సప్తమరాశి మొదలైనది.

తా॥ లగ్నమునకుగాని సప్తమస్థానమునకుగాని బలముగల చతుర్థస్థానమునుండియే త్రికోణరాసులుకలవ్వో ఆరాసులదశలలో తల్లియొక్క నిర్యాణముజరుగును.

సూ॥ కర్మాదిర్భ్రాతుః॥ ౨౧॥

వ్యా॥ లగ్నాత్సప్తమాద్వా బలిన స్తృతీయరాశే శ్శూలదశాయాం భ్రాతుర్నిర్యాణం॥

టీ॥ భ్రాతుః=సోదరునియొక్కనిర్యాణము, కర్మాదిః=తృతీయస్థానము మొదలుగాగలది.

తా॥ లగ్నమునకుగాని సప్తమమునకుగాని బలముగల తృతీయస్థానమునకు నేత్రికోణస్థానములుకలవ్వో ఆరాసులదశలలో సోదరుని నిర్యాణము జరుగును.

సూ॥ మాత్రాదిర్భగినీపుత్రయోః॥ ౨౨॥

వ్యా॥ మాతృ ఆదిరితి పదచ్ఛేదః లగ్నాత్సప్తమాద్వాబలినః పంచమరాశేః ప్రవృత్తశూలదశాయాం భగినీపుత్రయోర్నిర్యాణం॥

టీ॥ భగినీపుత్రయోః=తోబుట్టువుయొక్కయుఆమెకుమారుని యొక్కయు నిర్యాణము, మాత్రాదిః=అయిదవస్థానము మొదలు.

తా॥ లగ్నమునకుగాని సప్తమరాశికిగాని బలముగల పంచమస్థానమునకు యేత్రికోణరాసులుకలవ్వో ఆరాసులదశలలో తోబుట్టువు యొక్కయు మేనల్లునియొక్కయు నిర్యాణమును తెలిసికొనవలయును.

సూ॥ వ్యయాదిర్జ్యేష్ఠస్య॥ ౨3॥

వ్యా॥ లగ్నాత్సప్తమా ద్వా బలిన ఏకాదశరాశేః ప్రవృత్తాయాం దశాయాం తతః శూలదశాయాం జ్యేష్ఠభ్రాతుర్నిర్యాణం॥

టీ॥ జ్యేష్ఠస్య=అన్నయొక్క నిర్యాణము, వ్యయాదిః=ఏకాదశస్థానము మొదలు.

తా॥ లగ్నమునకుగాని సప్తమస్థానమునకుగాని బలముగల యేకాదశ రాశి దశయందైనను దానికి త్రికోణరాసులదశలయందైనను అన్నయొక్క నిర్యాణమును తెలియవలెను.

సూ॥ పితృవత్పితృవర్గః॥ ౨౪॥

వ్యా॥ లగ్నాత్సప్తమా ద్వా బలినో నవమరాశేః ప్రవృత్తాయాం దశాయాం తతః శూలదశాయాం పితృవర్గస్య పితృవ్యాదేర్నిర్యాణంస్యాత్॥

టీ॥ పితృవర్గః=తండ్రిసంబంధులు, పితృవత్ = తండ్రికివలెనే యగును.

తా॥ లగ్నమునకుగాని సప్తమస్థానమునకుగాని బలముగల నవమరాశియందైనను లేక దానికి త్రికోణరాసులదశలయందైనను పినతండ్రి పెత్తండ్రి మొదలగు తండ్రిసంబంధముగల వారినిగురించి విచారింపవలయును.

సూ॥ బ్రహ్మాదిపురుషేసమాదాసాంతాః॥ ౨౫॥

వ్యా॥ అథ బ్రహ్మదశా మాహ పురుషే విషమె జన్మలగ్నే సతి బ్రహ్మాది బ్రహ్మగ్రహాశ్రితరాశితో దశాః ప్రవర్తనీయాః సమాదాసాంతాః కోర్థః స్వరాశేష్షష్ఠ రాశిస్వామ్యన్తం సమాదశాబ్దాగ్రాహ్యాః నను దాసాంతశబ్దేన షష్ఠరాశి స్వామ్యన్తమిత్యర్థః కథ మితి చేచ్ఛృణు షష్ఠరాశ్యన్తవర్షానయనే సర్వేషాం సమత్వా ద్వా సప్తత్యుత్తరవర్షాభావాచ్చాయోగ్యత్వా త్స్వామ్యంత మిత్యర్థః సమ్పన్న ఇతి చేద్వర్షానయనే బ్రహ్మాదిగణనా తదా పురుషే బ్రహ్మాది సమాదాసాంతా ఇతి సూత్రం ప్రణీతంస్యాదిత్యలం॥

టీ॥ పురుషే=జన్మలగ్నము విషమరాశియైనప్పుడు, బ్రహ్మాది=బ్రహ్మగ్రహమున్నరాశిమొదలు, సమాః=సంవత్సరములు, దాసాంతాః=షష్ఠరాశ్యధిపతి రాశిపర్యంతము,

తా॥ జన్మరాశి బేసిరాశియైనయెడల బ్రహ్మగ్రహమున్నరాశి దశాసంవత్సరములు మొదలు షష్ఠరాశ్యధిపతియొక్క దశాసంవత్సరములు చివరవఱకు లెక్కపెట్టవలెను. స్వరాశిమొదలు షష్ఠరాశ్యధిపతి సంవత్సరముల చివరవఱకు గ్రహింపవలయును "దాసాంత" శబ్దముచే షష్ఠరాశ్యధిపతిపర్యంతమని యేవిధముగాననిన ఆఱవరాశియొక్క వర్షములపర్యంతమే చెప్పినయెడల నందరకు సంవత్సరములు సమానమేయగును మఱియు డెబ్బదిసంవత్సరములకుపైగావచ్చుటయు సంభవింపదు కాఁబట్టి రాశ్యధిపతిపర్యంతమని చెప్పఁబడినది కాఁబట్టి సంవత్సరములను లెక్కపెట్టవలసివచ్చినప్పుడు బ్రహ్మగ్రహముమొదలుగననియు నందు బేసిరాశి జన్మలగ్నమైన బ్రహ్మగ్రహముమొదలు షష్ఠరాశ్యధిపతిపర్యంతమనియు చెప్పఁబడినది.

సూ॥ స్థానవ్యతికరః॥ ౨౩॥

వ్యా॥ తత్ర స్థానవ్యతికరః సప్తమసమ్బన్ధోఽస్తి అయం భావః విషమే ఆదౌ బ్రహ్మాశ్రితరాశిదశా తతః క్రమేణాన్యేషాం సమే లగ్నే త్వాదౌ బ్రహ్మాశ్రిత సప్తమరాశిదశా తతో వ్యుత్క్రమేణాన్యేషాం రాశీనాం దశాః విషమే బ్రహ్మాది సమే తు బ్రహ్మాసప్తమాది క్రమవ్యుత్క్రమభేదేన దశా ఆనేయా ఇతి ఫలితార్థః॥

టీ॥ స్థానవ్యతికరః=స్థానములకు వ్యత్యాసముకలదు.

తా॥ ఇందుస్థానవ్యత్యాసముకలదు దీనియభిప్రాయమేమనగా బేసిరాశి జన్మలగ్నమైనయెడల బ్రహ్మగ్రహమున్నరాశి దశాసంవత్సరములుమొదలుగ క్రమముగ తరువాత రాసులదశాసంవత్సరములను లెక్కపెట్టవలయునని యిదివరలో చెప్పఁబడినది. సమరాశి జన్మలగ్నమైనయెడల ముందుగ బ్రహ్మగ్రహమున్నరాశికి సప్తమదశాసంవత్స

రమును లెక్కపెట్టుట ప్రారంభించి యారాశినుండి వెనుకకు లెక్క పెట్టవలయును. అనఁగా వృషభము జన్మరాశియగునేని వృషభము మేషము మీనము అని యీప్రకారము వెనుకకు లెక్కపెట్టవలయును. ఇట్లు చెప్పుటవలన విషమరాశి లగ్నమైనప్పుడు బ్రహ్మగ్రహాశ్రితరాశి దశాసంవత్సరములు మొదలు క్రమముగాను సమరాశి జన్మరాశియైన బ్రహ్మగ్రహమున్నరాశికి యేడవరాశి మొదలు వ్యుత్క్రమముగాను దశాసంవత్సరములను లెక్కపెట్టవలయును.

సూ॥ పాపదృగ్యోగస్తుంగాదిగ్రహయోగః॥ ౨౭॥

వ్యా॥ అథ చతుర్థబలమాహ పాపగ్రహాణాం దృష్టిర్యోగశ్చ రాశేర్బలంభవతి తుంగమూలత్రికోణ స్వర్క్షాతిమిత్రమిత్రరాశిస్థితశుభ గ్రహయోగశ్చ బలం స్యాదిత్యర్థః యత్తు తుంగా దీతి గ్రహయోగ విభాగం కృత్వా తుంగాది బలం గ్రహయోగబలంచేత్యుక్తం వస్తు తస్తన్న పాపదృగ్యోగ ఇతి సూత్రేణ పాపయోగ బలముక్తమేవగ్రహ యోగ ఇతి సూత్రేణైవ తదర్థ లాభాత్పాపదృగిత్యేవ వక్తవ్యే యో గపదం వ్యర్థఃస్యాత్ తస్మాత్పాపగ్రహాణాం యత్ర కుత్ర స్థితానా మపి యోగే బలం శుభగ్రహాణాం తుంగాదిస్థానామేవ యోగేబలం నత్వన్యత్రస్థానా మితి భావః ఇతిచత్వారః కారకయోగా ఇత్యాదినా త్రయః పూర్వోక్తా ఏకోయమితి చత్వారః ప్రాణా ఇత్యర్థః॥

టీ॥ పాపదృగ్యోగః=పాపగ్రహములయొక్క దృష్టియోగము, తుంగాదిగ్రహయోగః=ఉచ్చస్థితిగల గ్రహయోగము బలమని చెప్పఁ బడును.

తా॥ చతుర్థ బలమును చెప్పుచున్నాఁడు. పాపగ్రహముల యొక్క దృష్టియు ఆగ్రహములయొక్క సంబంధమును రాసులకు బలమగును. మఱియు ఉచ్చమూల త్రికోణ స్వక్షేత్ర అతిమిత్ర మిత్ర స్థానము మొదలగు రాసులయందున్న శుభగ్రహముల దృష్టియు ఆగ్రహములయొక్క కూటమియు బలకరమగును "తుంగాది" అను

పదమునుండి "గ్రహయోగః" అను పదమును విభాగముచేసి తుంగాది బలమనియు గ్రహయోగబలమనియు రెండువిధములుగా ప్రేమనిధి పండితులచే జెప్పఁబడినదిగాని యట్లు కానేరదు. పాపదృగ్యోగమని సూత్రములో పాపగ్రహయోగ బలము చెప్పఁబడినది. తర్వాత చెప్పఁబడెడు "గ్రహయోగః" అనెడు వాక్యముచేత వారు చెప్పినట్టి అర్థము వచ్చుచున్నది లేక "పాపదృక్" అని చెప్పినెడల 'యోగ' పదము వ్యర్థమగును. అందువలన పాపగ్రహము లెక్కడనున్నప్పటికి యోగమువిషయమై బలమగును. శుభగ్రహము లైతేఉచ్చ మొదలగు మంచిస్థానములయందున్నప్పుడే యోగమునుగుఱించిన బలమగును. ఇతరస్థానములయందున్నయెడల బలములేదు. కాఁబట్టి మూడుబలము లిదివఱకు చెప్పఁబడినవి. ఇప్పుడీబలము చెప్పఁబడినది కావున నాలుగు బలములని నిర్ణయింపఁబడినది.

సూ॥ పంచమేపదక్రమాత్ప్రత్యక్త్వం॥ ౨౮॥

వ్యా॥ పూర్వోక్తచరదశాయాం క్రమవ్యుత్క్రమభేదమాహ॥ త్రిభిస్త్రిభిర్రాశిభిరసమంచపదాని చత్వారి భవన్తి చక్ర ఇతి లగ్నాన్నవమె ఓజపదాన్తర్గతరాశిశ్చే త్క్రమాద్యుగ్మ పదాన్తరరాశిశ్చే ద్వ్యుత్క్రమాద్దశానేయా పూర్వం చరదశావర్షానయన మాత్ర ముక్తం క్రమవ్యుత్క్రమభేదస్తు నోక్తస్తస్మాదత్రోక్తం దశారంభావధేరనుక్తత్వా ల్లగ్నమేవాత్రగ్రాహ్యమితి॥

తా॥ మూఁడు మూఁడు రాసులచేత ఒక పదమగును. పండ్రెండురాసులు అట్టిపదములు నాలుగగును. పండ్రెండు రాసులు నాలుగుపదములుగల ఈచక్రములో లగ్నమునుండి తొమ్మిదవస్థానము విషమరాసులుగల పదములో రాశియైన క్రమముగాను, సమరాసులు గల పదములో రాశియైన వ్యుత్క్రమముగాను, దశను నిర్ణయింపవల యును. పూర్వము చరరాశి దశాసంవత్సరములను సాధించుట మాత్రము చెప్పఁబడినది. క్రమగణనము వ్యుత్క్రమగణనమును

గురించి చెప్పియుండలేదు. అందువలన నదిచ్చట చెప్పఁబడినది. దశారంభావది చెప్పఁబడలేదు కాఁబట్టి ఇచ్చట లగ్నమే ప్రారంభముగా గ్రహింపవలయును.

సూ॥ చరదశాయామత్రశుభః కేతుః॥ ౨౯॥

వ్యా॥ అస్యాం చరదశాయాం కేతుః శుభ శ్శుభగ్రహాఫలద ఇత్యర్థః॥

టీ॥ అత్ర=ఈగ్రంథమందు, చరశాయాం = చరదశయందు, కేతుః= కేతువు, శుభః=శుభఫలమునిచ్చువాడగును.

ఇతి శ్రీ నీలకంఠ జ్యోతిర్విద్విరచితాయాం
జైమినీ సూత్రవ్యాఖ్యాయాం
సుబోధిన్యాం ద్వితీయాధ్యాయస్య
తృతీయపాదః॥



# ద్వితీయాధ్యాయస్య
# చతుర్థః పాదః.

సూ॥ ద్వితీయం భావబలంచరనవాంశే॥ ౧॥

వ్యా॥ చరరాశేర్నవాంశదశాయాం భావబలం స్వామిగురుజ్ఞ దృగ్యోగ ఇతి ఫలాదేశాయగ్రాహ్యమిత్యర్థః॥

టీ॥ చరనవాంశే—చరరాశినవాంశమునందు, భావబలం—భావబలము, ద్వితీయం—రెండవది.

తా॥ (స్వామిగురుజ్ఞః) అని చెప్పఁబడిన సూత్రఫలానుసారముగ నిచ్చట చరరాశి నవాంశదశను విచారించునప్పుడు భావబలము రెండవదిగా శాస్త్రజ్ఞులు చెప్పిరి.

సూ॥ దశాశ్రయోద్వారమ్॥ ౨॥

వ్యా॥ అథ ద్వారబాహ్యరాశీన్దర్శయతి॥ స్పష్టం॥

టీ॥ దశాశ్రయః—దశాప్రారంభరాశి, ద్వారం—ద్వారరాశి యని చెప్పఁబడును.

తా॥ ఇప్పుడు ద్వారబాహ్యరాసులనుగుఱించి చెప్పుచున్నారు. దశాప్రారంభమైనరాశి ద్వారరాశియని చెప్పఁబడును.

సూ॥ తతస్తావతిథంబాహ్యం॥ 3॥

వ్యా॥ అస్మిన్కాలే యస్య రాశేర్యా దశా చరస్థిరపర్యాయతః తద్దశాశ్రయో రాశిర్ద్వారమిత్యుచ్యతే। ఏనమేవ పాకరాశిరితివ్యవహరన్తి లగ్నాద్యావత్సంఖ్యాకో ద్వారరాశి స్తస్మాత్తావత్సంఖ్యాకో రాశిర్బాహ్యమితినిగద్యతే ఏనమేవ భోగరాశింవదన్తి అత్రలగ్నశబ్దేన జన్మకాలే యద్రాశితః ప్రాథమికీ దశానమారభ్యతే సరాశిర్గ్రాహ్యః లగ్నం సప్తమోవా బలిష్ఠగ్రహాద్యాశ్రితరాశి ర్వాయథాయోగమాద్యదశాశ్రయరాశి రేవ పాకరాశే రవధి ర్నతు ప్రసిద్ధం లగ్నం ఏవంచేన్నోచ్యతే తర్హి "సఏవ భోగరాశిశ్చపర్యాయే ప్రథమేస్మృతః"

ఇతి వలగతి యత్రి సప్తమాద్బ్రహ్మశ్రితరాశితోవా దశా ప్రివృత్తి స్తత్రి యః పాకరాశిస్య ఏవభోగ రాశిరితినసమ్భవతితదుక్తంవృద్ధైః శ్లో॥ చరేనుక్షితమార్గతస్స్యాత్ షష్ఠషష్ఠాదికఃస్థిరే। ఉభయేకంటకా జ్ఞేయా లగ్నపంచమభాగ్యతః। చరస్థిరద్విస్వభావె స్వోజేషుప్రాక్క్రమోమతః। తేష్వేవతీ్రిషుయుగ్మేషు గ్రాహ్యంవ్యుత్క్రమతోఖిలం। ఏవముల్లిఖితోరాశిః పాకరాశిరితిస్మృతః। సఏవభోగరాశిశ్చ పర్యాయే ప్రిథమస్మృతః । లగ్నాద్యావతిథఃపాకః పర్యాయేయత్రిదృశ్యతే । తస్మాత్తావతిథోభోగః పర్యాయేతత్రిగృహ్యతాం । తదిదంచరపర్యా య స్థిరపర్యాయయోర్ద్వయోః। త్రికోణాఖ్యదశాయాంచ పాకభాగే ప్రికల్పనం॥ ఇతి పర్యాయె దశాయామిత్యర్థః॥

టీ॥ తతః = అనంతరము, తావతిథం = అంతసంఖ్యగలరాశి, బాహ్యం=బాహ్యరాశియగును.

తా॥ ఏకాలమందేరాశికి యేదశ చరస్థిరభేదముగ ప్రారంభిం పఁబడునో ఆ దశకాశ్రియభూతమగు రాశి ద్వారరాశియని చెప్పఁ బడును దీనినే పాకరాశియని చెప్పుదురు. లగ్నము మొదలు ద్వార రాశి యెంతసంఖ్యగలదియగునో ద్వారరాశినుండి అంతసంఖ్యగలది బాహ్యరాశియగును దీనినే భోగరాశియని చెప్పుదురు. జన్మకాలము నందు ఏరాశిమొదలుకొని ప్రిథమదశను ప్రారంభించి చెప్పిరో ఆ రాశియే యిచ్చట లగ్నశబ్దముచే చెప్పఁబడుచున్నది. లగ్నముగాని సప్తమరాశిగాని బ్రహ్మగ్రహము మొదలగు గ్రహములున్నరాశిగాని అప్పటికి సందర్భానుసారముగ మొదటిదశ యేరాశినుండి ప్రారంభిం పఁబడెనో ఆరాశియే పాకరాశికి అవధియైయున్నదిగాని ప్రసిద్ధలగ్నము కాదు అట్లుచెప్పినయెడల- శ్లో॥ సఏవభోగరాశిశ్చ పర్యాయేప్రిథమే స్మృతః॥ అనఁగా ఎక్కడ సప్తమమునుండిగాని బ్రిహ్మగ్రిహమున్న రాశినుండిగాని దశప్రారంభింపఁబడెనో అచ్చట నేదిపాకరాశియగునో అదియే భోగరాశియని చెప్పుటకు వీలులేదు. శ్లో॥ చరేఽనుక్షిత మార్గస్యాత్ షష్ఠషష్ఠాదికఃస్థిరే। ఉభయేకంటకాజ్ఞేయా లగ్నపంచమ భాగ్యతః। చరస్థిరద్విస్వభావే స్వోజేషుప్రాక్క్రమోమతః। తేష్వేవ

త్రిషుయుగ్మేషు గాహ్యంవ్యుత్క్రమతోఖిలం। ఏవముల్లిఖితో రాశిః పాకరాశిరితిస్మృతః । సఏవభోగరాశిశ్చ పర్యాయేపృథమేస్మృతః। లగ్నాద్యావతిథః పాకః పర్యాయేయత్రదృశ్యతే। తస్మాత్తావతిథోభోగః పర్యాయేతత్రగృహ్యతాం। తదిదంచరపర్యాయ స్థిరపర్యాయయోర్ద్వయోః। త్రికోణాఖ్యదశాయాంచపాకభాగేప్రకల్పనం॥ చరరాశియందు రాశినివిడువకుండగనే లెక్కపెట్టవలయును. స్థిరరాశియందు లగ్నమునకు నాఱవరాశియనియు తిరిగి ఆఱవరాశికి నాఱవరాశియనియు లెక్కపెట్టవలయును. ద్విస్వభావరాసులయందు లగ్నపంచమ నవమ రాసులనుగాను లెక్కపెట్టవలయును. చరస్థిర ద్విస్వభావములుగల రాసులైనను ఓజరాసులయందు పూర్వము చెప్పఁబడిన విధముగ క్రమముగానే లెక్కపెట్టవలయును. వానిలో మూడు సమరాసుల యందే వ్యుత్క్రమముగ లెక్కపెట్టవలయును. ఇట్లు లెక్కపెట్టగ మొదటిపర్యాయములో నదియే ద్వారరాశియనియు నదియే బాహ్యరాశియనియుజెప్పఁబడును. ద్వారరాశిని పాకరాశియనియు, బాహ్యరాశిని భోగరాశియనియునుచెప్పుదురు. లగ్నమునుండి యేపర్యాయములో పాకరాశి యెంతసంఖ్యగలదియగునో ఆపర్యాయములో నా పాకరాశికి బాహ్యరాశి అంతసంఖ్యగలదియగును. ఇట్లుచరస్థిరరాసుల పర్యాయములయందు పాకభోగములను కల్పింపవలయును.

సూ॥ తయోఃపాపేబంధయోగాదిః॥ ౪॥

వ్యా॥ అథ ద్వారబాహ్యయోః ఫలమాహ త్రిభి స్సూత్రైః తయో ర్ద్వారబాహ్యయోః పాపగ్రహే సతి తద్దశాయాం బన్ధాది స్స్యాత్ తదు క్తంవృద్ధైః ॥ శ్లో॥ పాకేభోగేచపాపాఢ్యే దేహపీడామనోవ్యథా ఇతి॥

టీ॥ తయోః = ఆరెండుస్థానములయందు, పాపే=పాపగ్రహయోగము కలిగియుండగ, బంధయోగాదిః=బంధనము మొదలగునవి కలుగునని శాస్త్రవేత్తలుచెప్పిరి.

తా॥ ద్వారబాహ్యరాసుల రెంటియందును పాపగ్రహములున్నను నారాసులదశలయందు బంధనాదికము కలుగును ఇందును

గుఱించి వృద్ధులు చెప్పినదేమనఁగా- శ్లో॥ పాకేభోగేచపాపాఢ్యే దేహపీడామనోవ్యథా॥ పాకభోగరాసులకు పాపగ్రహసంబంధమున్న యెడల దేహపీడ మనోవ్యాధియు కలుగును.

సూ॥ స్వక్షేఽస్యతస్మిన్నోపజీవస్య॥ ౫॥

వ్యా॥ తస్మిన్ద్వారేబాహ్యేవారాశౌ పాపాశ్రయీభూతేఽస్య పాపస్య పరంతూపజీవస్య ఉపసమీపే జీవ్యో యస్యేతి గురుసమీపవర్తినః స్వక్షేత్రే స్థితౌ సత్యాం న బన్ధాదిరిత్యర్థః పాకభోగాశ్రితః పాపో యదిస్వక్షేత్రే గురుయుక్తదోషోనేతియావత్॥

టీ॥ అస్య=ఈపాపగ్రహము, ఉపజీవస్య = బృహస్పతిసమీపమందుండినవాడగుచుండగ, తస్మిన్=ఆరాశి, స్వక్షే=స్వక్షేత్రమగుచుండగను, న=లేదు.

తా॥ పాకరాశియందుగాని భోగరాశియందుగాని పాపగ్రహమున్నను ఆపాపగ్రహమునకారాశి స్వక్షేత్రమై బృహస్పతితోఁ గూడియుండినయెడల వెనుక చెప్పఁబడిన బంధనాదికము కలుగదనియు యభిప్రాయము.

సూ॥ భగ్రహయోగోక్తం సర్వమస్మిన్॥ ౬॥

వ్యా॥ అస్మిన్ద్వారే బాహ్యేవా రాశిఖేటాభ్యాం యాతాయె యోగాస్తేషూక్తం సర్వం శుభాశుభం ఫలంవేదితవ్యమిత్యర్థః॥

టీ॥ అస్మిన్=దీనియందు, భగ్రహయోగోక్తం = రాశిగ్రహయోగములవిషయమై చెప్పఁబడిన, సర్వం=సమస్తశుభాశుభఫలములు వర్తించును.

తా॥ ఈద్వారబాహ్యరాసుల విషయమై రాశిగ్రహయోగాయోగములనుగుఱించి చెప్పఁబడినప్రకారముగ సమస్తశుభాఽశుభ ఫలములను దెలిసికొనవలయును.

సూ॥ పితృలాభపాణితోయం॥ ౭॥

వ్యా॥ అథర్క్షేందద్రిదశారమ్భస్థానభేదం దర్శయతి లగ్నసప్తమయోర్బలవాన్రాశిస్తస్మాదయం వక్ష్యమాణదశాక్రమో జ్ఞేయ

స్త్రం రాశి మారభ్య దశాప్రవర్తనీయేతియావత్ తదుక్తం వృద్ధైః॥
శ్లో॥ బలినశ్శుక్రశశినోః కేంద్రాభ్యాంతుదశాంనయేత్ । పురుషశ్చేత్తతోనేయా స్త్రీచేద్దర్పణతోనయేత్॥ అయమర్థః పురుషోజాతకవాంశ్చేల్లగ్నసప్తమయోర్బలవతోర్దశానేయా స్త్రీజాతకవతీచేద్బలవత్సప్తమాద్దశానేయేతి॥

టీ॥ అయం = ఈదశారంభము, పితృలాభపాణితః=లగ్నసప్తమస్థానములలో బలముగల రాశినుండి ప్రారంభింపవలయును.

తా॥ కేంద్రదశారంభస్థానభేదమును జెప్పుచున్నాఁడు. లగ్నసప్తమరాసులలో బలముగలరాశినుండి దశాప్రారంభము చేయవలయును ఇందునుగుఱించి వృద్ధులు చెప్పినదేమనఁగా- శ్లో॥ బలినశుక్రశశినోః కేంద్రాభ్యాంతుదశాంనయేత్ । పురుషశ్చేత్తతోనేయా స్త్రీచేద్దర్పణతోనయేత్॥ అనఁగా బలముగలశుక్రునియొక్కయు చంద్రునియొక్కయు దశను సాధించునప్పుడు బలముగల లగ్నసప్తమస్థానములనుండి నిర్ణయింపవలయును. ఈవిధానము పురుషుని జాతకవిషయమైనది. స్త్రీజాతక విషయములో బలముగల సప్తమరాశినుండియే దశను గ్రహింపవలయును.

సూ॥ ప్రథమేప్రాక్ప్రత్యక్త్వం॥ ౮॥

వ్యా॥ కేంద్రదశాక్రమభేదానాహ సూత్రైః ప్రథమం చరరాశౌ లగ్నే సప్తమేవా సతి బలవల్లగ్నసప్తమాన్యతరరాశిరనుజ్ఝితమార్గేణ దశాక్రమస్స్యాత్ తత్రౌజయుగ్మప్రదభేదాత్ప్రాక్ప్రత్యక్త్వం క్రమోత్క్రమత్వం ప్రథమ ద్వితీయాది ద్వాదశాది రీత్యాజ్ఞేయమిత్యర్థః యత్తు సామాన్యపరిభాషాతః ప్రాక్ప్రత్యక్త్వం ప్రాప్తమేవాతత్రత్య ప్రాక్ప్రత్యక్త్వ పదమనుజ్ఝితక్రమపదమితి వృద్ధైరుక్తం తన్న సామాన్యపరిభాషాయా దశానయనపరత్వాత్ నచైవసత్యనుజ్ఝితక్రమరూపో యోనస్యాదితివాచ్యం స్థిరద్వ్యంగయోఃవక్ష్యమాణత్వాదత్రాక్షేపాదేవతల్లాభాత్ అన్యథాలాఘవాత్ప్రథమె క్రియత ఇత్యేవం బ్రూయాత్ అత్రత్యం పంచమె పదక్రమాదితి సూత్రోక్తంచ ప్రాక్ప్రత్యక్త్వపదం దశాక్రమేణ సామాన్యపరిభాషాఽప్రాప్తలింగం॥

టీ॥ ప్రథమే=చరరాశి లగ్నసప్తమ రాసులలో నేదైననైన యెడల పూర్వోక్తమార్గ క్రమముగానే దశను నిర్ణయింపవలయును; ప్రాక్ప్రత్యక్త్వం=ఓజయుగ్మరాసులయందు క్రమముగాను వ్యుత్క్రమముగాను దశనునిర్ణయింపవలయును.

తా॥ చరరాసులలో లగ్నముగాని సప్తమరాశిగాని యైన యెడల క్రమముగానే దశను నిర్ణయింపవలయును. కాని యందును ఓజరాసులకు క్రమముగాను యుగ్మరాసులకు వ్యుత్క్రమముగాను గణనచేయవలయును.

సూ॥ ద్వితీయేరవితః॥ ౯॥

వ్యా॥ ద్వితీయె స్థిరరాశౌ లగ్నె సప్తమే వా సతి బలవల్లగ్న సప్తమాన్యతమరాశేః ఓజయుగ్మపదభేదా త్క్రమోత్క్రమాభ్యాం రవితః షష్ఠషష్ఠక్రమేణ దశాప్రవృత్తిర్జ్ఞేయేత్యర్థః॥

టీ॥ ద్వితీయే=స్థిరరాశియందు, రవితః = ఆఱవరాశి మొదలు కొని గ్రహింపవలెను.

తా॥ లగ్నముగాని సప్తమరాశిగాని బలముకలదియై స్థిరరాశి యైనయెడల వానిలో బలముగలరాశినుండి ఓజయుగ్మభేదమున క్రమముగాను వ్యుత్క్రమముగాను ప్రారంభరాశికి నాఱవదిగాను దానికి నాఱవదిగాను ఈప్రకారము గణనచేయవలయును.

సూ॥ పృథక్క్రమేణతృతీయేచతుష్టయాది॥ ౧౦॥

వ్యా॥ తృతీయె ద్విస్వభావరాశౌ లగ్నె సప్తమేవా సతి బలవల్లగ్న సప్తమాన్యతమరాశే శ్చతుర్థాది కేన్ద్రాదితః పృథ క్క్రమేణ లగ్నపంచమ నవమాదితః ఓజయుగ్మ పదభేదా త్క్రమోత్క్రమాభ్యాం దశాప్రవృత్తిస్స్యాత్ లగ్నసప్తమాన్యతర కేన్ద్ర త్ప్రథమం తతః పంచమపణఫరతః తతో నవమాపోక్లిమతో దశాప్రవృత్తిర్జ్ఞే యేతి యావత్ అత్రనవనవాబ్దాగ్రాహ్యాః ఏతత్సూత్రత్రయస్య ఫలితార్థోవృద్ధైః॥ శ్లో॥ చరెనుస్థితేమార్గస్స్యా త్షష్ఠషష్ఠాదికఃస్థిరె। ఉభయెకంటకాజ్జేయా లగ్నపంచమభాగ్యతః। చరస్థిరద్విస్వభావేష్వేషు

ప్రాక్ప్రోమాతః। తేష్వేవత్రిషు యుగ్మేషు గ్రాహ్యం వ్యుత్క్రమతో ఖిలం॥ ఓజేషు ఓజపదేష్విత్యర్థః॥

టీ॥ తృతీయే = ద్విస్వభావరాశియైనయెడల, చతుష్టయాది= నాల్గవరాశిమొదలు, పృథక్ = వేరుగాను, క్రమేణ = లగ్నపంచమ నవమరాసులనుండియు లెక్కింపవలయును.

తా॥ లగ్నముగాని సప్తమరాశిగాని ద్విస్వభావరాశి యైన యెడల ఆరెండు రాసులలో బలముగలరాశినుండి చతుర్థస్థానము మొదలగు కేంద్రస్థానము మొదలుగాను లగ్నపంచమనవమాదిగాను ఓజ యుగ్మభేదముగ క్రమగణనము వ్యుత్క్రమగణనము చేయవలయును. ముందుగ లగ్నసప్తమకేంద్రములలో నేదియైనను పిమ్మట పంచమ రాశిని అటుపిమ్మట నవమరాశిని ప్రారంభింపవలయును. ఇచ్చట రాశికి తొమ్మిదితొమ్మిది సంవత్సరములని తెలిసికొనవలయును. ఓజ మనఁగా ఓజరాసులుగల పదముగ గ్రహింపవలెను.

సూ॥ స్వకేంద్రస్థాద్యాః స్వామినోనవాంశానాం॥ ౧౧॥

వ్యా॥ అథ కారక కేంద్రాదిదశామాహ నవాంశదశాబ్దానాం స్వకేంద్రస్థాద్యాః కారక కేంద్రస్థాద్యా రాశయస్స్వామినో భవన్తి అథా కేంద్రస్థాస్తతః పణఫరస్థాస్తత ఆపోక్లిమస్థాస్తతోపి బలాధికస్య ప్రథమ మితి క్రమేణ సర్వాదుర్బలాన్తం నేయ మితియావత్ తదుక్తమాచార్యైః॥ శ్లో॥ ప్రతిభం నవవర్షాణి కారకాశ్రయరాశితః। జన్మ సంపద్వివత్తేషు ప్రత్యరిస్సాధకోవధః। మైత్రం పరమమైత్రంచే త్యేవమంతర్దశాంనయేత్॥ ఇతి కించ స్వకేంద్రస్థాద్యా గ్రహాః నవాంశానాం నవగ్రహ దత్తానా మబ్దానాం స్వామినో భవన్తీతి అయమప్యర్థః సూత్రకార సమ్మత ఏవ అన్యథాసతల్లాభయోరిరిసూత్రస్య వైయర్థ్యంప్రసంగాత్ అబ్దావయనంత్వగ్రేవదిష్యతి॥

టీ॥ నవాంశానాం=నవాంశదశాసంవత్సరములకు, స్వకేంద్రస్థాద్యాః=కారకకేంద్రము మొదలగు రాసులు, స్వామినః=ఆధిపత్య ముకలవి, భవంతి=అగుచున్నవి.

తా॥ నవాంశదశాసంవత్సరములు కారకకేంద్రము మొదలుగా గ్రహింపవలయును. ఎట్లనగా ముందుగ కారకకేంద్రమందును అనంతరము పణఫరస్థానమందును అనంతరము ఆపోక్లిబస్థానమందును విచారింపవలయును. మఱియు వారిలో నెక్కువ బలముగలవానికి ముందుగ తీయవలయును. బలహీనమయినవానికి చిట్టచివఱకు తీయవలయును ఇంకనుగుఱించి వృద్ధవాక్యము- శ్లో॥ ప్రతిభంనవవర్షాణి కారకాశ్రయరాశితః । జన్మసంపద్విపత్క్షేమః ప్రత్యరిస్సాధకోవధః । మైత్రంపరమమైత్రంచే త్యేవమంతర్దశాంనయేత్ ॥ కారకాశ్రియభూతమగు రాశిమొదలు ప్రతిరాశియును తొమ్మిదితొమ్మిదిసంవత్సరములుగలవియై యాతొమ్మిదిసంవత్సరములలోను జన్మతార మొదలగు తొమ్మిదితారలవఱకు మనము ఫలితమునుచూనుకొనుచుండెడి ప్రకారము ప్రతిసంవత్సరమునకు అంతర్దశాఫలితము నిచ్చునని చెప్పిరి. మఱియు కారకకేంద్రము మొదలగు కేంద్రములయందున్నగ్రహములు నవగ్రహములచే నీయబడిన సంవత్సరములకు నధిపతులగుదురు. ఈ యర్థముకూడ సూత్రసమ్మతమైనది అట్లుకానియెడల "సతల్లాభయో॥" అనునట్టి సూత్రమునకు వ్యర్థత్వమువచ్చును. సంవత్సరములను నిర్ణయించుటనుగుఱించి ముందుచెప్పఁబడును.

సూ॥ పితృచతుష్టయవైషమ్యబలాశ్రయఃస్థితః॥ ౧౨॥

వ్యా॥ కేంద్రదశామపరామాహ పితృచతుష్టయేషు లగ్నాది కేన్ద్రేషు వైషమ్యబలాశ్రయోధికబలయుక్తోరాశిః ప్రథమదశాప్రదః స్థితః పర్యవస్థితః నవాంశామిత్యనువృత్యా ప్రతిరాశి నవనవాబ్దాగ్రాహ్యాః తథాచ కేన్ద్రపణఫరాపోక్లిబానాం బలాధికస్య ప్రథమమితి క్రమేణ సర్వాదుర్బలాన్తందశానేయేతి॥

టీ॥ పితృచతుష్టయ=లగ్నాది నాలుగుకేంద్రములలోను, వైషమ్యబలాశ్రయః=అధికబలముగలరాశి, స్థితః=ముందుగనుందును.

తా॥ మఱియొక విధమగు కేంద్రదశను జెప్పుచున్నాడు. లగ్నాది నాలుగు కేంద్రములలో నధికబలముగలరాశి ముందుగ దశనిచ్చునదియగును. నవాంశలని చెప్పుటచే ప్రతిరాశిలోను తొమ్మిది

తొమ్మిది సంవత్సరములు దశాసంవత్సరములుగ గ్రహింపవలయును. ఆప్రకారము చేయుటచే కేంద్రపణఫరఆపోక్లిమములలో నేదియొక్కువ బలముకలదియో దానిని ప్రథమదశారాశినిగాను దానికంటె తక్కువ బలముకలదానిని తర్వాతను అంతకంటె దుర్బలమైనదానిని దాని తర్వాతను విచారింపవలయును.

సూ॥ సతల్లాభయోరావర్తతే॥ ౧౩॥

వ్యా॥ కారకాది గ్రహదశాబ్దానయనమాహ॥ సకారకః తల్లాభయోర్లగ్నసప్తమయోరావర్తతే అయమాశయః లగ్నాత్సప్తమాచ్చక్రిమోత్క్రమగణనయా కారకపర్యన్తం రాశిసంఖ్యాయత్రాధికా సాబ్దరూపా కారకగ్రహదశా అన్యేషాంతు గ్రహాత్కారకపర్యన్తం విషమ సమపదానురోధేన క్రమవ్యుత్క్రమగణనయాసంఖ్యాస్యాత్తత్తద్గ్రహాబ్దాః కారకగ్రహయుక్తగ్రహాణాంతు కారకాబ్దతుల్యావహాబ్దా భవన్తీతి ఇయంగ్రహదశాద్యైరుక్తా॥ శ్లో॥ లగ్నాత్కారకపర్యన్తం సప్తమాద్వాదశాంనయేత్। ఉభయోరధికాసంఖ్యా కారకస్యదశాస్సమాః। తద్యుక్తానాంతుతత్తుల్యం ప్రత్యేకంస్యుర్దశాఃక్రమాత్। గ్రహాఃకారకపర్యన్తం సంఖ్యాన్యస్యదశాభవేత్। కారకస్తద్యుతశ్చాదౌ తత్కేంద్రాదిస్థితాస్తతః। దశాక్రమేణవిజ్ఞేయాః॥ శుభాశుభఫలప్రదాః॥ ఇతి॥

టీ॥ సః=ఆకారకుఁడు, తల్లాభయోః = లగ్నసప్తమస్థానముల యందు, ఆవర్తతే=క్రమోత్క్రమముగ గణనము చేయఁబడును.

తా॥ కారకాది గ్రహములయొక్క దశాబ్దముల గణనను గుఱించి చెప్పుచున్నాఁడు. లగ్నమునుండియు సప్తమరాశినుండియు క్రమముగాను వ్యుత్క్రమముగాను కారకపర్యంతము లెక్కపెట్టగ కారకసంఖ్య యెచ్చట హెచ్చుగానుండునో అదియేసంవత్సరస్వరూపమగు కారకగ్రహదశయగును. అన్యమైనవానికి గ్రహము మొదలు కారకరాశిపర్యంతము విషమపదముసమపదము అనునట్టిరీతిచేక్రమము గాను వ్యుత్క్రమముగాను లెక్కపెట్టగా వచ్చినసంఖ్య ఆయాగ్రహముల సంవత్సరములగును. కారకగ్రహములతోకూడిన గ్రహములకు

